


విఠల్ ప్రొడక్షన్స్ వారి

# కనకదుర్గ పూజా మహిమ

కృష్ణకుమారి - కాంతారావు - రాజనాల - ముక్కామల
మిక్కిలినేని - బాలకృష్ణ - సత్యనారాయణ - మాధురి...

నిర్మాత-దర్శకత్వం B. విఠలాచార్య. సంగీతం రాజన్-నాగేంద్ర



## మనమూ-మనదేహస్థితీ

'మీ (మా) పత్రికలో ప్రచురించుచున్న 'మనమూ-మన దేహస్థితీ' అను శీర్షిక సక్రమముగ నడచుచున్నది. ఇది వయోజనులకేగాక మా వంటి విద్యార్థులకుకూడ ఉపయోగకరముగనున్నది. దీనిపై ప్రశ్నావళి జరిపిన బాగుండునని యోచన.

శ్రీవి హరనాథబాబు (గుంటూరు)

* * *

మీ పత్రికలో "మనమూ-మనదేహస్థితి" అను శీర్షిక పాఠకలోకానికి జ్ఞానాన్నిస్తూ ఉంది. వ్యాధుల నివారణకు కూడా సలహాల

# ఉత్తరాలు

నిస్తే ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబాలకు చాలా సహాయంచేసినట్లుండును.

ఎస్. స్వర్ణకుమారి (పార్వతీపురం)

* * *

మీరు ప్రారంభించిన "మనమూ-మనదేహస్థితీ" అను శీర్షిక చాలా బాగుంటున్నది. ఇది చదువుటవలన వ్యాధులనుగురించి తెలియుచున్నది. కాని వాటినివారణోపాయము అందుకు తగిన ఔషధములు కూడా చాలా ముఖ్యము. అవికూడా మీరు ప్రచురించిన చాలా బాగుంటుంది. అవికూడా ప్రజలకు ఎంతో ముఖ్యము. ప్రశ్నలకు సమాధానములు కూడా ఇవ్వవలెను అని నాకోరిక.

టి. వెంకట్రామయ్య (భీమవరం)

* * *

### ఒకసలహా

ఆంధ్రుల అభిమానపత్రికారాజము "ఆంధ్రసచిత్ర వారపత్రిక" ముఖచిత్రము

చిమి బాగుండడములేదు. ఆ పత్రికలో ప్రచురించిన విడైన కథలోని ముఖ్య సన్నివేశమును ముఖచిత్రముగా ప్రచురించిన చాల బాగుగానుండును.

ఎస్. సుధాకర్ (పలమనేరు)

* * *

## కార్టూన్

9-11-60 తేది సచిత్ర వారపత్రిక మాకు ఎంతో నచ్చినది. అందులో 'సైకిలు వేసికొని అడుక్కునేవాడి' కార్టూను, "ఒరేయ్ ఆగిపోయావేమిటి...? కదులు—" అనే బహుమతిపొందిన కార్టూను మా కెంతో నవ్వుపుట్టించినాయ్,

తిర్లుక చలపతిరావు (ఇంటూరు)

* * *

నా అభిమాన ఆంధ్రసచిత్ర వారపత్రిక యందు చిత్రలేఖనమునకు యెక్కువ ప్రాధాన్య మిస్తూఉన్నారు. అది నా కెంతో సంతోషంగా ఉన్నది.

బి. నారాయణ (చిత్తూరు)

* * *

## చలనితల్లి 'చక్కనిప్రక్రియ'

బాలసాహిత్యానికి 'చల్లనితల్లి' వంటి కథలు చాలా అవసరం. కథను కవితతో ప్రారంభించి కవితతోనే ముగించడం శ్లాఘనీయం, చక్కనిప్రక్రియ. అనవసరమైనపాత్ర ఒక్కటలేదు. కథ కరుణరసంలోనిండి చల్లని పానీయంలా వుంది. పిల్లలనేకాదు; పెద్దలను కూడా అలరించింది 'చల్లనితల్లి'

ఎ. వి. ఎస్. ఎన్. చౌదరి (పులిచెర్ల)

* * *

## ఉషాకన్యకథ

ఈవారం పత్రిక (9-11-60) సర్వాంగ సుందరిగా అలంకరించుకొని మా చెంతకు చేరింది. ఉషాకన్యకథను ఇంత త్వరితంగా ముగిస్తారనుకోలేదండీ! అయినా కథాసంవిధానము రసవత్తరంగా నడిచింది. కొత్తసీరియల్ కోసం ఎదురు చూస్తూంటాం! ఇక సెలవ్ !

ఎస్. భానుశ్రీ (తాడేపల్లిగూడెం)

* * *

ఇంకా చాలా ఉంటుందనుకొన్న "ఉషాకన్య కథ"ను హఠాత్తుగా ముగించినప్పటికిని చాలా బాగుంది. ఎస్. పి. రంగారావు, (గుంటూరు)

* * *

## తెలుగు వెలుగులు

మీరు వ్రాసినట్లు, వాస్తవంగా సదాశివబ్రహ్మం కథాశివబ్రహ్మమే. సినిమా కథలు వ్రాయడంలో ఆయన కాయనే సాటి. "కథాబ్రహ్మ" బిరుదప్రదానం చేసి ఆంధ్రులింతవరకే కీర్తిని గౌరవించుకొని యుండవలసినది. ఇప్పటికైనా తెలుగు వెలుగులలో పరిచయం చేసినందుకు సాధన్యవాదాలు. వ్యాసకర్త ఎవ్వరు పరిచయమౌతారో ?

కుం॥ రాఘవరావు, (హైదరాబాద్)

* * *

9-11-60 వ తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన 'తెలుగువెలుగులు' అను శీర్షికలో సినీ రచయిత సదాశివబ్రహ్మం గారినిగురించి వ్రాయడం ఆంధ్రదేశానికెంతో గొప్పతనము. వీరు అడుగంటిపోయిన రచనలకు ప్రాణంపోసి ప్రజాదరణలనుపొందునట్లు చేయుచు సినీజీవితములోని కష్టముల

...నెదుర్కొని గొప్ప వ్యక్తిగా పేరుగడించారు. శ్రీ సదాశివ బ్రహ్మంగారిని కథా శివ బ్రహ్మంగా వర్ణించి చెప్పుట అక్షరాలా నిజం. బొమ్మకూడ చాల బాగా వేసినారు. రచయితకు నా అభివందనములు తెలుపుచున్నాను.

ఎస్. పాపారావు (గుంటూరు)

*　　*　　*

## నక్షత్రశాస్త్రం ముఖ్యం!

మీ చిత్ర, విచిత్ర, సచిత్ర పత్రిక చాలా బాగుంది. ఇందులో "ఉత్తరాలు" శీర్షిక ఉంచటంద్వారా చాలామంది పాఠకుల అభిప్రాయములు తెలుస్తున్నవి. వీటన్నిటితో పాటుగా నక్షత్రశాస్త్రము కూడా ప్రవేశ పెట్టవలెనని నా ప్రార్థన. దాని ద్వారా గ్రహములు మొ॥గు బాహ్యప్రపంచపువిషయములు, వాటికి మానవునకు గల సంబంధము అందరికి విశదమగును.

ఎస్. ఎం. షా,
(ఆంధ్రయూనివర్సిటీ-వాల్తేరు)

*　　*　　*

# ఉత్తరాలు

## "ఓ ప్రభూ"

9-11-60 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో కవితా కింకిణి పోటీలో బహుమతి పొందిన గేయం "ఓ ప్రభూ!" ఎంతయు బాగున్నది.

గద్దె వీరభద్ర చౌదరి (చింతలపూడి)

*　　*　　*

## 'రాశిఫలాలు' సెంట్ పర్సెంట్ కరెక్టు

ఆంధ్రుల అభిమాన "సచిత్ర వారపత్రిక" వచ్చి రావడంతోనే, ముందు నా రాశిఫలం చదువుకొన్న తరువాత మిగతా... ఈ రాశిఫలాలు మూడు వారములనుండి గమనిస్తున్నాను. ఫలితములు మాత్రము దివ్యంగా ను. తప్పకుండా ఫలిస్తునేఉన్నాయి. ముఖ్యముగా మీ (మా) పత్రికలో ఈ వారఫలాలు వలన ప్రతి ఒక్కరికి కంటికి రెప్పలా, మున్ముందు జరుగనున్న ఫలితాల (కష్ట సుఖాల)ను చదివి తగిన జాగ్రత్త వహించుటకు మంచి అవకాశము కల్పించుచున్నారు.

అచ్చుకోలు కోటేశ్వరరావు నాయుడు
(గుంటూరు-3)

*　　*　　*

## అట్టమీద బొమ్మ

9-11-60 ఆంధ్రపత్రికమీద ముఖచిత్రం బొమ్మ (కృష్ణకుమారిది) విఠల్ ప్రొడక్షన్సు వారి "కనకదుర్గ"లోనిది అని మీరు ప్రచురించారు. కాని అది మహేశ్వరివారి "రమాసుందరి"లోనిది. ఇది మీ పొరపాటో లేక అచ్చు పొరపాటో తెలియజేయండి.

తటవర్తి శరభారాజు (రాజోలు)

*　　*　　*

* పొరపాటు. అది మహేశ్వరివారి రమాసుందరిలోనిదే. ★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక



Founder
K. Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 55
సంచిక 12

23-11-60
బుధవారం

శార్వరి మార్గశిర శుద్ధ పంచమి



విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
**మ జి లీ**
చిత్రకారుడు—తేజోమూర్తుల కేశవరావు (మద్రాసు)



## క థ కా ని క థ

కథకాని కథల పోటీకి రచనలు పంపేవారు కొంతమంది తమ రచనలు కేవలం చిన్న చీటీముక్కలమీద వ్రాసి పంక్తిలో పంక్తిని ఇరికిస్తున్నారు. ఇలాంటివి పరిశీలించటం కష్టం కాబట్టి రచనలు పంపేవారు రచనకుతగ్గసైజు కాగితంమీద పంక్తికి పంక్తికీ మధ్య బాగా ఖాళీవదలుతూ వ్రాయాలని కోరుతున్నాము. కాగితాలకు ఒకవైపునే వ్రాయడం కూడా అవసరం.

—సంపాదకుడు





**జి. వి. ఆర్. రాజా (ఖిలై)**

ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి ప్రత్యేక సంచిక బాలల చిత్రలేఖనం పోటీలో ప్రత్యేక బహుమతి పొందిన బాలుడు.




త్రిమూర్తి కెన్నెడీ
అమెరికా రాజ్యాంగ చట్టం అనుసరించి అధ్యక్షుడు, ప్రభుత్వాధినేత, సర్వ సైన్యాధ్యక్షుడు కూడా ఒకరే


పచ్చి శృంగారానికి సంబంధించిన చిత్రాలు తగులబెట్టమని వినోబాజీ ఆదేశం


మరి సినీమాల మాటో?


ఎన్నికల కుస్తీకి ఆయత్తమౌతున్న
స్వతంత్ర (పార్టీ) వస్తాదులు



# తెలుగు వెలుగులు 60

రాజకీయాలలో చిరకాలం ప్రముఖస్థానం ఆక్రమించి ఉండడానికి నాయకత్వం వహించగలగడం ఎంత ముఖ్యమో, ఆ నాయకత్వం తోటివారు తమంత తాము కట్టబెట్టినదైనట్లుగా తోపింపచేయడమూ అంతే ముఖ్యం. ఈ రెండూ పుష్కలంగా ఉన్నా పదవులు తమంత తాము ఎవరిని వరించవు. సంకల్పబలంతో పాటుగా సంకల్పసిద్ధికి ఏకాగ్రము నిరంతరాయము అయిన కృషి కూడా ఆవశ్యకం. ఈ అన్నిట నిష్ణాతుడై, కనుచూపు మేరకు అనిన కాలంలో తనను త్రోసిరాజనగల ప్రతిద్వంద్వి లేక, దేశాన్ని శాసించే సభకు అధ్యక్షుడుగా వెలుగొందుతున్న తెలుగువెలుగు శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగార్.

లోపించిన 'ఔన్నత్యం' మరుగుపుచ్చే పుష్టిగల నిండైన విగ్రహం; ఎంత మందిలో ఉన్నా ఇట్టే అందరి దృష్టి తనమీద కేంద్రీకరింపచేసుకొనడానికి తగిన వాక్చమత్కృతి; తనఘనత పదుగురికి చాటి చెప్పుకొనడానికన్నట్లు భ్రమింపచేసే నవ్వు; విజ్ఞతకు, సాధించిన ఔన్నత్యానికి చిహ్నమైన గాంభీర్యం; నిత్యమూ మహాయోధులతో తలపడుతూ తక్కుంగలవారిని పట్టించుకొనట్లుగా ఉండే మందగమనం; శ్రీ అనంతశయనం అయ్యంగార్‌లో మూర్తీభవించినవి.

వయసులో విద్యలో అనుభవంలో ఆ తరానికి చెందినవారిలో అగ్రగణ్యుడు ఆయన. రాజకీయాలకు జీవితం అంకితం చేసినది మొదలు నేటి వరకు ఓటమి ఎరుగనివాడు. రెండున్నర దశాబ్దాలుగా (1935 నుంచి) విడువక తొలుత కేంద్రశాసన సభలోను, తదుపరి పార్లమెంటులోను సభ్యులుగా ఉన్నారు. నాలుగు సంవత్సరాలపాటు లోక్‌సభ ఉపాధ్యక్షు పదవి నిర్వహించారు. 1956 నుంచి అధ్యక్షులుగా ఉన్నారు.

ఎనభయ్యవపడిలో అడుగుపెట్టనున్న ఈ వృద్ధమూర్తికి తెలుగువారి జీవితంతో ఏనాడూ సన్నిహితమైన సంబంధం లేకుండా పోయినది. ప్రాయశః దేశరాజకీయాలలో ఇంతకాలం ఆయన ప్రముఖస్థానం అలంకరించి ఉండడానికి అదే ప్రధానకారణం కావచ్చు.

దశాబ్దాలక్రిందట తెలుగునాట జరిగిన పండిత పరిషత్ సభలలో పాల్గొంటూ పండితుడుగా, రసజ్ఞుడుగా, సరసవచో విభూషితుడుగా, సాహితీరంగంలో తెలుగువారి ప్రతిభ చాటిచెప్పగలవాడుగా వినుతికెక్కినవాడు శ్రీ అయ్యంగార్.

సాహిత్యంలోవలెనే రాజకీయాలలో సహితం తెలుగునాడుకు ఎంతదూరంగా ఉంటే అంతమంచిదని నాడే గుర్తించినారు కాబోలు నేటికీ ఆలాంటి సాన్నిహిత్యం పెంపొందించుకొనలేదు శ్రీ అయ్యంగార్.

ఏమైనా శ్రీ అయ్యంగార్ సాహసికులలో సాహసికుడు. కేంద్ర శాసనసభలోనేమి, పార్లమెంటులోనేమి ప్రభుత్వ విధానాలను చర్యలను అక్రమాలను అన్యాయాలను నిర్భయంగా విమర్శించగల దిట్టగా ఖ్యాతి ఆర్జించారు. అలనాడు విదేశపాలకులను కాని, ఆ తరువాత కాంగ్రెసు పాలకులను కాని ఆయన సరకు చేయలేదు.

తెలుగునాడు దేశానికి అర్పించిన మణిపూస శ్రీ అయ్యంగార్. తెలుగు తల్లికి కాకపోయినా భారతమాత కంఠం అలంకరించినహారంలో కొలికిఅయి దేశానికే వెలుగు ఇస్తూ ఉన్నది. ఏనాటికి అయినా దేశానికే అధ్యక్షపదవి అలంకరించ గలదీ భూమ అని కూడా ఆశించవచ్చు. ☆

# మనుష్యులూ మనసులూ

## పడిత్తుల రామచంద్రయ్య

కాంతారావు చెల్లెలు పెండ్లి నిరాఘాటంగా సాగిపోవటమూ, అతడు యం. యస్. సి. యూనివర్శిటీ ఫస్టున ప్యాసవటమూ ఒకేసారిగా, కొంచెం పెపిసరంత ఎడకాముందుగా, జరిగిన సంగతులు.

భవతు.

సహజంగానే, కాంతారావు మహానందం అనుభవించాడు. అయితే, యింట్లో తలిదండ్రులూ పెద్దలైనవాళ్ళంతా అతడి పరీక్ష విషయంలో ఆనందం అనుభవించితే, కాంతారావు ఆనందం మాత్రం ఎక్కువగా అతడి చెల్లెలి పెళ్ళి గురించే.

ఇందులో వింతేమీ లేదు. చెల్లెలంటే అతడికి పంచప్రాణాలు. సామాన్యంగా అన్నా చెల్లెళ్ళమధ్యవుండే రక్తబంధం వాళ్ళిద్దరి మధ్యా మరింత దృఢంగా పెనవేసుకుంది. తన చెల్లెలు హేమలతంటే నిజంగానే హేమమనీ, ఆ హేమానికి అసలైన అపరంజిలాంటివాడు రావాలనీ అతడనుకున్నాడు. ఈ ఆశయం ఫలించి, చక్కనివాడూ, హైదరాబాదులో ఛార్టర్డు అకౌంటెంటూ అయిన రమణ హేమకు వరుడుగా లభించినందుకు ఎంతగానో మురిశాడు కాంతారావు. ఇక తన ఫస్టుక్లాసువిషయం అంటే-అదికూడా చెల్లెలి పెళ్ళయిన శుభవేళావిశేషం వల్లనే జరిగిందని కాంతారావు అభిప్రాయం.

పెళ్ళయి, హేమలత అత్తవారింటికి వెళ్ళిపోయిన కొద్దిరోజులకు అతడికి యూనివర్శిటీలో రిసెర్చి స్కాలర్‌షిప్పు వచ్చింది. ఇది కూడా తన చెల్లెలికల్యాణ వేళావిశేషమేనని కాంతారావు అభిప్రాయం.

* * *

వేసవిసెలవు లయ్యాక కాంతారావుకు యూనివర్శిటీ నుంచి కాయితం వచ్చింది. వచ్చి రిసెర్చికి పేరు రిజిస్టరు చేసుకోవలసిందిగా రాశారు. అందులో స్కాలర్‌షిప్పు ప్రస్తావన లేదు. కాస్త ఆలస్యంగా పంపిస్తారేమోలే-అనుకున్నాడు కాంతారావు.

రైల్లో కూచుని, హైదరాబాదులో తనమకాం గురించి ఆలోచించాడు. స్కాలర్‌షిప్పు ఇంకా రాలేదు కాబట్టి, ఇప్పుడే హాస్టల్లో చేరేవీలుండదేమో! అందువల్ల కొలాగా చెల్లాయి ఇంట్లో వుండటం మంచిది. అక్కడా పరాయివాళ్ళెవరు? చెల్లాయీ, రమణా, వాళ్ళమ్మా, పిల్లలూ; అంతా మనవాళ్ళే.

సాయంత్రం హైదరాబాదులో దిగిన కాంతారావు రిక్షా చేయించుకుని ఇంటికి వెళ్ళాడు. వెళ్ళేసరికి హేమలత



ఇంట్లో లేరు. లతా, రమణా సినిమాకు వెళ్లారని చెప్పింది, హేమలత అత్తగారు దుర్గమ్మ. ఆవిడ కాంతారావును ఆప్యాయంగా పలకరించి మర్యాద చేసింది.

అతడు వచ్చాడని విని, ఆ వీధిలోనే వున్న తెలిసున్న వాళ్లమ్మాయి అనూరాధ అతణ్ని పరిచయం చేసుకోడానికి వచ్చింది. అనూరాధ ఆ సంవత్సరమే యం.యస.సి. లో చేరింది. అప్పుడే ఆ పిల్లకు హేమలతకు గట్టి స్నేహం ఏర్పడింది. కాంతారావునుగురించీ, అతడు రిసెర్చి చేసేందుకు రావటాన్ని గురించీ ఆ అమ్మాయి ఇదివరకే హేమ ద్వారా విన్నది. అతడితో మాట్లాడటానికి అనూరాధ మొగమాట పడుతుంటే దుర్గమ్మ వాళ్లిద్దరికీ పరిచయంచేసింది. తరవాత ఇద్దరూ మాటల్లో పడ్డారు. హేమలత చిన్న మరిది నారాయణ వాళ్ళకు కాఫీ తీసుకొచ్చాడు. కాఫీ తాగుతూ, తనకు సబ్జక్టులో కాంతారావు సాయం కావాలంది అనూరాధ. అతడు ఒప్పుకున్నాడు. తరువాత కాసేపు కూచుని మాట్లాడి అనూరాధ వెళ్ళిపోయింది.

పగలంతా రైలుప్రయాణంలో అలిసి వుండటంవల్ల పెందరాళే భోంచేసి నడుం వాల్చాడు కాంతారావు. గాఢంగా నిద్ర పట్టేసింది. తిరువాత పదీపదకొండు గంటలకు ఏదో సందడికి మెలకువ వచ్చిందతడికి. మాటలు వినబడుతున్నయ్. చెల్లాయీ వాళ్ళు సినిమా నుంచి వచ్చినట్టున్నారు. తన రాక సంగతి దుర్గమ్మత్తయ్య చెప్పినట్టుంది.

"మీ అన్నయ్యను పలకరించి వస్తావా?" అంది దుర్గమ్మ.

"ఇప్పుడెందుకు లెద్దూ. నిద్రపోనీ లే. తెల్లవారదా యేమిటి?" అంటోంది హేమలత.

కాంతారావుకు ఏమీ బాగుండలేదు చెల్లాయి ధోరణి. 'ఈవిడకి కాస్తయినా క్యూరియాసిటీ లేదేమిటి? ఇంటికి వచ్చినవాడి కథా కమామీషూ, ఎలా వచ్చాడో, ఏం తెచ్చాడో తేల్చుకుందామన్న ధ్యాస లేకుండా యిదేం వరస!-' అనుకున్నాడు. ఈ నెలరోజుల సెలవుగా మళ్లీ చెల్లాయితో మాట్లాడాలని అతడికి చాలా ఆత్రుతగావుంది.

ఎంత 'యిది' యినా, చుటం కదా తాను! వాళ్లు వచ్చి పలకరిస్తారేమోనని చూశాడు. వాళ్లు అతడి గదిలోకి వచ్చినప్పుడు అటూ యిటూ పొర్లాడు. లాభం లేకపోయింది. ఇహ భరించలేక అతనే సావట్లోకి వచ్చాడు.

హేమలత మామూలుగానే పలకరించి మాట్లాడింది. ఇంటిదగ్గర అమ్మా నాన్నా వాళ్లనుగురించి అడిగింది. రమణ అతడి రిసెర్చి ప్రోగ్రామ్‌గురించి అడిగాడు. తరువాత దంపతులిద్దరూ భోజనానికి వెళ్లారు. వాళ్లు భోంచేస్తున్నంతసేపూ ఏదో చెబుతున్నాడు కాంతారావు. హేమ వూకొడుతోంది.

"పగలంతా రైల్లో వున్నావా-హాయిగా



నిద్రపో అన్నయ్యా! పొద్దున మాట్లాడు కుందాం..." అంది హేమ.

కాంతారావు లేచి వెళ్లాడు.

మర్నాడు పొద్దున్న కాఫీ ఫలహారా లయ్యాక పోస్టాఫీసుకు వెళ్లి, తండ్రికి కార్డు రాసి పడేశాడు. తను హాస్టల్లో సీటు దొరికే టంతవరకూ చెల్లాయి యింట్లో వుంటానని.

మధ్యాన్నం హేమను అడిగాడు.

"చెల్లాయ్! హాస్టల్లో సీటు దొరికేదాకా ఇక్కడే వుంటాన్నేను." చాలా ఉత్సాహంగా అన్నాడు కాంతారావు. కాని హేమ ఏమీ మాట్లాడకపోవటంతో అతడి ఉత్సాహం చాలాభాగం హరించిపోయింది.

"అదేవిటి చెల్లాయ్? వాళ్లేమన్నా అనుకుంటారనా?..." అన్నాడు.

"అనుకోకపోవచ్చు." ఈ మాత్రం జవాబుతో మళ్లీ ఉప్పొంగిపొయ్యాడు కాంతారావు. ఇంతకుమించి ఆ జవాబులోని పూర్వాపరాల్ని గురించి ఆలోచించ లేదు ఆ అమాయికుడు.

యూనివర్సిటీకి వెళ్లి రిసెర్చికి పేరు రిజిస్ట్రరుచేసుకున్నాడు కాంతారావు. ఆ రోజు అతడు ప్రొఫెసరుగదిలోంచి వస్తుండగా అనూరాధ ఎదురయినది. ఇద్దరూ కలిసి మాట్లాడుతూ కొస్త దూరం వచ్చాక, "ఎలా వుంది మీవాళ్లింట్లో?" అనడిగింది అనూరాధ.

"బాగానే వుంది."

"అక్కడే వుంటారా యేం?"

"అవును. హాస్టల్లో సీటు దొరికేదాకా."

మరేం మాట్లాడలేదు అనూరాధ. ఇంటి దగ్గర ఇదరూ విడిపోయారు.

రెండురోజులు గడిచాయి. పల్లెటూరు నుంచి కాంతారావునాన్న బియ్యమూ, డబ్బు పంపించాడు, 'మన హేమింటిలో ఇవ్వ'మని రాస్తూ. చెల్లాయి ఇంటిలో వుంటానని కాంతారావు రాసిన జాబుపై ఆయన తన జాబులో ఎలాంటి వ్యాఖ్యానమూ చెయ్య లేదు. మామూలుగా ఇలాంటి విషయాల్లో కాంతారావు నిర్ణయంపై ఆయన జోక్యం చేసుకోడు.

మధ్యాన్నం ఆఫీసునుంచి వచ్చిన రమణా, అతడికోసం అప్పటిదాకా కనిపెట్టుకొని వుండిన హేమా—ఇద్దరూ కలిసి భోంచేస్తు న్నారు.

"ఆ బియ్యం, డబ్బూ దేనికి?" – రమణ ప్రశ్న.

"హాస్టల్లో సీటు దొరికేదాకా అన్నయ్య ఇక్కడే వుంటాడుట...మరేం లేదు. హోటలు తిండంటే భయం అన్నయ్యకు." అంది హేమ. ఆ మాటల్లో అన్నయ్యపట్ల జాలీ, తన పుట్టింటి ప్రతినిధికి తన ఇంటిలో ఆదరణ ఉండాలన్న తాపత్రయమూ ఉన్నాయి.

రమణ మాట్లాడలేదు.

అతడు మాట్లాడకపోవటంతో హేమ

# ఎనసంపులా మనసులా

మనస్సులోని భావపరంపర అనేకవిధాలుగా పోయింది. తన నింతగా ప్రేమించే ఈయన, తనపట్లచూపే ఆదరణలో ఒక నూరోవంతు తన అన్నయ్యపట్ల చూపరాదా?–ఇలా మానం వహించడంలో అర్థమేమిటి? ఇదేనా తన మాటకు విలువ? ఈయన హృదయసామ్రాజ్యానికీ, ఈ గృహానికీ తను యజమానురాలి ననుకున్నదే, యీ క్షణందాకా! ఇప్పుడు దానికీ వైరుధ్యమేమిటో తెలీటం లేదు... అసలు అన్నయ్యననాలి...డబ్బుకు తక్కువయిందా? హాస్టల్లో సీటు దొరికేదాకా ఏ హోటల్లోనో వుంటేనేం?—ఇక్కడవుంటాననడం, దానికి ఈయన మానం ప్రదర్శించడం, మధ్యన నలిగిపోయి తను బాధపడటం దేనికి? యం.యస్‌సి. చదివినమనిషి కీమాత్రం ఎందుకు తెలీదు?

ఈ విధంగా, ఆ పూట హేమపడిన మన నలో చాలా భాగం కాంతారావుమీద కోపంగా మారింది. అతడిక్కడ వుంటాననక పోతే యీ కలత లేవీ రావుగదా!

మరి యీ విషయం అన్నయ్యకు చెబుదామా—అనుకుంది హేమ. మళ్ళీ వద్దనుకుంది. చెబితే అన్నయ్యముందు ఎంత హీనత! చెబితే అన్నయ్య ఇక్కడ తన స్థానాన్ని గురించి ఎంత తక్కువగా వూహిస్తాడు!...పైగా ఆయన ఇంత అల్పత్వం చూపించాడేమిటా అని అనుకోడూ అన్నయ్య! తత్ఫలితంగా, అన్నయ్య చదువులు పూర్తయి పెద్దపదవుల్లో వున్నప్పుడు, దీన్ని మనస్సులో పెట్టుకుని, ఆయన్ని తక్కువ చూపు చూడొచ్చు! అప్పుడు తనే బాధపడాలి.

ఇలా అనుకుని హేమ కాంతారావుకు చెప్పటం మానేసింది. మరి చెబితేగాని

> హోటల్‌లో ఫలహారం చేస్తున్న పెద్దమనిషి "ఏమయ్యా, ఆ దోసెమీద అలాచెయ్యి పెట్టి తెస్తున్నావెందుకు" అని సర్వర్‌ను ప్రశ్నించాడు.
>
> "మళ్లీ క్రింద పడి పోకుండా ఉండడానికి". అన్నాడు ఆతడు.
>
> —మద్ది లక్ష్మణరావు (గుడివాడ)

గ్రహించుకోలేదే అన్నయ్య!...ఛా...ఏం మనిషి!.

హేమ చికాకుపడ్డది.

## ౨

ఇరవై రోజులు గడిచాయి.

ఆ రోజు పొద్దున్న రమణ చిన్న తమ్ముడు నారాయణ మార్కెట్టుకు వెళ్లనని మొండికేశాడు. దుర్గమ్మ, హేమ, రమణ – ఎవరు చెప్పినా వాడు వినలేదు. అదోరకం తత్వం వాడిది. ఇష్టమయితే ఎన్ని పనులు చెప్పినా చేస్తాడు. ఎదురు తిరిగాడో, ఇక బ్రహ్మాదులు దిగివచ్చినా వాడు వంగడు. చావగొట్టి లాభం వుండదు.

విసిగిపోయి, రమణ అన్నాడు:

"ఇహ యీ వెధవ యింతే. పోనీ యీ పూట బావ తీరిగ్గానే వుంటాడుగదా! కొస్త మార్కెట్టుకు వెళ్ళొస్తాడులే..." ఆఫీసుకు వెళ్లిపోయాడు రమణ.

కాంతారావుకు ఆశ్చర్యం తోగినట్లయింది. రమణ చెప్పినదానికి అతడికి కోపం రాలేదు. కాని, చిన్నప్పట్నుంచీ కాంతారావుకు మార్కెట్టుకు వెళ్ళే అలవాటులేదు. ఏకైక పుత్రుణ్ని అలాంటి పనులకు పంపించేవాడు కాదు కాంతారావు తండ్రి. అన్ని పనులూ నౌకర్లు చేసిపెట్టేవాళ్లు.

అందువల్ల, మార్కెట్టుకు వెళ్లాలంటే కొస్త పట్టింపుగా కనబడ్డది కాంతారావుకు. అయితేనేంలే, ఇది తన యిల్లుకాదు కాబట్టి ఆ పట్టింపులు అనవసరం – అనుకున్నాడు. అక్కడలాగా యిక్కడ నౌకర్లు లేరుగదా! మరి పట్నవాసం కాపరమాయె!...

అతని ముఖకవళికలు గమనిస్తూవుంది హేమ. ఏమీ మార్పులేదు. ముఖం మటమట మాడ్చుకోవటం లేదు. ఇలాంటి మార్పును ఆశించిన హేమకు కొద్దిగా ఆశ్చర్యం కలిగింది. దానితోబాటు అన్నయ్యపట్ల జాలీ, భర్తమీద రవ్వంత కోపం వచ్చాయి. మార్కెట్టుకు వెళ్ళేపని అన్నయ్యకు పురమాయించకపోతేనేం? ఈయన మరీ యిలా తయారవుతున్నాడేమిటి? బావమరిదిపట్ల కనీసపు గౌరవమేనా వుండొద్దూ! తన పుట్టింట్లో అయితే, అన్నయ్యకు ఇలాంటి పనులు చెప్పటానికే అందరూ జంకుతారు, నాన్నకు భయపడి. ఒకవేళ యీ విషయం అన్నయ్య నాన్నకు జాబు రాస్తాడో యేమో! అప్పుడు నాన్నకు కోపం రావటం తథ్యం. దాని మూలంగా కలతలు......బహుశా అన్నయ్య రాయక పోవచ్చు. అలా రాసేవాడు కాదు అన్నయ్య. అతడింతదూరం ఆలోచించటమే జరగదు. ఇదంతా తన ఊహే. అసలు అన్నయ్య ననాలి. అంతస్తులూ, అంతర్యాలూ ఏవీ ఆలోచించకుండా ఇక్కడికి వచ్చి మకాం పెట్టినందుకు ఈ మాత్రం శాస్తి జరగాల్సిందే.

కాంతారావు డ్రెస్ చేసుకుని, సంచీ పట్టుకుని మార్కెట్టుకు వెళ్లబోతుంటే, గడప వద్ద అనూరాధ ఎదురయింది.

"ఎగురుగా వచ్చాను. వెళ్లిన పని కాక పోతే నన్ను తిట్టకోకూడదు సుమండీ!... ఏనా యింత తొందరగా వెడుతున్నారేం? యూనివర్సిటీకా?" అంది అనూరాధ.

"కాదండీ...మార్కెట్టుకు."

అనూరాధ మొహంలో రంగులూ, భావాలూ మారాయి. ఆవిడ కొన్నేపు ఆలోచిస్తూ నిలబడి "నేను ఇంట్లో ఏం తోచక యిలా వచ్చాను. పదండి నేనూ మార్కెట్టు దాకా వస్తాను" అంది.

ఇద్దరూ బయలేరారు.

దారిలో, "వాడు నారాయణ ఏమయినాడీ పూట? మీకు తగిలించారిపని?" అన్నది అనూరాధ.

"వాడు వెళ్లనని మొండి కేశాడు."

"అయితే మీరు దొరికారా?"

"ఏం చేస్తాం.!"

మార్కెట్టుకు వెళ్లాక కానీ కాంతారావుకు గుర్తురాలేదు, తను ఏమేం కూరలు తేవాలో అడిగి రాలేదని...ఇప్పుడెలా?—అనూరాధను సలహా అడిగాడు.

అనూరాధ నవ్వింది.

"ఏవి బాగుంటే అవి, మనకు తోచినవి, తీసుకెడదాం."

"ఇంట్లో ఏమన్నా అంటారేమో!"

"అంటే అనుభవిస్తారు. ఇంటికి వొచ్చిన మనుషుల్ని కూడా బజారుకు పంపించడం తెలిసున్న వాళ్లకి, ఏమేమి తేవాలో చెప్పాలని తెలీవొద్దూ?...ఏవన్నా అంటారూ? అంటే నేను నాలుగూ దులిపేస్తానెండి." అంది అనూరాధ. కాంతారావు ఏమీ మాట్లాడలేదు. అనూరాధ చెప్పింది నిజమే అనిపించిందతడికి. తానింతవరకూ మార్కెట్టుకు వెళ్లింది లేకపోయె! ఏం తేవాలో, వాళ్లు చెప్పివుండవలసింది. చెల్లాయే నా చెప్పకూడదూ? అందరందరే, అస్తావ్యస్తపు మనుషులు!

కూరలు కొన్నారు నాలుగు రూపాయిలయింది. సంచీ మోసుకు వచ్చేందుకు కూలీ కోసం అనూరాధ వెతుకుతుంటే, 'వద్దు, జట్కా చేయించుకుందా' మన్నాడు కాంతారావు.

జట్కాలో తనకూ అనూరాధకూ మధ్యను కూరలసంచీ వుంచి, ఇద్దరికీ సురక్షితమైన దూరం వుందని రూఢి చేసుకుంటున్న కాంతారావును చూస్తే నవ్వుబుద్ధేసింది అనూరాధకు. జువాలజీలో రిసెర్చి చేస్తున్న మనిషిలో యింతటి అమాయికత్వం వుందేమిటా అనుకుందా పిల్ల. వెనక బరువెక్కువవుతుందని, అనూరాధను ముందుకు జరిగి కూచోమన్నాడు బండివాడు. అనూరాధ సంచీ బండి చివర్న వుంచి దగ్గరగా జరిగి కూచుంది. కాంతారావు ఖంగారు పడుతున్నాడు.

"కాస్త నోరుగల పిల్ల." అనుకున్నాడు అనూరాధనుగురించి కాంతారావు; అంతకు ముందు ఆవిడ అన్నమాటల్ని గుర్తు తెచ్చుకుంటూ.

బండిదిగి, కాంతారావు వెనకాలే అనూరాధకూడా యింట్లోకి వచ్చింది. బహుశా, కాంతారావు తెచ్చిన కూరలమీద ఇంట్లో వాళ్ళెవరైనా రిమార్కు చేస్తే, తను అన్నట్టుగా నాలుగూ దులిపేద్దామని గావల్ను! ఇలాగే ఊహించుకున్నాడు కాంతారావు కూడా. అలాంటి దేదీలేకుండా చెయ్యమని వెయ్యిదేవుళ్ళకు మొక్కుకున్నాడు కూడా. ఎందుకంటే, అన్నంత పని చెయ్యగలదురుసు పిల్ల అనూరాధ. అప్పుడు మధ్యన తను నలిగిపోవలసివస్తుంది.

"ఏం హేమలతా, మీ అన్నయ్యని కూరలకు పంపించావే?" ఈ మాటల్ని అనూరాధ పరిహాస ధోరణిలో ఉద్దేశించే అన్నా, అందులో కాస్తవిమర్శకూడా ధ్వనించింది.



# పధ్యాక్కాఱు నివేదన

## శకట రేఫ

నిను నేను గొనియాడ నెంతు: నిఖిలప్రకృతి నీవు మధుర
ధునిగా(గ సృష్టించి, నాకు( దోష మ్మొసంగ( గా విమల
మనము ననుగ్రహించుటను - మనసార, నీదు సౌందర్య
చణతకు మది పొంగి పోవ సరసాత్ము(డన యయి - స్వామి!

నిను నేను బ్రశ్నింప నెంతు: నిశ్చలత్వమ్ము లేనట్టి
మనమును, హృదయము, జూపు మహితాత్మ! యిడితేల? నాకు(
బనియేమి కల్పించినావొ - స్పష్టమ్ము సేయ వేలొకొ? మ
రణమే మిగిలిపోయె(, బలుక రావేల నన్ను వదలితి!?

నిను నేను గోపింప నెంతు: నిస్సారభవ మిడినావు!
ఘనత యేమియు( గూర్పకుండ( గాలమ్ము వృథపుచ్చినావు!
తను వెల్ల విషపూరిత మగుతావుల నను ద్రిప్పినావు!
కొనియాడ నెంచిన నాకు( గోపమ్ము దెప్పించినావు!

నిను నేను బ్రార్థింప నెంతు: నీరస జగతిలో నాకు(
దను వీయ కి(క నెప్పు డిట్టితప్పిదమ్ముల కోర్వలేను!
బని గొని జన్మమ్ము నిడిన(, బ్రశ్నింప వీలు లేనట్టి -
కొనియాడనే తగ్గ - కరణి(, గోర్కెలు దీర్చుకో స్వామి!

**కవితాకింకిణి**

**బహుమతి పొందిన కవిత**

హేమ ముఖం ముడుచుకు పోయింది. కన బడని ముల్లు ఏదో కలుక్కుమంది హృదయంలో. కాని ఆ బాధ ఎక్కువసేపు నిలవ లేదు. అది మాయమైపోయి, దానిస్థానే అనూరాధమీద కినుక ఏర్పడ్డది. ఇదే హేమలో వున్న మానసిక దౌర్బల్యం. ఆమెలో ఎప్పుడైనా చికాకుగాని, మరేవిధమయిన నీరసభావంకాని కలిగితే తత్ఫలితంగా ఏర్పడ్డబాధ పరిసరాల్లోవున్న ఏ వ్యక్తి పట్లనయినా కోపంగా రూపొందుతుంది. ఒక్కోసారి అలా రూపొందకపోయినా అందుకోసం ప్రయత్నిస్తుంది హేమ. ఎవరిమీదనో కోప్పడి, వాళ్ళను బాహ్యంగానో, ఆంతర్యంలోనో దూషించాలి. లేకుంటే మనసు తేలికపడదు.

ఇలాంటి సాంసారికాల్లో ఈ పిల్ల కెందుకు జోక్యం?—అనుకుంది హేమ...తనకు స్నేహితురాలే కావచ్చు. అయినా యిది హద్దుమీరటం కాదూ?

"అవును; పంపించాను. అందుకు శిక్ష వేస్తావా యేమిటి?" అంది హేమ. ఈ మాటల్లో హాస్యం వుండీలేనట్టు మినుకు మినుకుమంది. అంతా ప్రతివిమర్శ, 'అది నీ కెంగ కన్న ప్రతిధ్వని.

అనూరాధ మరేం మాట్లాడలేదు. బహుశా అనవసర మనుకొని వుండొచ్చు.

'తనని మార్కెట్టుకు పంపించారని అన్నయ్య చెప్పాడేమో యీ పిల్లకు!' అనుకుంది హేమ. మళ్ళీ అన్నయ్యమీద కోపం వచ్చింది. మరి వాళ్ళింట్లో జరిగినట్టుగా యిక్కడ సాగుతుందా ఆయనకు? అవన్నీ గమనించవద్దు? అసలు ఆయనిక్కడికి రావటంవల్ల నేగదా, ఈ అసందర్భపు సంఘటనలన్నీ! మధ్యనలిగి తనుచచ్చిపోతోంది. స్నేహం ఏర్పడి సరిగ్గా రెండు నెలలు కాలేదు. ఈ రోజు అనూరాధతో కటువుగా మాట్లాడవలిసొచ్చింది.

ఈ విధమయిన భావసంక్షోభంనుంచీ హేమ తేరుకుని చూసేసరికి అనూరాధ లేదు. అల్లంతదూరంలో కుర్చీలో కూర్చుని పరధ్యానంగా ఎటో చూస్తున్నాడు అన్నయ్య. అతడి జుత్తంతా రేగి, చెమటపట్టిన ముఖం మీద పడుతోంది.

అతణ్ని చూస్తే జాలేసింది హేమకు. ఆ ముఖంలో, మనిషి తీరులో ఎంత నిష్కపటం! అన్నయ్య వట్టి అమాయకుడు. తన మీద వెర్రి ప్రేమ! ఎంత ప్రేమలేకుంటే తన యిల్లు వెతుక్కుంటూ వచ్చి చేరుతాడు! మరి తానేమో ఆ ప్రేమను సరైన రీతిలో సమాధానించలేకుండా వుంది.

"వెళ్ళి స్నానం చెయ్యి అన్నయ్యా! నీళ్ళు తోడుతాను," అన్నది ఆప్యాయంగా. ఆ మాటల్లోని చల్లదనం కాంతారావు శరీరాన్నంతా మెల్లమెల్లగా స్పృశించి ఇక వేరేస్నానం అనవసరమన్నట్లు చేసింది. తను

# మనుషులూ మనసులూ

ఇక్కడికి వచ్చిన క్షణంనుంచీ చెల్లాయి మాటాడిన మాటలన్నిటికన్నా వీటిల్లో ఏదో క్రొత్తదనం, మనుపటి సన్నిహితభావం గోచరించాయి అతడికి.

మధ్యాన్నం పన్నెండు గంటలకు ఆఫీసు నుంచీ వొచ్చాడు రమణ. అంతకు గంట క్రితమే కాంతారావు భోంచేసి యూనివర్సిటీకి వెళ్ళిపోయాడు. రమణ భోజనానికి కూర్చున్నాడు. హేమ వడ్డిస్తోంది.

"ఇన్ని కూరలు చేశావేం యీ రోజు?" అన్నాడు రమణ.

హేమ నవ్వుతూ, అన్నయ్యా అనూరాధా కలిసి మార్కెట్టంతా బేరం చేసి తీసుకొచ్చారు" అంది.

రమణ వూరుకొన్నాడు.

"కనబడ్డ కూరల్లా పట్టుకొచ్చాడన్నయ్య. వూళ్ళో ఎప్పుడూ మార్కెట్టుకు వెళ్ళే మనిషి కాకపోయె!...వాటిల్లో ఎక్కువ భాగం నిలవవుంచితే చెడిపోతాయని ఈ పూటే వండింది అత్తమ్మ"

"అదృష్టవంతులే నాన్నా, మహారాజు! మార్కెట్టంతా కొనాగలడు, తినాగలడు. మేం అలా రోజూ మార్కెట్టు బేరం చెయ్యలేం కదా! బీద వాళ్ళం..."

గతుక్కుమన్నది హేమ. భర్త తన మాటల్ని ఈవిధంగా అపార్థం చేసుకున్నందుకు కాదు. అతడు 'మేం' అని ఉపయోగించి మాట్లాడినందుకు చాలా నొచ్చుకుంది. తన పుట్టింటివాళ్ళు మహారాజులనీ, అత్తింటివాళ్ళు బీదవాళ్ళనీ తను అన్నది గనకనా, ఆయన యిలా మాట్లాడేందుకు?

సరిగా రెండు నెలల వయస్సైనా లేదు తనదాంపత్య జీవనానికి. జీవితంలో క్రొత్తగా తోడైన వ్యక్తితో కష్టసుఖాల్ని పంచుకోడానికి, మొట్టమొదటిసారిగా తాను ఇక్కడికి వచ్చినప్పుడు ఏదో క్రొత్త ప్రపంచంలో పడినట్టయింది. బ్రతుకు పాటలో వినూత్న మోహనరాగం ఆరంభమయినట్లనిపించింది. అలాగే, యిప్పటిదాకా ఇసుక తిన్నెల మధ్య సెలయేరులాగా హాయిగా సాగిపోతున్నది తన జీవితం. ఎలాంటి పొరపొచ్చాలూ రాలేదు. తుది దాకా ఇట్లే అయి ఈ సుఖాల్ని పూర్తిగా జుర్రుకోవాలనుకుంటున్నది తాను. ఇప్పుడీ కలత ఏమిటి?

ఆలోచనలతో సతమతమవుతున్న హేమ, భర్తకు సరిగ్గా వడ్డించలేక పోయింది. కూర తెమ్మన్నప్పుడు పచ్చడీ, పచ్చడి తెమ్మన్నప్పుడు పులుసూ వడ్డించింది. అతడు రెండు మూడుసార్లు హెచ్చరించాడు. ఓమారు హాస్యంగా "ఓయి పరధ్యానం గారూ, వడ్డన బాగా లేదు." అన్నాడు. హేమ యాదాలాపంగా నవ్వింది. ఆ నవ్వులో నిండుదనం లేదు.

ఎలాగో భోజనం పూర్తి చేశాడు రమణ. తాంబూలం వేసుకున్నాక ఓ అరగంటసేపు హేమతో కులాసాగా కబుర్లు చెప్పి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

దుర్గమ్మ చాపమీద పడుకుని హాయిగా నిద్రపోతోంది. హేమకు మధ్యాన్నంపూట నిద్రరాదు. ఈజీ చెయిర్లో పడుకుని, భర్త కోసం కుడుతున్న దిండుగలీబుమీద డిజైన్లు పూర్తిచేయడానికి ఉపక్రమించింది. త్వరగా తయారు చేసి ఆయన దిండుకు తొడగాలి. ఆయన ఎంతగానో మెచ్చుకుంటారు. ఆయన మంచివారు.

అవును, ఆయన మంచివాడు. మంచితనానికి దూరంగా ఆయన మెలగుతున్నాడంటే తను ఒప్పుకోలేదు. పెళ్ళయినప్పట్నుంచీ, కలిసీ మెలిసీ కష్టసుఖాలు పంచుకోవడంవల్ల లభించే ఉన్నతమైన ఆనందం ఎలాంటిదో తనకు చవిచూపించారు. పెళ్ళప్పుడుకూడా, కట్నాల దగ్గర పట్టుదలలు చూపించలేదు. వెయ్యినూటపదహార్లతో తృప్తి పడ్డారు. అలా వొప్పే వాళ్ళెరి, ఈ రోజుల్లో? స్కూలు ఫైనలు నాలుగుసార్లు తప్పినవాడు కూడా నాలుగు వేలకి తక్కువ రాడుగా!

...ఎవీటో, యీ రోజు మనస్సంతా అదోలావుంది; పొద్దున్నే ఎవరి ముఖం చూసిందోగాని! ఒక విధంగా ఈ మనసి కల్లోలానికి కారణం అన్నయ్య! ఈఇంట్లో తనకింకా ఓ స్థిరమయిన స్థానం ఏర్పడకముందే అన్నయ్యవచ్చి మకాం వేశాడు. ఈ పరిస్థితిలో తను ఎలా మెలగాలో తెలీటంలేదు.

ఆలోచనలన్నీ కాసేపు కట్టిపెట్టి నిద్రపోవాలని ప్రయత్నం చేసింది హేమ. నిద్రవచ్చే టట్లుండినా, కళ్ళు మూసుకుంటే నిద్ర రావటం లేదు. రెండుసార్లు ఆవలించింది. కుట్టుతున్న గలీబు ప్రక్కనున్న బల్లమీదకి గిరవాటేసింది. ఈ ఎంబ్రాయిడరీ పనంతా

మొద్దబ్బాయి - నాన్నా, నాకు మూడుచక్రాల సైకిల్ కొనపెట్టవూ?

తండ్రి - పెద్దయినతర్వాత సైకిల్ రిక్షా తొక్కుదువు గానిలే, నాయనా!

—రాయప్రోలు బ్రహ్మానందశాస్త్రి (బందరు)

కొండను తవ్వి ఎలకను పట్టినట్టు! ఎప్పటికీ తెమలగు; బంపెగా కిరీ!

ఎండ తగ్గుముఖం పట్టి చల్లగాలి వీచడం ప్రారంభించేసరికి హేమ వాస్తవిక జగత్తులోకి వచ్చి టైమెంతయిందో చూచింది. నాలుగు కావస్తోంది. హేమ లేచి పెరట్లోకి వెళ్ళి ముఖం కడుక్కునివచ్చి, కాఫీ కాచేందుకు కుంపటి రాజేసింది.

కాఫీ తయారయ్యేసరికి రమణ ఆఫీసు నుంచి వచ్చాడు. ఈ రోజు మామూలుకన్నా ఓ అరగంట ముందుగా వచ్చాడు. వచ్చిన వాడు డ్రస్సు విప్పకుండానే, బూట్లన్నా తీయకుండానే, వంటింటి గడపదగ్గరికి వచ్చి నిలబడి, "హేమా, తొందరగా తయారవు!" అన్నాడు.

హేమ ఆశ్చర్యపోయి ది. నవ్వింది.

"ఏమిటీ తొందర, కొంప మునిగి పోయినట్లు?"

"కొంపలు మునిగి పోలేదనుకో! కాకపోతే ఒక మేనేజరు కొంప విడిచి పోతున్నాడు: అంటే, ట్రాన్స్‌ఫర్ అయ్యాడన్నమాట! అందుకని మా స్టాఫంతా ఇవాళ డిన్నరు చేస్తున్నారు. రాత్రి ఏడింటికే డిన్నరు. నువ్వు త్వరగా తెములాలి మరి."

"అలాగే...ముందీ కాఫీ పని పటండి."

పొగలు కక్కే కాఫీని ఒక్క వూపులో తాగేసి బట్టలు మార్చుకున్నాడు రమణ. బాత్‌రూంలోకి వెళ్ళిపోయాడు. హేమ కూడా కాఫీ తాగింది. ఈ రోజు కాఫీ చాలా చక్కగా కుదిరింది. ఫిల్టరునిండా చిక్కగా దిగిన డికాక్షను పరిమళం వంటిల్లంతా పరుగు తీసింది. ఆ పరిమళాన్ని ఆస్వాదిస్తూ, "దీని దుంపతెగ" అనుకుంది హేమ, ఏదో తెలియని ఆనందంలో ఉక్కిరిబిక్కిరై. ఒక్కొక్కరోజిలాగే గుడ్డివాటంగా భేషుగ్గా కుదురుతుంది కాఫీ. జీవితంలో అనుకోకుండా వచ్చే సుఖదుఃఖాల్లాగే!

అన్నయ్యకు కాఫీ మూసిపెట్టి త్వర త్వరగా డిన్నరుకు తయారుకావటంలో నిమగ్నమయింది హేమ. దుర్గమ్మ మేలుకుని ఏదో పాత కథల పుస్తకం చదువుతున్నది. ఆవిడ కాఫీ తాగదు.

ఐదయింది. హేమ స్నానానికి వెళ్దామనుకునేటంతలో యూనివర్సిటీ నుంచీ కాంతారావు వచ్చాడు. ఎండలో నడిచి రావటంవల్ల, వేసుకున్న తెల్లటి షర్టంతా చెమటతో తడిసింది. చేతిలో పూలపొట్లం వుంది.

మౌనంగా అతడి చేతిలోంచి పొట్లం అందుకుంది హేమ. భర్త యింట్లో వున్నప్పుడు అన్నయ్య ఇంటికి వచ్చినా, లేక ఇద్దరూ ఒకేసారి యింట్లోవున్నా—తన మీద ఏదో బరువు పెట్టినట్టుగా వుంటుంది హేమకు. 'ఆనాటి' దగ్గర్నుంచీ తనకు ప్రవ

(60-వ పేజీ చూడండి)




# అమెరికా నూతన అధ్యక్షుడు కెన్నెడీ

ప్రపంచంలో ప్రతిదీ ఎప్పుడో ఒకసారి జరుగక తీరదు. అలాగే అమెరికా చరిత్రలో కూడా అసంభవమని ఇంతవరకు భావిస్తూ వచ్చిన సంఘటన నేడు జరిగినది. అసంభవాన్ని సంభవంచేసిన ఈ మహావ్యక్తి జాన్ ఫిట్‌జిరాల్డ్ కెన్నెడీ. ఈ రోమన్ కాథలిక్ అమెరికా 35వ అధ్యక్షుడుగా ఎన్నికైనారు.

కెన్నెడీ వయసు 43 సంవత్సరాలు. ఇంత చిన్న వయస్సులో అధ్యక్షుడుగా ఎన్నికైనవారు మరెవరూ లేరు.

కెన్నెడీ గెలుపొందడానికి అవకాశాలు అధికమనే విజ్ఞులు మొదటినుంచీ భావిస్తూ వచ్చారు. అదే నిజమైనది.

కెన్నెడీతో పోటీచేసిన రిఛర్డ్ నిక్సన్ ఉపాధ్యక్షుడుగా ఉండడం, ఐసెన్‌హోవర్ పాలనలో జరిగిన తప్పొప్పులను సమర్థించవలసిన బాధ్యత వహించవలసిరావడము, ప్రజలు మార్పుకోరిన సమయంలో అలాంటి మార్పు సూచించలేకపోవడము, దేశంలో ఆర్థిక మాంద్యము ఆయన ఓటమికి ప్రధానంగా కారణమైనవి.

ముఖ్యంగా వెనుకబడిన దేశాలకు కెన్నెడీ ఎన్నిక నిశ్చయంగాముదావహమైనది. వెనుకపడినదేశాలకు పెద్దఎత్తున ఆర్థిక సహాయం చేయడం ఆయన విధానం. భారతదేశంపట్ల తొలుతనుంచి విశేషమైన స్నేహం చూపుతున్న కారణంచేత ఆయనఎన్నిక భారతీయులకు మరీ సంతోషకారణం. 



భోపాల్‌లో భారీ విద్యుచ్ఛక్తి పరికరాల నిర్మాణాగారంలో 'అసెంబ్లీ షాప్' కు ఈనెల ప్రారంభోత్సవం జరిపిన సందర్భంలో వివిధశాఖలను దర్శిస్తున్న ప్రధాని శ్రీ నెహ్రూ.

**న్యూఢిల్లీ లేఖ** — **శ్రీ కృష్ణ**

## రాయపూర్ కాంగ్రెసు

# ఇల్లు చక్కదిద్దుకోడానికి వైముఖ్యం : విదేశాంగ నీతినిగూర్చి ఆర్భాటం

అఖిల భారత కాంగ్రెసు సంఘం ఇటీవల సమావేశమై సాధించిన ఫలితాల సమీక్ష ఇప్పుడు కొనసాగుతోంది. కాంగ్రెసునాయకులు తమ ఇంటిని చక్కదిద్దుకునేందుకు సంసిద్ధంగా లేరనే భావాన్ని మొత్తం మీద ఈ సమావేశం కలిగించింది. ఆశించినట్లుగానే సమావేశం భారత విదేశాంగ నీతిని గూర్చి ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఒకానొక కాంగ్రెసు సభ్యుడు అన్నట్లు ఈ తీర్మానంలో చైనా, పాకిస్తాన్‌ల ప్రసక్తే లేదు.

వచ్చే ఎన్నికలకు కాంగ్రెసు అభ్యర్థులను నిర్ణయించే పార్లమెంటరీ బోర్డు బాధ్యత ఎన్నికైనట్టే. తృతీయ పంచవర్ష ప్రణాళికను గూర్చి కూడా సమావేశం ఒక తీర్మానం ఆమోదించింది. ఈ తీర్మానంపై జరిగిన చర్చ సందర్భంలో ప్రధానమంత్రి కుల తత్వాన్ని తెగనాడారు. 1947 ఆగస్టు 15 వ తేదీనుంచి నేటి వరకు ప్రధానమంత్రి భారతదేశాన్ని ముకుటం లేని రాజుగా పరిపాలిస్తున్నారు. అలాంటప్పుడు కులతత్వాన్ని నిర్మూలించడానికి ఆయన గాని, ఆయన ప్రభుత్వంగాని తీసుకున్న ఇదమిత్థమైన చర్యలేమిటి? అనే ప్రశ్న ఉదయిస్తోంది. ఇక్కడ కొన్ని ఉదాహరణలు ఇస్తాను.

రామలీల ఉత్సవాలలో రాముని పాత్రను ఒక బ్రాహ్మణుడు ధరిస్తున్నాడు. రాష్ట్రపతి ఏటా ఈ ఉత్సవాలకు హాజరై, రాముని వేషం వేసే బ్రాహ్మణ బాలుని నొసట తిలకం దిద్దుతున్నారు. రాముని పాత్రను ఒక అబ్రాహ్మణుడే – ఆమాటకొస్తే ఒక రాజపుత్రుడు – ధరించాలని రాష్ట్రపతి పట్టుబట్టినట్లయితే, కులతత్వ నిర్మూలనకు ఆయన ఎంతో దోహదం కలిగించినవారయ్యేవారు.

క్రమశిక్షణను గూర్చి మెచ్చుకుంటూ ప్రసంగించినంతమాత్రాన భారతీయులను క్రమశిక్షణాయుతమైన జాతిగా తయారుచే

రాముడు క్షత్రియుడు. అయినప్పటికీ యటం ఎలా సాధ్యం కాదో, అలాగే కుల

తత్వాన్ని తెగనాడినంత మాత్రాన దానిని నిర్మూలించడంకూడా సాధ్యంకాదు. కులం పేరుచెప్పకుని ఎన్నికయ్యే కాంగ్రెసు వాదులను, ఐదు సంవత్సరాలపాటు అనర్హులుగా ప్రకటిస్తే కులతత్వం నిర్మూలింపబడుతుంది. శ్రీ లాల్ బహుదూర్ శాస్త్రి, వచ్చే ఎన్నికలకు కాంగ్రెసు అభ్యర్థులను నిర్ణయించే ప్రధానాధికారిగా వ్యవహరిస్తారు. ప్రస్తుతం పార్లమెంటు సభ్యులుగా ఉండి, తిరిగి ఎన్నికకోదలిచే ప్రతి సభ్యుణ్ణి గూర్చి, క్రితంసారి ఎన్నికలలో వారు తమ తమ కులవర్గాల సహాయం అర్థించారా? అనే విషయం దర్యాప్తు చేయించవలసిందిగా ఆయనను (శ్రీ శాస్త్రిని) కోరాలి.

ముఠాతత్వం, అధికారంకోసం సాగుతున్న కీచులాటలను గూర్చి రాయపూర్ కాంగ్రెసు సమావేశం ప్రధానంగా చర్చించింది. కాంగ్రెసు సంస్థకు సంబంధించినంతవరకు ఈ సమస్యను ఎవరూ పట్టించుకోలేదు. బ్రిటిష్‌వారివలె కాంగ్రెస్సుకు కూడా ఏదో విధంగా బండిని నడపలేకపోతామా అనే అపోహ ఉన్నది. అడ్డదిడ్డంగా వ్యవహరించటంవల్లనే బ్రిటిష్‌వారు మహాసామ్రాజ్యాన్ని కోల్పోయారు. బ్రిటన్ ఇప్పుడు తృతీయశ్రేణికి చెందిన రాజ్యం మాత్రమే. ప్రదేశ్ కాంగ్రెసుసంస్థలలోని అల్పసంఖ్యాక వర్గాల ప్రతినిధులకు టిక్కెట్లు నిరాకరించటంద్వారా విచ్ఛిన్నకర వైఖరిని నిర్మూలించవచ్చు. ఇది ఒక పద్ధతి. అల్పసంఖ్యాక వర్గం అధికారంలోకివచ్చే అవకాశం లేదని గ్రహించిన ఉత్తరక్షణంనుంచి ప్రజలు ముఠాలను బలపరచరు. ఉన్నమాట చెప్పాలంటే ఇదంతా అధికారంకోసం కాంగ్రెసులో జరుగుతున్న కీచులాట. ముఠాలవల్ల ఒరిగేది ఏమీ ఉండదని ప్రజలకు నచ్చచెప్పేందుకు వెంటనే కట్టుదిట్టమైన చర్యలు తీసుకొనకపోతే కాంగ్రెసు సంస్థ సమూలంగా నాశనమవుతుంది. ఇలాంటి చర్యలు తీసుకోగల సామర్థ్యం ప్రధానమంత్రి ఒక్కరికే ఉన్నది. ఏవో కొన్ని సందర్భాలలో ఆయన ఎవరో ఒక 'కాల్'ను బలపరిచినా – ప్రధాని కూడా కాలే – ప్రజలకు ఆ ఘనయందు పరిపూర్ణ విశ్వాసం ఉన్నది. కాంగ్రెసుసంస్థను సరిదిద్ది, దేశంకల్లోలం పాలాకుండా రక్షించగలవారు ఆయన ఒక్కరే. "నేను గతించిన తరువాత ప్రళయం వస్తుంది" అని 14 వ లూయీ అన్నాడు. కాంగ్రెసు అంతరించిన తరువాత కూడా అల్లాగే జరుగుతుంది. నిజానికి అప్పుడే కల్లోలం ప్రారంభమైంది.

* * * *

సాంకేతిక సహకారసంస్థ సహాయంతో, జాతీయ ఉత్పత్తి మండలి విదేశీశిక్షణ కార్యక్రమాన్ని అనుసరించి, 1959 లో 87మందికి, 1960, 1961 లలో ఏటా 50 మందికి శిక్షణ సదుపాయాలు ఏర్పాటయ్యాయి. "సైంటిఫిక్ మేనేజ్‌మెంట్" లో ఆరుమాసాలపాటు శిక్షణ పొందేందుకు ఈ సంవత్సర ప్రారంభంలో 19 మందిని ఫ్రాన్స్‌కు పంపడమైనది. ఫ్రెంచిప్రభుత్వ సహాయ కార్యక్రమం క్రింద ఈ పని జరిగింది. "ప్రొడక్షన్ మేనేజిమెంట్"లో శిక్షణకోసం వచ్చే ఏడు మొదటిలో మరో 15 మంది వెడతారు.

25 మంది అభ్యర్థులకు ఆరుమాసాలపాటు శిక్షణ వసతులు కల్పించేందుకు సోవియట్ ప్రభుత్వం సంసిద్ధత తెల్పింది. ఈ అభ్యర్థులు వచ్చే సంవత్సరం మార్చి, ఏప్రిల్ మాసాలలో రష్యాకు బయలుదేరి వెడతారు. ఇలాంటి సదుపాయాలకోసమే చెకొస్లొవేకియా ప్రభుత్వంతో కూడా సంప్రదింపులు జరుగుతున్నాయి.

అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలలో "సైంటిఫిక్ మేనేజ్‌మెంట్," "ఇండస్ట్రియల్ ఇంజనీరింగ్," "ఇండస్ట్రియల్ రిలేషన్స్"లకు సంబంధించిన ఆధునిక విధానాలనుగూర్చి పరిశోధించేందుకు జాతీయ ఉత్పత్తిమండలి ఇక్కడ ఒక సమావేశం ఏర్పాటు చేసింది.

అమెరికా ఔదార్యంవల్లనైతే నేమి, శ్రీ మనూభాయ్‌షా కార్యదీక్షవల్లనైతే నేమి, దేశీయ పరిశ్రమల ఉత్పత్తిని అధికం చేసే సంకల్పంతో ఎందరో భారతీయులు శిక్షణ నిమిత్తం నేల నాలుగు చెరగులకు వెళ్ళారు. భారతదేశంలో వ్యవసాయోత్పత్తిని అభివృద్ధిపరచడానికి, వ్యవసాయదారులకు శిక్షణ గరిపేందుకు అమెరికన్లు ఒక ప్రత్యేకకార్యక్రమాన్ని కూడా రూపొందించారు.

జాతీయ ఉత్పత్తి మండలిపాలకవర్గం అధ్యక్షుడుగా డా॥ పి. యస్. లోకనాథన్ వ్యవహరిస్తున్నారు. ఆయన గొప్ప ఆర్థిక శాస్త్రవేత్త కూడాను. ఉత్పత్తికి పోటీ అనివార్యం అని ఆయనకు తెలిసి ఉండవలసింది.

( 60వ పేజీ చూడండి)

# ఎయిర్ మార్షల్ సుబ్రతో ముఖర్జీ



అదృష్టం వరించినది. ఉన్నతి లభించినది. దేశానికి అఖండమైన సేవ చిరకాలం చేయగలిగిన సదవకాశమూ ఉన్నది. అందునా ముష్కరుడైన శత్రువు ఎదుర్కొన్న సమయంలో మాతృదేశ స్వాతంత్ర్యం రక్షించేమహత్తరమైన బాధ్యత పైబడినది. దానిని నిర్వహించడానికి వలసిన శక్తి సామర్థ్యాలు ఉన్నవి. ఆయుర్దాయం మాత్రమే కరవు అయినది. అయినప్పుడు అవ్వ నిజంగా అదృష్టపిశాచము కాదా?

భారత విమాన బలాధిపతి ఎయిర్ మార్షల్ సుబ్రతో ముఖర్జీ ఈ విధంగా అదృష్టం చేత వంచింపబడ్డారు. భారతీయులందరికి ఎనలేని సంతాపాన్ని కలిగిస్తూ నవంబరు 8 వ తేదిని టోకియోలో హఠాత్తుగా మృతి చెందారు. ఆయన వయసు 49 సంవత్సరాలు మాత్రమే.

ముఖర్జీ స్వదేశంలో ఒక విమాన సైన్య కేంద్రానికి అధిపతిగా వ్యవహరించిన తొలి భారతీయుడు (1943 లో కోహాట్‌లో). స్వతంత్ర భారతదేశంలో తొలుత విమాన బలాధిపతి పదవి నిర్వహించిన ఘనత కూడా ఆయనకే దక్కినది.

ముఖర్జీ ఆధిపత్యంలోనే విమాన బలం పూర్తిగా జెట్ విమానాలతో సుసజ్జితం కావడమూ జరిగినది.

దేశంతోపాటు మన విమానబలం కూడా అవశ్యం ఘనమైన అభివృద్ధి సాధిస్తుంది. కాని ముఖర్జీ మృతివల్ల ఏర్పడిన లోటు మాత్రం నిలిచిపోతుంది. 

ఆ గోజులు కొండంత మంచిపీ, మా చిరిగి పోయిన ఉన్ని రగ్గంత పాతవీని. నిత్య జలగా నీరు ప్రవహిస్తున్న వేగావతి ఏటి నానుకుని ఉంది కొట్టక్కి, మా అమ్మమ్మ గారి ఊరు. ఊరు మొదట్లో పాడుపట్టి నల్లనల్లగా పచ్చపచ్చగా ఉన్న పాడుబడిన గోడల్లో ఉంది, ఒక చిన్న ఎలిమెంటరీ స్కూలు. స్కూలు పక్కగా గతికలతో నిండిన రోడ్డుమీద కొంచెం దూరం నడుస్తే వస్తుంది వర్తులవారి వీధి. అందులో మూడో ఇల్లు మా అమ్మమ్మగారిది.

మూడో ఇల్లయిన మా అమ్మమ్మ గారి గృహాంగణంలో, చెక్కసున్నం చేసిన సుందరపడిగ ట్టుంటూఉండేది. ఆ గట్టు మధ్యని క్రొత్తగా నాటిన లేత మర్రి మొలక దానికి చుట్టూ సుందరంగా పాదుకట్టి ఆవులు మేకలు భక్షించకుండా ముళ్లకంపలు అడ్డు పెట్టేరు.

మా అమ్మమ్మ-అప్పటికే అరవై ఏళ్ళుముసిలిది, చాదస్తపు మనిషీను-రోజూ తెల్లవారకుండా ఏట్లో స్నానం చేసుకుని తన జారీ నిండా చల్లని నిర్మలమైన ప్రవాహజలాన్ని నింపుకొని, తన ఇంటి ప్రాంగణంలో ఉన్న మర్రిమొలక మొదట్లో పోసి, వ్యాసనారాయణుల స్మరణచేసుకుని మరీ ఇంట్లో అడుగు పెడుతుంది.

ఆవిడకు వృద్ధాప్యం వచ్చినా తీరని కోరిక ఒక్కటే ఉండిపోయింది. వాంఛితం జనించనే కూడదు. జనించిన తరువాత, అది తీరే విధానాలు ఆలోచించడం, అందుకు అనుకూలమైన వాతావరణాన్ని కల్పించుకోవటం, ఇవి సాధారణంగా జరిగేవి. మా అమ్మమ్మ కూడ, అంతే! ఆమె లోకాతీతురాలు కాదు! అయితే, ఆమెయొక్క ఆ తీరని కోరిక ఏమిటి? అన్న ప్రశ్న అందరినీ కలవరపర్చేది. మామూలుగా, కొడుకుతో మాట్లాడినప్పుడు కూడా, "తీరని కోరిక" అని సూచించేది కాని, ఏమిటో బయటపెట్టేది కాదు.

మా పెద్దమామ చాల నిరాడంబరమైన మనిషి. కాని కోపదారి. భూవసతి, వసతిగృహం, గృహలక్ష్మి, లక్ష్మీసౌభాగ్యం, ఇన్నీ అమరి ఉన్నా, మా పెద్దమామ నిరాడంబర జీవనం, కొంతమందికి ఈర్ష్య జనింపచేసేది; కొంతమందికి, సదభిప్రాయం కలింపచేసేది. పొలం పనులు లేని తీరికసమయాల్లో, ఊళ్లో పిల్లలకి, ఉదారంగా, అమరం, వ్యాకరణం, అవీ బోధించేవాడు. సాయంత్రాల్లో పురాణ పఠనం గూడ, రామమందిరం అరుగులమీదను గానించేవాడు. ఇటువంటి దినచర్యగల మా పెద్దమామ, భక్తిపూరితరైన మా అమ్మమ్మకి తగిన సంతానం అని కూడ, మా దూరపు బంధువులు, సహృదయులు, అనుకునేవారు.

అదే కారణం అయింది అమ్మమ్మకి కల్గిన తీరనికోరిక ఏమిటో తెలుసుకోకుండా ఉండేటందుకు. మా పెద్దమామ అనుకొనేవాడు, అవిడే చెప్తుంది అని. మా అమ్మమ్మ కూడ, తరిచి అడిగితేనేగాని చెప్పకూడదని నాన్చేసేది. ఆమె స్వభావమే అంత.

ఒక రోజున; వీధి గుమ్మంలో కూర్చుని, ఎడం చేత్తో పిలక సరుకుంటూ, కుడిచేత్తో పంచాంగం చూస్తూ ఏవో లెక్కలు కడుతున్నాడు మా పెద్దమామ. అప్పుడే, మా అమ్మమ్మ స్నానం చెసుకుని, మర్రిమొక్కకు నీళ్లుపోసి, గుమ్మం ఎక్కుతూంది. బాలభానుని కిరణాలు అప్పుడే పరివ్యాప్తమౌతున్నాయి. నా అలవాటు ప్రకారం నేనింకా పక్కమీంచి లేవలేదు తెలివొచ్చినా. వస్తూనే అడిగింది మా అమ్మమ్మ.

"ఒరే బాబుగా! రామ్మూర్తిగారికుటుంబం తీర్థయాత్రలు చెయ్యడానికి వెళ్లేరుట కదూ! ఆమాట నాతో చెప్పనేలేదేం!" అని.

"వాళ్లు చెప్పలేదనా? నేను చెప్పలేదనా అడుగుతున్నావు?" అన్నాడు మా పెద్దమామ.

"వాళ్లు చెప్పలేదని, వాళ్ళ ననుకుంటే ఏం ప్రయోజనం, నువ్వే నాకు తెలియచెయ్యవప్పుడూ." కొంచెం విసుక్కుంది మా అమ్మమ్మ. మరే సమాధానం చెప్పడానికి అవకాశం లేక, మా పెద్దమామ, నున్నగా ఉన్న తన బుర్ర రాసుకున్నాడు అరచేత్తో.

"రామ్మూర్తి అదృష్టవంతుడు. ఇంతకీ ఎవరి కెంత రాసిపెట్టి ఉందో నుదుటని. అరవై ఏళ్లు పైబడ్డాయి నాకు. ఇక్కడికి ముప్పై కోసుల్లదూరంలో ఉన్న శ్రీకూర్మం వెళ్లి స్వామి దర్శనం చేసుకోవటం అవలేదు. ఇదంతా నా కర్మ కాకపోతే, ఏమనుకోను. జీవితంలో ఇది, తీరని కోరికగానే ఉండిపోతుంది కాబోలు" అని ఇంకా వాపోయింది మా అమ్మమ్మ.

మా పెద్దమామ కిన్నాళ్ళకి తెలిసింది తన తల్లి తీరని కోరిక ఏమిటో.

"ఇంతే కదటమ్మా! యాత్రలు చేయాలని, దేవుళ్ళని సేవించాలనేనా నీ కోరిక. మనం కూడా ఒచ్చే ఏడు బయలేరుదాం" అన్నాడు.

"ఈ ఏడు ఏట్లో కలిసింది. ఒచ్చే ఏటికి.." అని పూర్తి చేయకుండానే వట్టింట్లోకి వెళ్లిపోయింది.

"అది కాదమ్మా! నేనన్నది. ఆర్థికంగా మన పరిస్థితి చూడు. రెండు సంవత్సరాలాయి వంటపోయిందా. నిన్న కాక మొన్న టివరకూ చెల్లాయి పురిటికి చేసుకున్న అప్పు తీరుస్తూనే ఉన్నామా! ఈ సంవత్సరం కదా మన పనులు మనమే స్వయంగా చెసుకోవటాన్ని, మన కాళ్లమీద మనం నిలబడగలిగేము. నాకు మాత్రం ఉండదూ, నీ వార్ధక్యంలో, నీ తీరని కోరికను చెల్లించాలని" అన్నాడు మా పెద్దమామ.

ప్రక్కనే పొంచివింటోంది మా పెద్దత్త.

"ఏమిటండోయ్! తీరని కోరికలూ, చెల్లించుకోవడాలూ" అంటూ ఎత్తిపొడుస్తూ కుడిచేతులో చీపురుల, చంకలో చంటిపిల్లాడిని వేసుకుని, అత్తగార్కి ఎదురుగా వెళ్లింది.

"ఎందుకే అలా గింజుకుపోతావు" అంటూ మా అమ్మమ్మ, ఆ విషయాన్ని అక్కడికి ఆపుచేసి, వంటింటివేపు దారి తీసింది. మా పెద్దత్త కూడ ఆమెను వెంబడించింది.

కోడలు వీధిలోనే ఉందనుకుని మా అమ్మమ్మ ఏదో గొణిగినట్లున్నాది. వెంటనే మా పెద్దత్త అందుకుంది. "ఏమిటత్తా! ఆ గొణుగుడు. తిట్టేది స్పష్టంగా, నాకు వినపడేటట్టు తిట్టేయండి. తప్పేం లేదుగా" అంటూ. పోనీ ఆమె ఊరుకోకూడదూ! ముసిలావిడ ఏదో అనుకుంటున్నాదని.

"ఆఁ! అంటున్నాను. అంటాను. ఈ ఇంట్లో నువ్వు పడ్డ దగ్గరనుండి, వెధవ వెట్టిచాకిరీ తప్ప, పుణ్యం పురుషార్థం అడుగంటేయని అంటున్నాను." మా అమ్మమ్మకి చాల కోపం వచ్చింది. 'కోడలువచ్చిన నాటినుండి' అని స్పష్టంగా చెప్పెయ్యడంతో, మా పెద్దత్తకి కూడ హృదయం మండిపోయింది. కానీ, ఎవరూ బయటికి రానివ్వలేదు. గుంభనగా వాళ్ళ కోపాలని, అణచిపెట్టుకున్నారు. మా అమ్మమ్మ కోపం నిలవదు. కాని, మా పెద్దత్త పట్టుదల మనిషి.

ఆ అత్తాకోడళ్లకి ఒక నిముషం పడదు. ఒకరు, ఒకటంటే రెండనవారు, వినూత్నమైన అర్థాలు తీసి, రభస పెంచుకుంటారు. మా పెద్దమామకు ఇవన్నీ తెలియవని కాదు. కాని, కల్పించుకోడు, ఆ గృహచ్ఛిద్రాల లోకి. ఏమంటే తనకి బాగా గురి మా అమ్మమ్మది తాత్కాలిక కోపం అని రగడలు ఏమొచ్చినా, వాటంతట అవే, సమసిపోతాయని. నా మనస్సుకి మాత్రం, తీర్థయాత్రల ఊసే ఇంత రాద్ధాంతం తెచ్చిందే, అసలు ప్రయాణాల వేళకి చిన్న అంతర్యుద్ధం తయారవుతుందా అనిపించింది.

రామ్మూర్తి గారి కుటుంబం యాత్రలకి



బయలు వెడలడంతో, మా అమ్మమ్మ కూడ మనసులో నిశ్చయించుకుంది, తానూ కొద్ది రోజుల్లో యాత్రలు సేవించటానికి వెళ్ళాలని. ఏమంటే, తనకు వృద్ధాప్యం. ఈ విడు వృథా చేస్తే, వచ్చే ఏటికి తాను జీవించి ఉండా వచ్చును, లేకపోనూ వచ్చును. తన అంతరాత్మ ఎక్కువ ప్రోత్సాహాన్నిచ్చింది, ఈ వీడే తనకు అన్నివిధాలా అనుకూలమైనదని, లేకుంటే, ఇంక కోడలు కానివ్వకుండా చేస్తుందని. పరిస్థితుల ఒత్తిడివల్లనైతేనేమి, ఆమె స్వభావంవల్లనైతేనేమి, మా అమ్మమ్మ, ఏ విషయం తలపెట్టినా, ముందుగా చెయ్యవలసిన సంరంభం అంతా పూర్తి చేసుకుని, చెప్పడమే ఒక్కటి తరువాయిగా ఉంచాలనుకుంటుంది. రోజూ జరుగుతూన్న కీచులాటలుకూడ, ఇటువంటి మనస్తత్వాన్ని పెంపొందించుకోవడానికి కొంత దోహదంచేశాయి. ఈ తత్వం మా పెద్దత్త గ్రహించుకోకపోలేదు. “మీ గుంభన నా సంసారపు గుండెలమీద కుంపటే” అని సమయం వచ్చినప్పుడల్లా అంటేస్తూనే ఉండేది. మా అమ్మమ్మ మాత్రం, తాను తీర్థయాత్రలకై ప్రయాణం చేసేరోజు వరకూ తనకోరిక ఎవ్వరికీ తెలియనివ్వకూడదని నిశ్చయించుకుంది. ముఖ్యంగా తన కోడలికి ఆచూకీకూడ అందివ్వకూడదని. అంతా సిద్ధమైనతర్వాత ప్రయాణం మానుకోమని ఎవ్వరూ అనరుకదా చూస్తూ చూస్తూ.

తదారభ్య.

ఆవిడ ఒక్కొక్క విషయం జాగ్రత్తగా ఆలోచించుకోసాగేది. తన వస్తువులు బట్టలు పెట్టుకోనేటందుకు ఒక చిన్న పెట్టె, కర్రదైనా పర్వాలేదు. పాపం! ఆవిడకున్న వస్తువు లేమిటి కొట్ట! ఐదో ఆరో నీరు కావి పంచలు, ఒక నాగులుగావంచాలు, చిన్న జారీ, రుద్రాక్షమాల, చినిగిపోయి, వతబడిపోయిన భగవద్గీత పుస్తకం. ఇంతే! తన వార్ధక్యదశలో కూడ, లంపటాలలా, అన్నివిషయాలూ, బాధ్యతలూ తన నెత్తి మీద రుద్దుకుని కాపీనం పడితే, చనిపోయే ముందు, ప్రాణం సుఖంగా పోదనీ, వాళ్ళ లింగన్న తాత మరణవేదన స్మరించుకుంటే తనకు శరీరంలోనుండి ఒకవిధమైన ఆవేదన, ఆందోళన, భయోత్పాతం కలుతాయనీ పదేపదే చెప్పేది. బాధ్యతలన్నీ ఒదులుకోవడం ఆవిడకి ఒక విధంగా అపకారంకూడ చేశాయట! తన తర్వాత కొడుకులేకదా అన్న సదుద్దేశంతో, మా పెద్దమామకి పెత్తనం అప్పగిస్తే, అతగాడు మా పెద్దత్తకి ధారపోసేడట! ఆ విధంగా మా అమ్మమ్మ



భావించేది. లేకుంటే "తన సలహాలు పొందుతూ, తాను చెప్పినట్లునడుచుకుంటూ, కోడలు ఘటానికి చిల్లికానీ కూడ అందనీయకుండాచేస్తే, ఆ పొగరు, బిగువు అన్నీ చల్లారి, చచ్చిన పేనులాగ పడిఉండదా" అంటుంది. ఆవిడ దృష్టిలో కొడుకు అసమర్థుడూ, కోడలు గయ్యాళి గడసరి.

అందుచేతనే, తన వస్తుసేకరణవిషయంలో మా పెద్దత్త సహాయం ఇంచుకంతైనా పొందకూడదని నిర్ణయించుకుంది. తన బట్టలు ఇతర సామగ్రి పెట్టుకోవడానికి తనకని వేరే ఉంటూన్న కర్రపెట్టెచాల్నని తృప్తిపడింది. ఇంక భోజనసామగ్రి తరువాతి ప్రశ్న. రెండు చిన్నగిన్నెలు సరిగా ఇద్దరు మనుష్యులకు సరిపడ్డవి అవసరం. కూరగిన్నె అవసరం లేదు. పప్పుగిన్నెతోనో, అన్నంగిన్నెతోనో కూరవండి పడేసుకోవచ్చు.

ఆలోచనలతో సతమతమవుతూన్న మా అమ్మమ్మ కొంచెం పరధ్యానంగా ఉంటూఉండేదేమో అని నాకనిపించేది. అన్ని వస్తువులు, తన ఊహ కందినంతవరకూ ఏర్పాటుగా సమకూర్చుకుంది. తన వృద్ధజీవితాన్ని తీర్థయాత్రాఫలితంతో పునీతం చేయాలన్న మనోనిశ్చయం, ఆమెలో ఒక క్రొత్తఆనందాన్ని, అనిర్వచనీయ సంతృప్తిని గొల్పింపచేసింది.

ప్రయాణ సన్నాహానికి అన్ని ఏర్పాట్లు అయ్యాయి. ఇంకఉన్నతరువాయి ఒక్కటే. చిన్నవస్తువు. కాని చిక్కులన్నీ తెచ్చిపెట్టేదయింది. ఆ చిన్నవస్తువువలన, కాదగ ప్రయోజనం, మా అమ్మమ్మ దృష్టిలో అమోఘమైనది. అది లేకుంటే అసలు తిండికి వాచిపోవలసివస్తుందికూడ. నాలుకమీద మొక్కలు మొలిచిపోతాయట! అవును. అది చిన్నవస్తువే! పేరుకి. అంటే చిన్నమ్మ. డబ్బు, కాదు! కాదు! నన్ను ఎగతాళి చేయకండి. మా అమ్మమ్మ డబ్బుగురించి చింతించనేలేదు. నాకు బాగా తెలుసును. ఆమె మనోఅభిప్రాయాలు సులువుగా గ్రహించుకునేవాడిని. ఆమాత్రం తెలుసుకోలేనూ. ఆ చిన్న వస్తు వేమిటి?

నేను వంటింటి గుమ్మంలో కూచున్నాను. మా అమ్మమ్మ లోపల వంట చేస్తూంది.

"రాయుడూ" నా పేరుపెట్టి పిల్చింది మా అమ్మమ్మ.

"ఏం అమ్మమ్మా."

"ఆఁ! ఏంలేదు...పెద్దత్త ఎక్కడుంది" సందిగ్ధపూరితంగా ఇక్కడేఉందా అన్నట్లు ప్రశ్నించింది.

"లేదులే! ఎవ్వరూ లేరిక్కడ!"

"మీకు సెలవులెన్నాళ్ళురా?"

"రెణ్ణెళ్ళు"

"అమ్మకూడా వస్తానందేమిట్రా"

"లేదమ్మమ్మా! నన్నొక్కణ్ణే వెళ్ళమంది. దానికి పల్లెటూరివాసన గిట్టదుట!"

# ఆసిపిరం

"ఆఁహాఁ! పోనీలే. అదికూడా ఒకందుకు మంచిదే."

"నిజంచెప్పేదా అమ్మమ్మా! అమ్మవస్తే, నన్నిలాఆడుకోనిస్తుందా? నువ్విచ్చినడబ్బులు ఖర్చుపెట్టనిస్తుందా?" అన్నాను.

మళ్లా మాఅమ్మమ్మ ఆలోచనలో పడిపోయింది. రెండునిముషాలు నిశ్శబ్దం.

"రాయుడూ! నువ్వు నేనూ కలిసి తీర్థాలకెళ్దాంరా"

"ఏంతీర్థాలూ? రామతీర్థాలా?" నాకూ సంతోషంగానే ఉంది.

"అబ్బే! ఒక్క రామతీర్థాలే ఏమిటి. అన్నీను. కనకమహాలక్ష్మి, మీనాక్షి, కామాక్షి ఇటు కాశీవిశ్వేశ్వరుడూ. అసలు ముఖ్యంగా తిరుపతి వెళ్లాలి"

"ఓయబ్బోయ్! ఎంతడబ్బుండాలో తెలుసా అమ్మమ్మా!"

"నాకు తెలీదుటరా ఆమాత్రం. డబ్బుగురించి నువ్వు విచారించకు. అది నాపూచీ. కాని, నువ్వొకపనిచేసిపెట్టాలి. మనకి, అవసరంపడతాయి, అన్నసామగ్రి అంతా జతపర్చేను. కాని, వెధవది, చిన్నవస్తువొకే ఒక్కటి కుదరలేదురా" కొంచెంసేపూరుకుంది. ఎవరేనా ఈవైపు వస్తున్నారేమోఅని ఇటూఅటూచూసి, రాలేదని దృఢపర్చుకుని మళ్లా చెప్పింది.

"చూసేవూ, చిన్నకత్తిపీట ఏదీలేదురా. ప్రయాణాల్లో కూర తరుగుకోవడానికి, చిన్నకత్తిపీట లేకుంటే, నాలికమీద మొక్కలు మొల్చిపోతాయి" అంది.

నాకో పెద్దబరువు దింపినట్లయింది. నావలన సహాయంకావాలని మాఅమ్మమ్మ చెప్పినప్పుడే, నా గుండెలు దడదడలాడేయి. నేనేం సహాయం చేయగలనా అని. ఆఖరుకి, మాఅమ్మమ్మని వేధించుకుని తింటూన్న ఈ చిన్నకత్తిపీట చేయించడం ఏమాత్రం పని. "తనకు కావలసింది చిన్నకత్తిపీట. దానికి కత్తిమీద కొబ్బరికాయ కోరుకోవడానికి వీలుగా పళ్ళుంటే మరీబాగు. వీలుగాఉన్న కత్తిపీట ఏదీ ఇంట్లోలేదు. అఉన్నదేదో, శివధనుస్సంత పెద్దది. ఆవకాయకత్తిపీట. కాని కావలసింది చిన్నది, మడతపడ్డది, కోరుకోవడానికి వీలుగాఉన్నది అయిఉండాలి. పల్లెటూర్లలోఉన్న పెద్దచిక్కు అదే. అన్నీ చెప్పిచేయించుకుంటారుకావలిస్తే. పట్నాలలోలా చేసి, వీధుల్లోకి అమ్మదీసుకురారు. ఎవరితో చెప్పి చేయించుకోవడం. పైవాళ్లెవరితోనన్నా చెబితే ఇంట్లోవాళ్ళు చచ్చేరనా వీళ్లతోనూ వాళ్లతోనూ చెప్పి చేయించుకుంటున్నారు అంటుంది మా పెద్దత్త. అంతటితో ఊరుకుంటుందా. దాని అవసరం ఏమిటో ఎప్పుడూ అక్కర్లేనిది అప్పుడెందుకు కావలసివచ్చిందో, ఇలా సంగతులన్నీ చర్చకువస్తాయి. పొరపాటున మాటల సందర్భంలో యాత్రల విషయం అనేస్తే, మొదటికే మోసం వస్తుంది."

"పెద్ద మామతో చెప్పమ్మమ్మా. ఇట్టే చేయించుకొస్తాడు" అన్నాను.

"నా మొహం. వాడితో చెప్తే కానిస్తుందటరా మీ అత్త."

ఇంతలో వీధిగుమ్మంలో పిల్లల ఏడుపులు బయల్దేరాయి. మా రామంగాడు, పార్వతి ఒకఅర్ధణా కోసానికి, నాకియ్యి అంటే నాకియ్యి అని కొట్టుకుంటున్నారు. అలా తగవులాడుకుంటూ వంటింటివరకూ వచ్చేరు.

"నాకు డబ్బులు కావాలి" అన్నాడు రామం.

"నావి డబ్బులు. నాకు తానిచ్చేడు" అంది మా పార్వతి.

ఈ ఏడుపులు విని మా పెద్దత్తగూడ, అదెక్కడనుండో ఊడిపడ్డాది.

"నా కెందు కివ్వలేదే అమ్మా! రాయుడు బావ!" అంటూ, తన చిన్న మృదువైన వేళ్లతో, మా పెద్దత్త చేతిమీద గిల్లేడు. మొదట మా పెద్దత్త నవ్వింది. బహుశా, నేను పార్వతికి డబ్బులిచ్చి, ఇప్పట్నించే, చనువు చేసుకుంటున్నానని కాబోలు. కాని వెంటనే రామంగాడి గిల్లుతో నవ్వు మాయమైంది. గిల్లినందుకు, వాణ్ణి నాలుగు తన్నింది. కూతురువైపు చూస్తూ "ముండా! నువ్వెందుకే చెప్పేవు. డబ్బులున్నాయనీ" అంటూ, దాన్నికూడా రెండుమార్లు కొట్టింది.

నాకు మా పెద్దత్త, మా అమ్మ, కొట్టడంలో ఒకటే నేమో అనిపించిది!

మా అమ్మమ్మవేపు తిరిగింది మా పెద్దత్త.

"మీరుండేనా ఈ గోలంతా!" అంది అధికారయుక్తంగా.

"నేనేం చేసేనే! నీ పిల్లలు సాధారణులా. రాలుగాయ వెధవలు." కోపంగానే అంది మా అమ్మమ్మ. కారణం? మే మిద్దరం తీవ్రంగా ప్రయాణాలగూర్చి ఆలోచిస్తూ

ఒక పిచ్చివాడు – నేను చాలా తపస్సుచేసి బ్రహ్మదేవుని చే వరాలు పొందానురా, ఏమనుకున్నావో!

రెండవ పిచ్చివాడు – ఒరేయి గాడిదా, ఎవడివిరా నువ్వు? నేను నీకు వరాలు ఇవ్వందే!

—ఇంద్రగంటి పురుషోత్తం (పెనగడప)

ఉంటే, ఈ గందరగోళం జరిగిందని.

"అవును. నా పిల్లలు రాయిగాయిలు. నేను గయ్యాళిని. మీరు మాత్రం ఏమీ తెలియనివాళ్లు. ఓ జామిపండు ఆ వెధవకి పారేస్తే ఈ కొట్లాడుకోవటం ఉండేదా." అంది మా పెద్దత్త వర్షిస్తున్నట్లు.

నామట్టుకి మా పెద్దత్తన్న మాట నిజమే ననిపించింది. ఒక్క జామిపండు పారేస్తే మా రాముంగాడే ముందూరుకుండును. నాకు స్ఫురించనిదే ఆ ఆలోచన. మా అమ్మమ్మకీ తెలియలేదు. మాకు తెలియక పోవడానికి కారణం లేక పోలేదు. అప్పుడు, మేం తీవ్రంగా తీర్థయాత్రల గూర్చి చర్చ చేస్తున్నాం. అందులో ముఖ్యంగా కత్తిపీట సమస్య అయిందాయె!

మా పెద్దత్త, ఇద్దరు పిల్లల్ని ఈడ్చుకొని వడవలోకి వెళ్లింది. మా రాముం ఆవిడ పట్టు తప్పించుకుని వంటింటివేపే వచ్చేడు. "నువ్వే చెడ్డదానివే అమ్మా, నాయనమ్మ మంచిదే, రాయుడుబావా మంచివాడే. నువ్వే, ఇచ్చేదేమీ లేకపోయినా తంతున్నావు" అని వాళ్లమ్మతో అంటూ, "నానమ్మా, జామిపండివ్వవే" అనడిగేడు. ఈ మాటలు మా పెద్దత్తకి పౌరుషాన్ని కలించేయి. "చిన్ననోటికి పెద్దమాటలు" అని గట్టిగా అరుస్తూ, పిల్లణ్ణి ఈడ్చుకుని మళ్లా వెళ్లింది మా పెద్దత్త.

ఇదంతా కనురెప్పపాటులో జరిగిపోయింది. ఈ గోల వర్ణింప వలవికాదు. ఊహింపవలసిందే. పాపం! మా అమ్మమ్మ, కళ్లంటనీళ్లు పెట్టుకోవడం నేను గమనించలేకపోలేదు అబ్బ! ఏది ఎలా ఉన్నా, గాలివాన తగ్గినట్లనిపించింది

"చూసేవా రాయుడూ! ఇలాంటికుక్కబుద్ధులన్నా, కత్తిపీటగురించి చెప్పి చేయించుకోవడం. నా పనికే భంగం కాదూ!" అంది.

మా అమ్మమ్మకి తీర్థయాత్రాభిలాష ఎక్కువవుతూన్న కొలదీ, ఎవ్వరూ లేనప్పుడు, చిన్నకత్తిపీట గురించే నాతో చెప్పేది.

"రాయుడూ" నవ్వుతూ మాట్లాడుతూంది మా అమ్మమ్మ. పిల్లలంతా పడుకున్నారు. పెరట్లో పనులు చక్కపెడుతూంది మా పెద్దత్త. మా పెద్దమామ సాలివీధిలో జగ్గయ్య అంగడికి తమలపాకులు చెక్కలు (వక్కలు) కొండానికని వెళ్లేడు. చిట్టచీకటి. నక్షత్రాల వెలుగుకి, నేనూ మా అమ్మమ్మ అరుగుమీద కూచుని మాట్లాడుతున్నాం.

"రాయుడూ! ఎప్పుడూ చిన్న కత్తిపీటే కలలోకొస్తోందిరా. అనపముక్క సన్నంగా ఈనెల్లా తరుగుతున్నట్లు, అరటికాయ, దవ్వ, ముత్యాల్లా తరుగుతున్నట్లూను. ఏవేవ కలలు. నువ్వు చేయించిదూ. అటు సాలివీధిలో కమ్మరిదుకాణం లేదూ. అక్కడే పురమాయించు. ఎలా ఉండాలో తెలుచు కదూ. చిన్నది, ముడత పడేదీ, పీలుంటే బుర్ర మీద, కొబ్బరి కోరుకోవటానికి పళ్లుండేదీ."

"అలాగే నమ్మమ్మా. మంచి వాడిగా కూడ ఉంచమంటాను. కూరతరుగుతే, కూరతోపాటు, వేలుకూడా కసుక్కుమని తెగాలి."

"పోరా! నీకన్నీ వెటకారాలే! కత్తిపీటకి వాడిలేకపోతే ఏంప్రయోజనం. మొండి వాడి ముక్కైనా తెగకుంటే." ఇంతలో మా పెద్దత్త ఇటొస్తూన్న అలికిడవడాన్ని, నా చొక్కా పుచ్చుకు గుంజింది మా అమ్మమ్మ, "అత్త! తస్మాజ్జాగ్రత్త!" అన్నట్లు.

ముందు జాగ్రత్త కొరకన్నట్లు, మెల్లిగా, నా చెవిలో అంది "ఈ సంగతి, పెద్దత్తతో గాని, బావతో గాని అనకుమీ" అని ఒక రూపాయి కూడ నా చేతులో పెట్టింది.

నా కొక వెధవసందేహం పట్టుకుంది. ఈ రూపాయి, మా పెద్దత్తతో, చెప్పకుండా ఉండేటందుకా, లేక, చిన్న కత్తిపీట చేయించటానికని, మగుపా ?

మా అమ్మమ్మ పెద్దత్తతో చెప్పవద్దంటుంది. ఆవిడకు తెలియకుండా ప్రయాణమయ్యేదెట్లు? అథవా అది సంభవించినా, మా అమ్మకు తెలియకుండా ఎలా వెళ్తాను? దూరసంలో ఉన్న నా గురించి బెంగ పెట్టుకోదూ? నిజానికి, నా కోసరం ఏడుస్తుందేమో కూడా, తనతో చెప్పకుండా వెళ్లిపోయేనని. ఎవరికి తెలిసినా, తెలియకపోయినా, మా అమ్మకొక్కర్తికీ మాత్రం తెలియచేసితీరాలి. మా పెద్దమామని ఉత్తరం రాయమనాలి. ఒకటికాదు; పదికాదు. నూరురూపాయలిచ్చినాసరే, మా అమ్మకు తెలుపుడు చేయకుండా, వెళ్లను అనుకుంటూ ఆ రాత్రికి పడుకున్నాను.

ఆ మర్నాడు మరొక రూపాయి నా చేతికిచ్చింది మా అమ్మమ్మ. నా సందేహం నివారణైపోయింది. క్రితం దినాన్నిచ్చిన రూపాయి నాకే. లంచమనుకోండి! ఏమనుకోండి!! అది నా స్వంతానికి. చిన్న కత్తిపీట ఏవిధంగా ఉండాలో తూచాలు తప్పకుండా మళ్లా వర్ణించింది. ఇంట్లో ఎవరికీ తెలియకుండా చేయించాలని మరీ మరీ చెప్పింది.

పెద్దమామ మా అమ్మకి ఉత్తరం రాస్తున్నాడు. నేను వెనక పొంచి ఉండి చూస్తున్నాను"...ఇక్కడింకా వర్షాలు తగ్గలేదు. జామితోట బాగానే పండింది. బావకి నా నమస్కారములు. రాయుడు కులాసాగా ఉన్నాడు. అమ్మక్షేమం." ఇంకా ఏదో రాసుకుపోతున్నాడు. వెనకనుండే పిల్చేడు.

"ఏంరా! మీ అమ్మకుత్తరం రాస్తున్నాను. నువ్వేమేనా చెప్పాలనుకుంటున్నావా ?"

"ఇస్! మెల్లిగా మాట్లాడు. నేనూ, అమ్మమ్మ తీర్థయాత్రలకై వెళ్తున్నట్లు కూడా రాయి. ఎవరితో నూ చెప్పవద్దూ నే చెప్పినట్లు. నా మీద ఒట్టు సుమీ, చెప్పవంటే" అన్నాను.

మా పెద్దమామ ఆశ్చర్యానికి అంతులేదు. అలా నోరు తెరుచుకునే, బుర్రఊపేడు ఎవ్వరికీ చెప్పనన్నట్లు. నేనుకూడ పూర్తిగా నమ్మేను. అప్పటి నా చిన్న మనస్సుకి అప నమ్మకం, అనుమానం అన్న మానసిక ప్రవృత్తులగురించి ఏమీ తెలియదు. అందుకే, మా పెద్దమామని పూర్తిగా నమ్మేను. అతని మన

# తెలుసుకొని బాగుపడండి




దాంపత్య సుఖాలు అనుభవించుచు గూడ, గర్భము రాకుండుటకుగాను అనేక దేశాలలోని ప్రముఖ డాక్టర్లు కనిపెట్టిన సరికొత్త 60 మార్గాలు "సంతానం" అనే తెలుగు పుస్తకంలో వున్నాయి. అవుసరం లేనపుడు గర్భంరాకుండా చేసే 60 మార్గాలు, సుఖప్రసవానికి గర్భిణిలు ముందుగా తీసుకోవలసిన జాగ్రత్తలు, పసిబిడ్డలను పుష్టిగా, ఆరోగ్యంగా ఎక్కువ ఖర్చు లేకుండ పెంచే మార్గాలు బొమ్మలతోసహా ఉన్నాయి. సంసార సమస్యలు తీర్చడానికి ఆధారపడతగిన పుస్తకరాజము. ఈ అద్భుతగ్రంథాన్ని మీరు చదివితీరాలి. రచన: వి. యస్. మూర్తి, యం. ఏ., వెల రు 3-50. పోస్టుఖర్చులు ఉచితం. "మూర్తి & వినాయకం" 88, పీటర్సు రోడ్, మద్రాసు-14 కు ఉత్తరం వ్రాస్తే వెంటనే మీకు వి. పి. పోస్టుద్వారా పంపబడును.

SWASTIK

# వేపుడు కాఫీ విత్తులు

తాజాగా చాలాకాలము వుండగలవు. స్వచ్ఛమైనవిగా కూడా వుండగలవు. రెండు వారములకు మీకు కావలసిన సరకు ఒకే దఫా కొని, మంచి డబ్బాలలో భద్రపరిచి, అవసరమైనపుడు మర పట్టి, కాఫీ చేసికొని ప్రత్యేకమైన తాజా కాఫీ రుచి, సువాసన అనుభవించండి.

వేపుడు కాఫీ విత్తులు

లభించు స్థలము:

## ఇండియా కాఫీ డిపో

15, ఆర్మీనియన్ వీధి, మద్రాసు-1; 192, మౌంట్ రోడ్, మద్రాసు-2; 12, రంగనాథన్ వీధి, త్యాగరాయనగర్, మద్రాసు-17; 9, డాక్టర్ సుబ్బరాయన్ రోడ్, సేలం; వెస్ట్ బౌలివార్డ్ రోడ్, తెప్పకుళం, తిరుచినాపల్లి; 1 వ నార్తు చిత్తై రోడ్, మధురై.



# ఆసిపీఠం

ములో ఏభావనలు మెదులుతున్నాయో నాకు తెలీదు. ఉత్తరం పూర్తిచేసి, వెంటనే, ఒక కవరులో ఉంచి అంటించేడు. ఏమి రాసి ఉంటాడా అన్న సందేహంకూడా నాలో మొలకలెత్తలేదు. నేను నమ్మేను కదూ అతన్ని! మరి సందేహాలూ, శంకలూ ఎందుకూ. పోస్టు చెయ్యడానికని మామ బయల్దేరుతే, కత్తిపీట చేయించడానికి నేనూ వెళ్లేను.

మా అమ్మమ్మ కోరినట్లే, చిన్న కత్తిపీట చేయించేను. ఎవ్వరూ చూడకుండా తీసికెళ్లి ఇచ్చేను. ఆమె ఆనందానికి పట్టపగ్గాలు లేవు. అలా తయారుచేయించడానికి నేనెంత కష్టపడ్డానంటే, ఒక కాగితంమీద కత్తిపీట బొమ్మ రాసి, ఆ నమూనా ప్రకారం చెయ్యమని కమ్మరివాడికి చెప్పేను. మా అమ్మమ్మ కత్తిపీటని చూసి, తన తీర్థయాత్రలు జరిగిపోయాయన్నంత సంతోషం పొందింది. నా అంత తెలివైనవాడే లేడంది ఆ ఊళ్లో. పదే పదే నన్ను ముద్దుపెట్టుకుంది. యాత్రలకింకా తరువాయి, ఒక్క మంచిరోజు చూసుకోవడమే. కత్తిపీట భద్రంగా జాగ్రత్త పెట్టింది. ఇంకా నా మెదడు, నా మనస్సు, ఆనందతరంగాలలో డోలాయమానంగా విహరిస్తోంది. వంటింట్లోంచి, నడవలోకి, అక్కడనుండి వీధిలోకి వచ్చేను సంతోషంతో నవ్వి గంతులేసుకుంటూ. రొప్పుకుంటూ రొజుకుంటూ మా అమ్మ ఎదురుగా ప్రత్యక్షం! కలా, నిజమా, అనిపించింది. చాల కోపంలో ఉన్నట్టుంది మా అమ్మ. కాని నన్ను చూడగానే, సంతోషించిందో ఏమో, నవ్వుకుంటూ నన్ను దగ్గరగా తీసుకుంది.

"ఇంకా బయలుదేరలేదుటరా యాత్రలకి?" అంటూ ప్రశ్నించింది.

"అదేం యాత్రలేంవిటి?" అంటూ మా పెద్దత్త కూడా వచ్చిందక్కడికి. అప్పుడే పొగగింటిలోనుండి వస్తోంది కాబోలు. మా అత్త, చేతిలో సంచీ తీసుకుని, నడవలోకి మా అమ్మని తీసుకువెళ్లింది.

"తినబోతూ రుచి అడగటమెందుకూ?" అంటూ, నాలుగోజుల క్రితం, మా పెదమామ రాసిన ఉత్తరం చూపించింది చదువుకోమని. కంగారు కంగారుగా మా పెదత్త ఉత్తరం చదవటం మొదలుపెట్టింది. నాలోకూడ ఒక విధమైన కలవరం బయలుదేరింది. నాకు దృఢమైన నమ్మకం కూడకల్గింది, ఆక్షణంలో భూకంపం పుడితే వచ్చిన సంక్షోభం, సంసారంలో కల్గబోతోందని. దీనికంతకీ కారణం మా పెద్దమామే అని. ఏంరాసేడో ఆ ఉత్తరంలో ఎవరికి తెలుసు. నాకు చూపించా




చిత్రకారిణి—సి. సుమిత్ర (బందరు)

లేదు. అధమపక్షం, ఏంరాసేడో క్లుప్తంగా తెలుపనూ లేదు. "ఎవరికీ చెప్పవు కదూ?" అంటే ఎంత నమ్మకంగా బుర్ర ఊపేడు వెంకాయలాగ! ఈవిధంగా నాకూ మా అమ్మమ్మకూ కూడ, నిరుత్సాహాన్ని, ఓటమిని తెచ్చిపెట్టడానికి, కుట్రదారుడులా పని చేసేడు. నాకు, చిన్నతనాన్నించే అనండి, అర్థం చేసుకోలేక పోవటాన్నే అనండి, మా పెద్దమామపై, ఉపద్రవమైన కోపం వచ్చినమాట నిజం. బహుశా మనస్సులో తిట్టుకున్నానేమో కూడా!

ఉత్తరం చదవడం పూర్తిచేసి, మా అత్తా, మా అమ్మ వంటింటివేపు దారితీసేరు. నేను కూడ వెనకపడ్డాను. వంటింటిలో ఆనందంలో ఊహిస్తూన్న మా అమ్మమ్మ, గుమ్మంలో క్రోధంతో ఘూర్ణిల్లుతూన్న మా పెద్దత్త, మధ్యను, నేను, అడకత్తెరలో పోకచెక్కలా అనిపించింది నాకు.

"అత్తా! అత్తా!"

పాపం మా అమ్మమ్మ ఏం ప్రమాదమో అనుకుని, నడవగుమ్మంలోకి రాబోయింది. ఎదురుగా మా అమ్మని చూసి, నిర్విణ్ణురాలైంది.

"అదేమిటే, ఉప్పెనలా కొట్టుకొచ్చేవు. అంతా క్షేమమేనా?"

"ఆ! కులాసాగానే" అంది మా పెద్దత్త వెటకారంగా, మా అమ్మకి బదులు. పరిస్థితులని సులభంగానే గ్రహించుకుంది మా అమ్మ.

"అయితే! అత్తా! మీరు యాత్రలకై ఎప్పుడేమిటి ప్రయాణం" ఇప్పటికే ఆశ్చర్యంలో మునిగిఉన్న మా అమ్మమ్మ, ఈ అకస్మాత్ప్రశ్నతో, ససంభ్రమంగా స్తబ్ధురాలై నిల్చుంది.

"మరి మీకు దారిఖర్చులు ప్రయాణపు చార్జీలు, వీటన్నింటికీ డబ్బేది?" మరో మొండిప్రశ్న వేసింది మా పెద్దత్తే.

"నీ కదంతా అనవసరం" వేళాకోళంగా సమాధాన మిచ్చింది మా అమ్మమ్మ.

"నీకెందుకోదినా అవన్నీ. అమ్మ తీర్థాలు సేవించడానికి వెళ్తుందంటే, నాకు సంతోషమే! ఇంత వృద్ధాప్యం వచ్చినా, ఆ ఒక్కకోర్కె తీర్చలేకుంటే ఎట్లా" అంది మా అమ్మ, సమర్థించుతూ.

"అయితే నాకేదవసరం. ఇంత తిండి తింటూ ఇక్కడ పడివుండడం, పశువులా, చాకిరీ చెయ్యడం. ఉండబట్టక పిల్లల్ని కనడం. అంతేకదటమ్మా వదినా! నువ్వనేదీ కూడ! ఎదిగిన కన్నెపిల్ల మెడలో ఆంజనేయబిళ్ల తప్ప మరేదీలేదు, పోనీ, ఓ రెండు మురుగులేనా చేయించుదా మనుకుంటే, ఎప్పటి

కట్నాలే, డబ్బులేక మానుకోవలసివచ్చింది. కాని, ఇవాళ ఈవిడకి అకస్మాత్తుగా, యాత్రలకి డబ్బు పుట్టుకొచ్చింది. అయ్యో! నా కర్మ! నాకు దరిద్రం రాసిపెడితే, మిగిలినవాళ్ళు అల్లాగే ఉంటా రనుకోవటం నాతప్పు. వెళ్ళండి వెళ్ళండి యాత్రలకి!" అంటూ మా పెద్దత్త, కంటనీరు పెట్టుకుంది.

మా అమ్మ, మరేవిధంగా సమాధానం చెప్పడానికి ఉద్యుక్తురాలు కాలేదు. బహుశా మా అత్త సమాధానం, సత్యదూరం కాదేమో అనిపించి ఉండాలి. మా అమ్మమ్మ కూడా తక్కువ తిన్నదికాదు.

"నీదగ్గరమాత్రం డబ్బులేదూ! మొన్న రామిగాడు నీపెట్టె కెల్లించినపుడు నీ పట్టుచీర మడతల్లో చూసేను కావలసినంతసొమ్ము. నువ్వు దాపరికాలు చెయ్యవచ్చా, నేను కూడదా!" అంది.

"అయ్యో ఇదికూడానా వెధవనింద. నా దగ్గర డబ్బెలా ఉంటుందీ, అంతా మాకొడుకే వాడుకుంటూ ఉంటే." అంది కాని, మా పెద్దత్తకి పక్కబెగురు పుట్టింది, తనదగ్గర డబ్బుందని, మా అమ్మకి తెలిసిపోయిందని.

# ఆసిపీరం

"అవునవును. అంతా నాకొడుక్కే. ఆ మిగిలిందినాకు. నువ్విక్కడ, ఎండుటాకులా ఉంటున్నావు."

"సరేగాని, మీదగ్గర ఎంత సొమ్ముందో చెప్పండి, పిల్లకి రెండు మురుగులు చేయింపించుతాను."

"నేచెప్పను. నేనివ్వను. నీ సొమ్ము నువ్వు ఖర్చుపెట్టుకో!... ఛీ! ఛీ! వెధవఇల్లు. నన్ను దుయ్యపట్టడానికేగాని, ఇంకెందుకూ పనికిరారు వెధవలు."

"మీరెంత గట్టిగా అరిచినా, నేను బెదరనత్తా! నేను దాచుకుంటే, నా పిల్లలకి, ఖర్చు పెడతాను. ఇంక వృద్ధాప్యంలో, మీ రెవరికివ్వాలని అలా కూడబెడతారూ?

"ఏం! నేను గొడ్డుదాన్నిటే! ఎంతకళ్ళనెత్తికొచ్చినట్లు మాట్లాడుతున్నావు. నా కూతురు, నువ్వన్నమాట విని ఎంత అసహ్యించుకుంటోందో చూడు. ఎన్నేళ్ళొస్తే నేమి. బుద్ధి పశుత్వం వహిస్తేను. వీళ్ళంతా నాపిల్లలుకారూ? నాకు మనుమలులేరూ? కూతుళ్ళులేరూ? నాకెవరూ లేరండానికి నీకు నోరెలా వచ్చిందా అని."

"నే నెవరికి ఖర్చుచేస్తానని కదూ నువ్వంటున్నావు." అని మళ్ళా మా అమ్మమ్మే ఉపక్రమించింది. ఆమెలో అత్యుద్రేకం, కోపం, పొంగి పొరలివస్తున్నాయి. తన తీర్థయాత్రా ప్రయాణం, తనకోడలిఘటం కొనివ్వదని దృఢపర్చుకుంది. మా పెద్దత్తకూడ, తనతప్పు తెలుసుకున్నాదో ఏమో, మరేమీ. మాట్లాడలేదు.

"రాయుడూ!" నన్నే పిల్చింది మా అమ్మమ్మ. నాకు భయంగానే ఉంది.

"వెధవా! నువ్వు చేసేవు ఈ గొడవంతా. మన ప్రయాణం చట్టుబండలయ్యింది. ఊఁ పోనీలే. ఎవరికి ఎంత ప్రాప్తమో అంతే" అంటూ కోపం పోయిందా అన్నట్లు నవ్వుకున్నాది.

ఆశ్చర్యం! క్షణంలో కోపం పోయి, సంతోషం ఆవరించింది. చిరునవ్వుతో, నన్ను చూస్తూ "నువ్వు బట్టలు కుట్టించుకోరా! రామానికి పాపం, పార్వతికీ కూడ, మంచిరకాల బట్టలు కొను. సరేన్లే, మిగిలిన ఏర్పాట్లన్నీ నేను చేస్తానులే! మీ పెద్దమామ రానీ ఇంటికి" అంటూ, మళ్ళా తన వంటపనిలో నిమగ్నురాలైంది.

ఎవ్వరికీ తెలియకూడదని, ఆప్యాయంగా చేయింపించిన కత్తిపీట, దుర్భేద్యమైన స్థలంలో దాచింది మా అమ్మమ్మ. ఇంక ప్రయాణం రెండుమూడు రోజుల్లో జరుగుతుందని నాకూ మా అమ్మమ్మకీ సంతోషంవలన నిద్ర పట్టేది కాదు. మా పెద్దమామని నమ్మి చెప్తే, అతడిలా రసాభాసు చేసేడని నాకు కోపంవచ్చింది. నా తెలివితక్కువే దానికి కారణం. నేను వెళ్ళడానికి, మా అమ్మ ఒప్పుకోదు. మా అమ్మమ్మ ఒక్కర్తీ వెళ్ళదు. అంచేత తీర్థయాత్రాప్రయాణం, ఈ జన్మకింక వాయిదా వేసుకోవా లనుకుంది మా అమ్మమ్మ.

కూడబెట్టడం అన్న కళని, అతి నైపుణ్యంగా వినియోగించి, ఒత్తుల పెట్లోపు, మహాలక్ష్మి సింహాసనంలోను, అతి గహస్యంగా దాచి, పోగుచేసింది నూట ఏభై రూపాయలు! ఆమె ఓర్మి, కష్టం, మానసిక శ్రమ, ఎంత అనుభవించిందో! పదిహేను రోజులుండి, నేనూ మా అమ్మ ప్రయాణమయ్యాం మా వూరికి. ఈ లోపునే, దీపావళిపండుగ రావటం, మాపిన్ని, ఆమెపిల్లలు, మా చెల్లెళ్ళు, అందరూ పండుగ సరదాలు చేసుకున్నారు. మా అమ్మమ్మ పోగుచేసిన డబ్బంతా, అందరికీ కావలసినన్ని బట్టలు, చీరలు, కొనిపించింద. అవి అతి చౌక రోజులు. అందరికీ బట్టలవనూ, ఇంకా పాతికరూపాయ లుంటే నాకో ఉంగరం కొని ఇచ్చింది.

ఎన్ని చేసినా, మా పెద్దత్తకి మాత్రం, ఒక్క రవికలగుడ్డ కూడా కొన్నాదికాదు. ఆవిధంగా, ఆమె కసి తీర్చుకుంది.

## డ్రామాయణం




"ఈ కీకారణ్యములో ఒక్క జంతువు అయినా కనుపించదేమి?"

మరి కొన్నాళ్లకు, వాసావారి వీధిలో, సోమయాజులుగారు తీర్థయాత్రల కెళ్తున్నారని తెలిసి, తెలవారుఝామునే లేచి, ఆ చిన్నకత్తిపీట పుచ్చుకుని, వారింటికి బయలుదేరింది మా అమ్మమ్మ. సోమయాజులుగారి భార్య గుమ్మం కడుగుతోంది. వదినా! మీరు యాత్రల కెళ్తున్నారని మా బాబుగాడు చెప్పేడు. మీకు యాత్రల్లో, ఎందుకేనా పనికొస్తుందని ఈ చిన్నకత్తిపీట తెచ్చేను. ఉంచండి, మారతరుక్కోవచ్చు" అంటూ ఇచ్చి, తిరిగి సమాధానం వినకుండా, ఏటి కెళ్లింది.

మా అమ్మమ్మ, తీరని కోరికకు చిహ్నంగా, ఆ చిన్నకత్తిపీట ఆవిధంగా తీర్థయాత్రలు చేయటానికి వెళ్లింది. ★

మా స్నేహితుడు చంద్రం పెళ్ళికి వెళ్ళి వస్తూ దోవలో ఉన్న మామయ్య గారి ఊరు వెళ్ళాను. నేను చేరేసరికి మధ్యాహ్నం రెండుగంట లయింది. ఎండ కూడా రవంత తీవ్రంగానే ఉందేమో ఊరంతా [illegible] నిద్దురలో ఒక్క కునుకు తీస్తోంది. [illegible] గ్యావాళ్లు బాగా కలిగినవాళ్ళు. ఆయనకు డబ్బంటే ఒకమాదిరి చులకన. మన కోసం డబ్బు పుట్టింది కాని, డబ్బుకోసం మనం పుట్టామా అనే రకం మనిషి. మా తాతయ్య ఆ జిల్లా కంతా మోతుబరిఅయినా, తన జీవితమంతా నేలకు ఒత్తెడున్న పాత ఇంటిలోనే గడిపాడు. కాని మామయ్య ఊహాలు వేరు. తాతయ్య అంటే బీదవాడుగా పుట్టి, కష్టపడి, గొప్పవాడయ్యాడు. మరి మామయ్యో! ఆయన యీ గడ్డమీద పడేసరికే తాతగారికి సిరి అందుకుంది. అందుకనే పెద్ద వయస్సులో పుట్టిన యీ బిడ్డకు, లక్ష్మీప్రసాదు అని పేరు పెట్టాడు. మామయ్య తరహా అంతా వేరు. ఆయన చూపులు ఆలోచనలు ఎప్పుడు అందరికంటె ఎన్నో అంతస్తులు దాటి ఉండేవి.

తనకు నలభై సంవత్సరాల వయస్సులో మైనారిటీ వెళ్ళగానే, అంటే, ఎనభై సంవత్సరాల వయస్సున, తాతయ్య అవతారం చాలించి "హరీ!" అని అనగానే, ఇంత కాలం, కనబడకుండా తనని, కట్టేసి వుంచిన శృంఖలాలను, అన్నింటిని, ఒక్కుమ్మడి మామయ్య తెగనరికి, తాత పేరు, తరతరాల నిలిచి, తనకు, తన వాడకు, శాశ్వతమైన కీర్తి తెచ్చేటందుకు, ఒక బ్రహ్మాండమైన భవంతి-ఎవరికీ ఆ పరగణాలో లేనటువంటిది, అంటే అదేం, పూర్వం రాజులు, మహా



# దక్షిణానాయకుడు

మల్లాది సూరిబాబు

రాజులు, రాజకుమార్తెలమీద కోపం వచ్చి నప్పుడు, ఊరి పొలిమేరలకు నాలుగుకోసుల దూరంలో, నట్టడవిలో, చీమలు దూరని చిట్టడవిలో కట్టించిన ఒంటి స్తంభం మేడ కాకపోయినా అదే పక్కాలో, ఒకటికి పది స్తంభాలు పెట్టి, అందానికి అందం, బలానికి బలం, ఉండేటట్టు మొసాయిక ఫ్లోరింగ్, నకిలీ పాలరాతి గచ్చులతో "సుందరవిలాస్" భవనాన్ని నిర్మించగానే అందమైన భవనం కనుక అలా పేరు పెట్టాడని మేమంతా సంబరపడితే, గృహప్రవేశానికి, రెండు రోజు లుందనగా, యింటికి "సుందర విలాస్" అని పేరు పెడుతున్నానని, మామయ్య అమ్మమ్మతో అనేసరికి, ఆవిడ "ఏళ్లు మీదపడ్డా పాడు బుద్ధులు పోలేదు" అని సణుక్కుంటున్నట్టు విసుగ్గా అనేసరికి, మేమంతా అర్థంకా రిచ్చవడి,

"ఏమా పాడుబుద్ధులు? ఏమాకథ?" అని అడిగే సాహసం లేక, పోనీ సాహసం చేసి అడిగినా ఆ మూశకాళ్ల ముదుసలి సరైన సమాధానం చెబుతుందనే నమ్మకం లేక, ఒకటికి రెండుసార్లు తలపటాయించినా అసలు సంగతి తెలుసుకుందా మనేకుతూహలంమాట



సన్న గిలక, చిట్టచివరకు, ఎట్టకేలకు ధైర్యం చిక్కబట్టుకుని వెన్నెల వెర్రిగా కాసే వేళ మామయ్యనే కదిపి చూసేసరికి ఆయన కాలు స్తున్న చుట్ట చేతబట్టి చుక్కలవంక చూపులు సాచి,

"దాని దుంపతెగ అది శూద్రమనిషి అయి పోయింది కాని లేకపోతేనా?"

"లేకపోతే?"

"అయినా ఎందుకులే. కుర్రకుంకవి నీకు యీ విషయాలు."

"కుర్రకుంకని కానులే మామయ్యా"

"కుర్రకుంకవు కావా? అయితే నేనడిగే చిన్న ప్రశ్నకు సమాధానం చెప్పు"

"సిద్ధమే"

"ఏళ్లు ఎన్నిరా అల్లుడా నీకు?"

"పదెనిమిది"

"నీమొగసిరి తెలిసిన సుందరులెందరురా?"

"అదేం ప్రశ్న మామయ్యా?"

"ఎందుకని?"

"అటువంటి విషయాలు ఇతరులతో ఎల్లా చెప్పడం?"

"నేనూ అదే మాట అంటే?"

"నీ విషయం వేరు. నేను ఎవ్వరితో చెప్పనుగా?"

"చెబితే నాకు భయమనుకున్నావా? అయినా తెలుసుకుందామని మనస్సుపడుతు న్నావు గనుక చెబుతానులే. కూతవేటు దూరంలో ఎక్కడా కాంతలు లేరుగా"

"లేరు."

"పదువాలుగుజన్మలూ, నా నీడ వదలనని, మొండిపట్టు పట్టిన ఆ చిన్నది?"

"అత్తయ్య గుడికి వెళ్లింది. ప్రొద్దు పోతే గాని రాదు. త్వరగా చెప్పు"

"తొందరపడితే ఎల్లాగురా అబ్బీ! ఇటు వంటి విషయాలలో ఎంత ఓర్పుఉంటే అంత లాభం"

"అయితే నేనిహ మాట్లాడనులే"

"అంటే రాయిలాగా కూర్చోమని కాదు. అనువైనచోట ఊకొడుతూ ఉండు."

"ఊ."

మొదలు పెట్టావు. అయితే చెబుతాను విను. అనగా అనగా ఆలనాడు లక్ష్మీప్రసాదు అని ఒక మంచి అందమయిన కుర్రవాడు వుండేవాడు. అమ్మకు, నాన్నకు ఒక్కడే మొగబిడ్డ. ఇహనేం లోటులేని గారాబం. వాడికి ఉన్న పని అల్లా దోవన పోయే పడుచు పిల్లలని కవ్వించడం— సరసంగా నేలే-కవ్వించడం, వాళ్ళచేత,బిగ్గరగానో, నెమ్మదిగానో తిట్లు తినడం, లేకపోతే, పిల్ల దిరవ్వంత చిటపట కోపంతో అంటున్నట్టుగా, చనువుగా

"ఏమిటా పాడుపనులు. ఎవరైనా చూస్తే"అని అంటె చిరునవ్వుతోనే ఇంకా చనువు తీసుకోవటం. ఇటువంటి చర్యలతో, ఏళ్లు నాటి కానాడు ఎక్కువ అవుతున్నా

# [illegible] నాయకుడు

బుద్ధులుమాత్రం అల్లాగే నిలిచి ఒక్కొక్క ప్పుడు పెచ్చుమీరి మరీ పేట్రేగి పోతూం డేవి. యౌవనంలో అడుగుపెట్టిన అయిదారు వసంతాలకే, యీ చిన్నవాడు చవిగొన్న ఆనందం ఎంతో చెప్పాలంటే చిత్రగుప్తుడికో, విచిత్రగుప్తుడికో లెక్క.

"కాలం అంతా ఒక్కరీతిగా నడవదు. అన్ని రోజులు మనవి కాదు" అని యీ పసి కాయకు తెలియపరిచే రోజు ఒకటి యీ జీవి జన్మలో సాక్షాత్కరించింది.

"ఏ రూపంలో?"

"సుందాం" అనే సుందరి రూపంలో. బహుశః అది చరిత్రలో నిలిచిపోగల వ్యక్తి అవుతుందని దానితల్లి దండ్రులు కలగన్నారు కాబోలు, తాటిచెట్లలాగా, నల్లగా మనుష్యులుండే, కులంలో పుట్టిన ఈ-చిన్నదానికి "సుందరి" అని పేరు పెట్టారు. ఆ పేరు వాళ్ళకే ఎబ్బెట్టుగా తోచి, ఆ పేరుతో పిలవలేక, చివ్వరికి, "సుందాం" అని పిలిచే వాళ్ళు. అది పెరిగి పెద్దదై, దేవతలకు, రాక్షసులకి అమృతం పంచిపెట్టడానికివచ్చిన మోహినీరూపంతో, యౌవనంలో అడుగు పెట్టింది; ఆనాడే, ఆవాడకల్లా ఎన్నికైన చిన్నవాళ్ల గుండెల్లో తీరని వ్యథ కలిగించింది. చిత్రిణిజాతి(స్త్రీ)లాగా కనపడే యీ చిన్నదాని మదిలో సీతా, సావిత్రుల కంటె శీలం వుందని, ఆ మారయ్య రోగుల కేం తెలుసు? తెలిసినదల్లా, "సుందరి"

ఉపాధ్యాయుడు - ఒరేయ్ రామూ, నకులుడు గుర్రం మీద వానలో పోతూ ఒక్క-చినుకు అయినా మీద పడకుండా ఏలా తప్పించుకొనే వాడురా?

రాము - అది అతని నేర్పు సార్.

ఉపా — నీ ముఖం! నువ్వు చెప్పరా, గోపీ.

గోపి — బహుశా రెయిన్ కోటు వేసుకుని ఉంటాడండి.

—కె. చలపతిరావు (హైదరాబాదు)

నిజంగా సుందరి అని, ఆ చిన్నదాని సుందర వదనంలో తొణికిసలాడె చిరునవ్వులు యీ చిన్నవాళ్ళకోసం కాదని.

అదృష్టంలో అందరికన్నా పది ఆకులు ఎక్కువ చదివిన యీ లక్ష్మీప్రసాదు యింటికి, "సుందాం" అనే సుందరి ఒక నాడు "అమ్మగారు" అని పిలుస్తూ అడుగు పెట్టేసరికి

"ఎవరే అది?" అంటూ అమ్మ బయటకు వచ్చింది.

"నేనమ్మా లష్మాయి కూతురిని."

"మీ అమ్మ రాలేదేం?"

"ఒంట్లో బద్ధకంగా ఉందిట. నన్ను వెళ్ళమంది."

"ఏం మళ్లీ నీళ్లు పోసుకుందా?"

"రోజూ పోసుకుంటూందిగా!"

"నీ బొందలే. పోయి అంట్లుతోము" అంటూ ఆవిడ లోపలికి వెళ్ళింది.

ఆ చిన్నది కూడా, అలవోకగా, ఒక్కసారి చిరునవ్వగా, వడలు విరుచుకుని, బావి దగ్గరకు వెళ్లి అంట్లు తోమడం మొదలు పెట్టింది. నేను కూడా, ఏదో, పనివున్నవాడిలాగా, అమ్మకంట పడకుండా, దొడ్లోకి వెళ్లి జామిచెట్టుని ఆనుకుని నిలబడ్డాను. నల్లని రూపైతేనేం, ఆ చిన్నదాని వంపుల సొంపులు చూస్తూవుండి, ఎక్కడో, అంతఃపురాలలో వుండవలసిన యీ అప్సరసను, అంట్లు తోమమని నిర్ణయించిన, బ్రహ్మయ్యను తలుచుకుని, కసిదీరా ఒకటికి పదిసార్లు మనస్సున శాపాలు కురిపిస్తూ వుంటె, ఆలోచన ఒకటి ఫెళ్లున చెంపపెట్టులాగా వచ్చి, బ్రహ్మయ్యకు చేతులెత్తి మొక్కేటట్టు చేసింది.

"అంతఃపురంలో వుంటె, యీ కన్నె మన కంట పడేదెల్లా, మన మక్కువని, మన్నించడమెల్లా? అందుకనేరా వెర్రినాయన, యీ చిన్నది, యీ అవతారంలో రూపు నిలిపింది. మన యింట కాలుబెట్టింది.

ఇల్లా ఎన్ని ఘడియలు, విఘడియలు గడిచాయో తెలియదు. యింట్లోంచి అమ్మ, "అబ్బాయి!" అని కేకపెట్టగానే నేను ఉలిక్కిపడి ఉన్న ఉనికి, స్థితి లిప్తకాలం మరిచి, "ఒస్తున్నా" అని అంకెపెట్టాను. వెంటనే నాలిక కరుచుకుని, కుక్కిన పేనులాగా నిలబడ్డాను.

అంట్లు తోమే అంగన, యీ రంకెకు అడిలి వెనుతిరిగి చూసేసరికి జామిచెట్టు చాటున కనపడ్డది, నేను.

"అమ్మో! మీరా? భయంవేసింది" అని అంది.

మాట కలిపే అవకాశం అదే.

"నేను భయంవేసేటట్టు ఉన్నానా?"

"లేరు లెగండి. అర్ధాట్టుగా చూసేసరికి భయం వేసింది."

"మరి ఎట్లాఉన్నాను?"

"నాకు తెలియదు."

చిన్నదాని దృష్టి పనిమీదకు మళ్ళింది. నా చూపుమాత్రం వెనుతిరగలేదు మనస్సు మరలలేదు. చొరవగా ఒక్క అడుగు ముందుకువేసి కన్నార్పక, ఆ కన్నెను చూడటం మొదలుపెట్టాను.

"నాకేసి ఎందు కట్లా చూస్తారు?"

"నీ అందం చూసి మురిసి."

"ఏంటి?"

"నువ్వు చాలా బాగుంటావు."

చిన్నదాని ముఖంలో చిరునవ్వు వచ్చింది. వెంటనే కోపం కూడా వచ్చింది.

"అట్లాంటి మాటలంటె అమ్మగారితో చెబుతా."

"ఏమని?"

"చినబాబు, కొంటెమాట లంటున్నాడని."

"చెప్పు."

"అమ్మగార్లు" అంటూ ఆ చిన్నది కేక పెట్టేసరికి, నేను బాణంలాగా దూసుకు వచ్చి, సావిట్లో పడ్డాను. తోమిన గిన్నెలు వసారాలో పెట్టి

"సందెకాడ అమ్మను పంపుతా" అని, ఆ చిన్నది అక్కడనుంచి వెళ్ళిపోయేసరికి, ఒక్కసారి "అమ్మయ్య!" అని అనుకున్నాను.

పైకి ఎంత బింకంగావున్నా, అది అమ్మతో ఎక్కడ చెప్పిపోతుందోనని, మనస్సు గిలగిల లాడుతూనేవుంది. చెప్పలేదు కాబట్టి బ్రతికిపోయాం. చెబితేనా?

అమ్మ, తలవాచేటట్లు చివాట్లుపెట్టి తలంటిస్నానం చేయించేది. సరే యిహ యీ వార్త వంటయింటి గుమ్మందాటి ముందు సావిట్లోకి వచ్చిందంటె అమ్మ బాబోయి!! నాన్న మళ్ళీ సచేలస్నానం చేయించి ప్రాయశ్చిత్తంగా లక్షగాయత్రి చేయించేవాడు. ఇది ఒక్కనాటితో అయితే ఫర్వాలేదు, తలపుకు వచ్చినప్పుడల్లా యీ తంతు అంతా మొదటినుంచి, మళ్లీ జరగవలసిందే. తరువాత మనం కూమేశా పంక్తి బాహ్యులమే.

అయితేనేం, యిటువంటి విషయాలలో నాకు ఒక గట్టి నమ్మకంవుంది ఈ వయసుకత్తెలు, మనల్ని ఎంత బెదిరించినా పెద్దవాళ్లతోమాత్రం సర్వసాధారణంగాఫిర్యాదు చెయ్యరు. ఒకవేళ చేద్దామనుకున్నా నేరారోపణ ఏ విషయంలో, ఏ మాటలతో చెయ్యాలో తెలియక లోపల్లోపల సణుక్కుని ఊరుకుంటారు.

చిన్నది యింటికి వెళ్ళిపోయింది. అమ్మ వంటప్రయత్నంలో ఉంది. మనం బుద్ధిమంతులంలాగా, సావిట్లో కూర్చుని వావిళ్ళ వారి దేదో ఉద్గ్రంథం చదువుతున్నాం. పని మీద ఇంతవరకూ ఊళ్ళోకి వెళ్లిన నాన్న యింటికి వచ్చారు. ఎండపడి వచ్చారేమో, మొదట్లో నేను ఆయన దృష్టికి ఆనలేదు. తరువాత నేను కంటపడగానే,

"ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

"చదువుకుంటున్నాను" అని అన్నాను, ఆయన నమ్మకంలేని కంఠంతో, "ఏం చదువుతున్నావు" అని ప్రశ్నించాడు.

"దేవీ భాగవతం" అని నిర్భయంగా జవాబు చెప్పాను.

ఈమాట వినడమేమిటి ఆయన ఒక్క క్షణం కూడా అక్కడ నిలబడలేదు. అంత వయస్సులోను మెరుపులాగా యింట్లోకి దూసుకుని, సరాసరి వెళ్లి, ఆ ఏడుకొండల వాడి ఎగుట నిలబడి, వినబడి వినబడనట్టు, ఆ చల్లనయ్యను, ఒక్కటే పొగుడుతున్నాడు.

"ఎందుకో?" అని అనుకున్నాను. ఆయన ఏదైనా ఘనకార్యం నెరవేర్చుకు వచ్చాడేమో అందుకని అంజలి ఘటియించి యీ తన్మయముద్ర పొందుతున్నాడో, లేక ఆ తిరుమలయ్య కోరిన రూపంలో యీయనకు సాక్షాత్కరించాడేమోనని అపోహపడ్డాను.

వారం గడిచిన తరువాత, అసలు విషయం అమ్మ చెప్పింది. ఈ రాలుగాయి, పెడత్రోవ వదిలి మామూలు రస్తామీదకు వచ్చినట్లు కనపడ్డాడట. ఈ నమ్రత, వినయ విధేయత, విద్యయందు ఆసక్తి యివన్నీ ఆయనకు పరవశం కలిగించాయట. అందుకనే కోటిమెట్లవాడికి వెయ్యికోట్ల నమస్కారాలు, అని.

అసలు విషయం ఆ అమాయక బ్రాహ్మడికేం తెలుసు, ఇది బ్లెడ్ ప్రెషర్ తగ్గటం కోసం మనం పుచ్చుకున్న మందని?

వారం గడిచినా చిన్నది ఆచాయలకే రాలేదు. చిన్నదాని తల్లిమాత్రం, ఒక్క క్షణమయినా ఆలస్యం కాకుండా, ఉదయం సాయంత్రం, తప్పక హాజరవుతోంది. అది పనిలోకి రాగానే, అమ్మ మళ్ళీ అడిగింది:

"ఏమే మళ్లీ ఏమన్నా విశేషమా" అని.

అది అంత వయస్సులోను సిగ్గు నభినయిస్తూ మళ్ళిపదహారు వసంతాల వయస్సుకు వెళ్ళి.

"ఇంకా యిప్పుడా, యింకా విశేషమేమిటి అమ్మగారు" అని అంది.

"ఏం అప్పుడే ముసలిదాని వయ్యావా.? ఇంకా కనిపెంచే వయస్సేగా!"

"పిల్లదానికి పెళ్లీడువచ్చింది. ఈపిల్లలు చాల్లెండి"

"అదేమిటే అల్లా అంటావు. అల్లా అనకూడదు. పుణ్యంకొద్ది పురుషుడు, దానంకొద్ది బిడ్డలు, అన్నారు."

"నిజమే లెండి. అయినా మనచేతుల్లో ఏముంది" అని అంటూ అది పెరట్లోకివెళ్ళింది. అమ్మ వంటింట్లోకి వెళ్ళబోతూ నన్ను చూచి.

"ఎందుకూరా యిక్కడ నిలబడ్డావు?" అని

# దక్షిణ నాయకుడు

అడిగింది. సమాధానం ఏం చెప్పాలో తోచక “మంచినీళ్ళు” అని అన్నాను. లోపలికి పోయి త్రాగు” అని అంది.

నేను వెళ్ళబోతూంటే, “ నేనే పట్టుకు వస్తానులే. నువ్వు మడిబిందెలు ముట్టుకుంటావు”అని అంది.

నేను మంచినీళ్ళు త్రాగి, సరాసరి రచ్చబండ దగ్గరకెళ్ళి కూలబడ్డాను.

చింతయ్యగారి చిన్నకోడలు నీలాటి రేవుకువెళ్ళే” తోవ సమయం కూడా అదే. నేను వెళ్ళి కూర్చున్నానో లేదో భామామణుల సమూహం, యమునాతీరానికి, బయలుదేరిన, గోపవధువుల పగిది, గోధూళి సమయంలో యిటే వస్తోంది. అంతవరకు ఊసారుగా కబుర్లు చెప్పుకుంటున్న చిన్నారులందరు, నన్ను చూడగానే కొందరు సిగ్గుతో మూగవోతే, మరికొందరు కాపలవంటి కోర చూపులతో, నన్ను పలుకరిస్తే, నాతో ఏకాంతంగా వున్నప్పుడు, ప్రేమతో ఉక్కిరిబిక్కిరిచేసే, పెద్దయ్యగారి పద్మ, నన్ను చూడగానే మూతిముడిచి, పెదవి విరచి, భ్రూకుటి జోడించి, మూడుసార్లు మెటికలు విరిచి వడివడిగా అంగలువేస్తూ ముందుకు వెళ్ళింది. ఆ సంకేతానికి అర్థం.

“మూడురోజులయి కనిపించటంలేదేమని.”

నేను కూడా, కనుసన్నలతోనే, ఎన్నో సంగతులు చెబుదామని, అనుకున్నాను. ఒక మూల సంచీకట్లు మరొకవంక సావాసకత్తెల, సమూహం, వీటన్నింటిని తప్పించి చెఱుకువిల్లు చిన్నయ్య నన్ను కవ్విస్తున్నాడని, ఆ చామంతిరేకుల వన్నె చిన్నదానితో ఎల్లా చెప్పడం? అప్పటికి నాకు వీలైన పద్ధతిలో.

“శివదీక్షా పరురాలనురా” అని చక్రరాగం రవ్వంత బిగ్గరగానే విసిరాను. అంటే శివాలయంలో కలుసుకోమని, ఆ చిన్నదానికి మాత్రం తెలుసు. ఒక చిరునవ్వు యిటు విసిరి ముసిముసి నవ్వులతో విసవిసా నడిచి వెళ్ళిపోయింది.

అందరికి, చిట్టచివర వస్తున్న చింతయ్యగారి చిన్నకోడలు, మోయలేని భారం మోస్తున్న దానిలాగా, నెమ్మదిగా వస్తూ పాటవచ్చిన దిక్కున దృష్టిసారించి, నన్ను చూడగానే, నేను చిరునవ్వు నవ్వాను. ఆ జవరాలు ఒక్కక్షణం ఆగి, కొలిమట్టె సరిచేసుకునే సాకుగా వంగి, నేనున్న దిక్కుకు చూసి, నావంక చిలిపిగా నవ్వి లేచి చెంగున ముందుకు సాగిపోయింది. నేను అపడుమ వెళ్ళినవైపే చూస్తూ, విరహంతో ఒక్క వేడి నిట్టూర్పుతో ముందుకు సాగగానే, కాలి క్రింద ఏదో మెత్తగా తగిలితే ఉలిక్కిపడి, క్రింద పడ్డవస్తువు తీసేసరికి సెంటువాసనలని మరిపించే సన్నజాజిదండ...సన్నజాజి దండ !!!

నన్ను వలచి వలపించిన, ఆ చిన్నది, అలనాడు, తను, నాదైన, ఆనాడు సన్నజాజినే, నాకు నజరానా యిచ్చింది. ఆ చిన్నదాని చిహ్నమే మనయింటి ఈ సన్నజాజి తీగ.

“ఇంట ఉన్న ప్రతీపుష్పం ఒక పూబంతికి చిహ్నమా మామయ్యా.”

“అంతే ననుకో.”

“మామా నువ్వు దక్షిణనాయకుడివా?”

“అంతమాట వద్దురా అల్లుడా. ఆ పేరు, ఆ పరువం ఆ రాధామాధవుడికే, ఆ సత్యభామాప్రియుడికే చెల్లింది.”

“నువ్వు మాత్రం ఏం తక్కువ వాడివా?”

“అష్ట నాయికల విషయంలో, ఆయనతో మనం రవ్వంత పోటీపడ్డా, పదహారువేల గోపవధువులవిషయంలో మాత్రం ఆయనకు ఆయనే సాటి.

"ఆ అష్టనాయికలు ఏమైపోయారు. ఎప్పుడైనా కనిపిస్తున్నారా?"

"కనిపించకేం? అంతా ఈ వాడ మనుష్యులే గా? కూతురు పెళ్ళికనో, మనుమలు అన్నప్రాశనకనో పిలుస్తారు. కొందరు ఆరిందాలై మరీ పెద్ద ముత్తయిదువులై భాష్యం, భగవద్గీత మాట్లాడితే, కొందరు కొంటెకోణంగులు మాత్రం ఒక్క క్షణం పదహారు సంవత్సరాల పడుచులై చిరునవ్వుతో, చిలిపి నవ్వుతో, ఇంకో మాయని మధురస్మృతులని స్మరించి నెరిసిన చెంపలని ఒక్కసారి సరిదిద్దుకుంటారు."

"అంతేనా?"

"భగవద్గీత పారాయణ చేసే వయస్సులో అంతకంటె ఇంకేం ఉంటుంది?"

"కథ దోవ వదిలి డొంకనపడ్డదయ్యా".

"మళ్ళిస్తున్నానుగా"

ఆర్పిన చుట్ట యింకొకసారి వెలిగించుకుని...

"ఇంతకూ మనం ఎక్కడ ఉన్నాం?"

"రచ్చబండ మీద, చింతయ్యగారి, చిన్న కోడలిని తలుచుకుంటూ, సన్నజాజి ఘుమఘుమలు తలపుకు తెచ్చుకుంటూ..."

"మనసైన మగువలందరూ నీలాటి రేవు నుంచి యింటికి వెడుతూ యింకొకసారి దర్శనం యిచ్చారు. కాని మనస్సుకు ఏదో వెలితిగానే ఉంది."

"ఏం? చక్కని చిన్నది చెంతలేదనా?"

"మాటలు నేర్చావే!"

"మేనల్లుడనేగా"

"అన్నింట అయితే మాబాగే!!... చిక్కని మనస్సుతో, వేడి నిట్టూర్పులతో యింటికివచ్చాను. మనస్సు మనస్సులో లేదు. వెచ్చని వెన్నెలలో మేను వాల్చాను. కన్ను తెరిచినా, మూసినా కలత నిద్దరే. రవ్వంత కునుకు పట్టగానే, ఒక తియ్యని కల. కలలో కిన్నెకతో, వెచ్చ వెచ్చని వూసులాడుకుంటూ, సంధ్యాసమయంలో యమునా తటిలో నేను, సుందరి, వెచ్చ వెచ్చని వూసులాడుకుంటూ విహరించినట్టు, నే కలగని, సుషుప్తినుంచి జాగృతికి కన్ను విప్పేసరికి, గృహపతి ప్రియుడు, శశాంకుడు, మామిడి చెట్టుచాటున నక్కితే, ముసలయ్యగారికోడి కొక్కొరకో భాషలో,

"తెల్లవారవచ్చె తెలియక నా స్వామి మళ్ళి పరుండేదవు లేరా" అని సుప్రభాతం చెబుతోంది.

మనం పానుపుదిగేసరికి, ఎదురుగా పెద్ద ముత్తైదువు మా అమ్మ కనబడ్డది. రూపాయంత బొట్టుతో పార్వతీదేవిలాగ ఆవిడ కనబడగానే, భక్తికలిగి, నమస్కారం చేశాను. ఆవిడ ఒక్కక్షణం రిచ్చవడి, నివ్వెరపోయి, యీ పసికందుకు ఏ గాలో ధూళో సోకిందనుకుని, బహుశః మంత్రపు విభూతికోసం కాబోలు, యింట్లోకి వెళ్ళిపోయింది.

విభూతి నాకు రాస్తే ఏం లాభం? వశీకరణమంత్రంతో ఒక చిటికెడు, ఆ చిన్నదానిమీద చిలకరిస్తే!!

సాయంకాలం పని చేసేది బొగడపువ్వులు ఏరుతోంది "బొగడపువ్వులు, నీకుయిష్టమా?" అని అడిగాను.

"నా కెందుకు? మా పెద్దదానికి. దానికి పువ్వులంటే ప్రాణం"

"అదేవచ్చి ఏరుకుని వెళ్ళవచ్చుగా?"

"అది యిక్కడికి ఎల్లా వస్తుంది!" అనేసరికి, మనస్సు చివుక్కుమంది.

"నిన్నటి ఉదంతం ఏమన్నా చెప్పిందా?" అని రవ్వంత సందేహం కలిగింది. అయినా ధైర్యంగానే "ఏం?" అని అడిగాను.

"ఇక్కడికి వస్తే ఎల్లా? శివాలయంలో పువ్వులో?"

"గోజా వెడుతుందా""

ప్రొద్దుగూకులు అక్కడే ఉంటుంది.

సరాసరి శివాలయంకువెళ్ళాను. శివాలయం, దాపున ఒక పెద్దతోట ఉంది. అందులో బ్రహ్మాండమైన బొగడచెట్టు, చెట్టు దగ్గరలో ఒక మండపం. సందె చీకట్లలో ఎవ్వరో చిన్నది వడినింపిన పువ్వులన్నీ లెక్క చూసుకుంటూంది. నా సవ్వడి వినగానే, లేచి, చనువుగా ముందుకు అడుగువేసి, నా కౌగిలిలో కరిగిపోయింది.

నేను ఉలిక్కిపడి "నువ్వా" అని అన్నాను. చిన్నది ప్రశ్న వేసేలోపలే,

"నువ్వేనా" అని దగ్గరకు తీసుకున్నాను.

"ఎవరని అనుకున్నారు?" అని గోముగా ప్రశ్న వచ్చింది.

"నువ్వనే అనుకున్నాను"

"అన్నీ అబద్ధాలు"

"నీతోనా?".

నాకై నడిచివచ్చిన ఈ అభిసారిక ఎవరో కాదు. పెద్దయ్యగారి పద్మ.

మరునాడు, ఆ మరునాడు యిదే తంతు. చింతయ్యగారి చిన్నకోడలు, శివారాధనకు వచ్చి విష్ణుప్రీతిని పొంది వెళ్ళింది. మూడోనాడు నాలుగు గంటలకే గుడికి వెళ్ళాను. ఎవ్వరూ లేరు. ఏం చెయ్యాలో తోచలేదు. బొగడపువ్వులు ఏరి దండ గుచ్చటం మొదలు పెట్టాను. ఇప్పుడు తలుచుకుంటే నవ్వు వస్తుంది. పురుషుడేమిటి, పూలమాల కట్టడమేమిటి? అని. ఇవన్నీ ఆ కామయ్య చేయించే పనులు. దండ సగం పూర్తి కాకుండానే, ఎవ్వరిదో అడుగు సవ్వడి విని అటు చూసేసరికి...ఎన్నో రోజులుగా ఎప్పుడా ఎప్పుడా అని ఎదురుచూస్తున్న వన్నెల విసనకర్ర ఇటే వస్తోంది. నేను మండపం వెనక్కు దాగాను. సరాసరి చెట్టు దగ్గరకు వెళ్ళి చూసి ఏమి అర్థం కానట్టు నిలబడ్డది. చెట్టుక్రింద రాలిన పువ్వులు లేవు. గేనుడికి నమస్కారం చేసి అక్కడినుంచే వెనక్కి తిరిగింది. నేను ముందుకు వచ్చి

"సుందాం" అని పిలిచాను. ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది.

రాక్షసుడిలాగా కనబడ్డది నేను, గాలి తగిలిన తీగెలాగా నిలువెల్లా వణికిపోయింది తను. కాని చేతిలో దండ చూడగానే, ఆశతో, సంకోచంతో, ఒక్కసారి నావంక చూసింది: దండ ముందుకు సాచి

"ఇంద" అని అన్నాను.

"వద్దు"

"పరవాలేదు తీసికో"

"వద్దు" అంటూ అక్కడినుంచి చకచకా వెళ్ళిపోయింది.

"సుందాం" అని పిలిచాను. సుందరిపలుకలేదు. వెనుదిరిగి చూడలేదు.

అడుగు కోపంగా యింటివేపు మళ్ళింది. చేతిలో పూదండ సాగే పాదాల్ని ఆపివేసింది.

గుడిలోకి వెళ్ళి యీ దండ పార్వతీపతి పాదాల చెంత వుంచుదామని అనుకున్నాను. మనుష్యులకు నిర్దేశించినవి భగవంతుడికి యివ్వవచ్చునో లేదో? అయినా పాములు పన్నగాలు ధరించే ఆ వీభూతిరాయుడికి మగువలకి మనసయ్యే యీ పూదండ దేనికి. మనకేం మనసైనవాగు కరువా. కోరినవారికే యిద్దాం. కాని ఎంత అవమానం. ఇంతవరకూ నేను కోరిన ఏ పడతి నన్ను కాదని సాగిపోలేదే?? నీవూ నాయకుడివాఅని ఈసడించి ఏ గంగాకమలాయతాక్షి, నన్ను కాదని, వేరొకపారుని చెట్టబట్టలేదే. ఈ దాసీకన్నె కా యింత పొగరు. దీని గర్వం అణచవలసిందే. ఈ పూదండ, నేను తలలో తురుమవలసిందే. ఈ సుందరి నాది కావలసిందే.

ఇంటికి చేరేసరికి నాన్న సంధ్యావందనం ముగించుకుని ఏదో చదువుకుంటున్నారు. నన్ను చూడగానే,

"ఎక్కడినుంచి?" అని అడిగారు.

"ఆలయానికి వెళ్ళివస్తున్నాను" ఈ మాట వినగానే ఆయన ముఖం చూసి తీరవలసిందే. ఏనుగెక్కినంత సంబరం కనిపిస్తోంది. మందహాసంతో.

ఒకడు—టీ కప్పుకు హాండిల్ ఎటువైపు ఉంటుందిరా?

వేరొకడు—ఏడ్చినట్టే ఉంది నీ ప్రశ్న. కప్పుకు ఎడమ, కుడి అంటూ ఉంటుందా ఏమి?

ఒకడు — అందుకేరా అడిగింది. అది బయటివైపు ఉంటుంది.

—ఎ. రామయ్య (సికిందరాబాదు)


పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్
రోజంతా హాయిగా మరియు సువాసన
వెదజల్లుతూ ఉండేలా ఉంచుతుంది
పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరును ఒళ్లంతా జల్లుకొంటే తీక్షణమైన ఎండలుగల వాతావరణములో కూడ మీకు చల్లగా, హాయిగా ఉంటుంది. దీనిని జల్లుకొని ఉత్సాహమును మరియు పూల పరిమళపు హాయిని రోజంతా అనుభవించండి.


POND'S
DREAMFLOWER TALC
DREAMFLOWER TALC
POND'S
DREAMFLOWER TALC
DREAMFLOWER TALC



"ఈ వేళ లైటు ఇంకా వెలగలేదు—పోయి రిపోర్టుచేయండి."

చిత్రకారుడు: అచ్చి రఘురామరెడ్డి (మద్రాసు)

# దక్షిణ నాయకుడు

"మడికట్టుకొని భోజనంచేద్దాం" అని అన్నారు.

మరునాడు కొదుకదా నాలుగురోజుల దాకా సుందరి రాలేదు. రోజూ బాగా ప్రొద్దుపోయేదాకా కనిపెట్టుకొనివుండటం నిరాశతో యింటికివెళ్ళడం. అయిదవరోజున తలంటి పోసుకుని, గాలితో దోబూచులాడే ముంగురులను సరిదిద్దుకుంటూ సరాసరి బొగడ చెట్టుదగ్గరకు వచ్చింది. చుట్టూతా కలియ జూచింది. ఎవ్వరు కనబడలేదు. నేను రాలే దనుకుని ధైర్యంగా పువ్వులు ఏరటం మొదలు పెట్టింది. పువ్వులు ఏరటం ఆట్టేసేపు పట్ట లేదు. ఎందుకంటె సగంపైగా పువ్వులన్ని నేనే ఏరి దండ తయారుచేస్తినయ్యె. ఏదో పాట తనలో తాను అనుకున్నట్టు కూనిరాగం తీస్తోంది. అక్కడినుంచె శివయ్యకు నమ స్కారంచేసి యింటికి మళ్లింది. ముందుకు అడుగు సాగలేదు. ఎత్తినతల వంచినది. ఎందు కని? ఎదురుగా కనపడ్డది నేను. ఒక్క క్షణం ఆగి త్రోవ తప్పుకొని వెళ్లబోయింది. అక్కడ త్రోవ ఉన్నది ఒక్కరికే. ఆ బాటలో నేనుఅడ్డంగా నిలబడి వుంటినయ్యె, నన్ను కాదని ముందుకు పోలేదు, వెనుతిరిగి గుడిలో అడుగుపెట్టలేదు. ఒక్క అడుగు వెనక్కి వేసింది.

"సుందరి" అని పిలిచాను.

తల ఎత్తి నా వంక చూసి, తలవంచుకుని నేలమీద బ్రొటనవేలితో రాయటం మొదలు పెట్టింది.

"ఇంటికి వెడుతున్నావా!"

అవునన్నట్టు తలవూపింది.

"నీతో ఒక్కమాట చెప్పనా?"

సుందరి ఏం మాట్లాడలేదు.

"నువ్వు ఎంతో అందమయినదానివి."

.....................

"నువ్వంటె నాకు చాలా యిష్టం."

ఈసారి చిన్నది కన్నెత్తిచూసింది.

"త్రోవ వదులు చినబాబు" అని అంది.

"అంత తేలికగా వదులుతానా?" అని అన్నాను.

చిన్నదాని కంట నీరు తిరిగింది.

"నీకు దండం పెడతాను"

"నాకు దండం అక్కర్లేదు. నేను చెప్పిన పని చెయ్యి; త్రోవ వదులుతాను"

"అమ్మో! నే నట్టాంటిదాన్ని కాదు"

"కాదు కనుక నే యీ మోజు."

...............

"సుందరి"

...............

"నన్ను చూసి ఎందుకు భయపడతావు? నేనేం రాక్షసుడిని కాదే? నిన్నేం తప్పు పని చెయ్యమని అనటం లేదు. ఇదుగో దండ, నీకోసమే కట్టాను తీసుకో."

"అక్కర్లేదు"

రోజూ నువ్వు వస్తావని ఎదురుచూస్తాను. ఈ నాలుగు రోజులనుంచి నువ్వు రాలేదు. నా మనస్సెంత బాధపడ్డదో ఎల్లాచెప్పను... నువ్వురాలేదేం...నామీదకోపంవచ్చిందా?"

"నన్ను వెళ్ళనీ చినబాబు"

"దండ తీసుకో వెళ్లి పోదువుగాని"

"నాకు అక్కర్లేదు"

"దీన్ని ఏం చెయ్యను?"

"దేముడి మెళ్ళో వెయ్యండి"

"దేముడి మెళ్ళోనా!" అంటూ ప్రక్కకు తిరిగాను.

సుందరి నన్ను దాటి వెళ్ళిపోతోంది. నేనిలా ఊరుకొంటే లాభం లేదనుకొని, ఇంతవరకు దాచిన అస్త్రాన్ని ప్రయోగిం చాను. ఆ చిన్నదాన్ని నాలుగు అడుగులు వేయనిచ్చి

"సుందరి నువ్వు వెడితే నామీద ఒట్టు" అని అన్నాను.

సాగిన పాదం ఆగింది. నేను రెండడుగులు ముందుకు వేసి

"దండ తీసుకో" అని దండ ఆపిల్లవైపు జాచాను.

"వద్దు" అని అక్కడినుంచే తల ఊపింది.

ఇంకొక వ్యక్తియైతే బలవంతంగా పొదివి పట్టుకుని తలలో పూదండ అమర్చేవాడిని. బహుశా సుందరికూడ నేనటువంటిపని ఏదో చేస్తానని అనుకుంటూంది కాబోలు, భయంగా నావంక చూసింది. ఆ మనిషిని చూడగానే చిలిపితనం మాని పెద్దమనిషితరహాగా ఉండా మనిపించింది.

"నీకోసం ఎంతో ప్రేమతో యీ దండ కట్టాను. ఎంత చెప్పినా నువ్వు వినటం లేదు. నా మాట మన్నించడం లేదు. ఇంత చిన్న కోరిక తీరకపోయిన తరువాత నేను బ్రతికి ఏం లాభం. నీ ఎదుటనే, యీ నదిలో పడి చస్తాను. సుఖంగా ఉండు" అని అంటూ, వడివడిగా అంగలు వేసుకొంటూ నది ఒడ్డుకు నడిచాను.

"హరోం! హర! హర!" అని ఒక్క పొలికేక పెట్టి నీటిలోకి దూకపోయాను.

"అంత దారుణమా మామయ్యా"

"నేను గజ ఈతగాడినిలేరా..." ఒక్క ఉరుకున సుందరి వచ్చి, నా చెయ్యి పట్టు కుంది.

"ఎందుకు చిన్నబాబు, నన్ను ఇల్లా చంపు తావు"

"నన్ను వదులు"

"వదలను. మీరీపని మానేసి ఇంటికి వెళ్ళి పొండి. మీరు గొప్పవాళ్లు. మేము పేద

(61-వ పేజీ చూడండి)

# వేదాంతి నవ్వు

దాశరథి

మంద మందంగా బొడ్డుమల్లెపూల సువాసన గాలిలో సమపాళ్లలో కలిసి వీచుతున్నది. అప్పుడే వేయించి పొడిగొట్టిన కాఫీగుండ్రతో కాచిన చక్కని కాఫీలా మనోహరంగా శుక్ల చతుర్దశి సాయంత్రం. చంద్రుడు ఇంచుమించు నిండుగా బొడ్డుమల్లెచెట్టువెనకగా దాక్కొని చూస్తున్నాడు. కాని దొంగను లోకమంతా కనిపెట్టేసింది. ఎంత దాక్కున్నా కనపడుతూనే వున్నాడు కొమ్మల చాటుమాటుగా—పొంగిన పాలముంతలాగా. పక్కన శివాలయంలో గంట ఖంగు ఖంగున మోగింది—భక్తులంతా వస్తూ పోతూ వున్నారు. వచ్చేపోయేవాండ్లను బొడ్డుమల్లె పూజిస్తున్నది తలలమీద పూలు రాలుస్తూ.

రామం బొడ్డుమల్లెచెట్టుక్రింద కూచుని శివాలయం ధ్వజస్తంభంవైపు చూస్తున్నాడు. ధ్వజ సంభంమీద వాలిన పావురాయి, రాయి విసిరితే ఎగిరిపోయినట్టు రామం చూడగానే లేచిపోయింది. తన చూపు అంత వికటమైందా? ఆలోచించుకున్నాడు రామం. అది ఎగిరిపోవడానికీ తాను చూడడానికీ ఏం సంబంధం? ఏదో రెండూ ఒక్కసారి అలా జరిగితే తనచూపులో విషాన్ని తలచుకోడం దేనికి అని సంతృప్తిపడ్డాడు రామం.

క్రమంగా రాత్రి హెచ్చుతున్నది. చంద్రమండలంలో అమృతం ఊరడం ఎక్కువవుతున్నది. అన్నివైపులా పుష్పపూలు పూస్తున్నాయి. నీలికౌగిలంమీద తెల్ల అక్షరాలలాగా ఆకాశంలో చుక్కలు - నీలి లంగామీద తెల్లని ఓణీలా ఆకాశంలో వెన్నెల.

శివాలయంలో జనం పలచబడుతున్నారు. రాత్రి ఎనిమిది కావస్తున్నది. సాయంత్రం అభ్యంజనస్నానం చేసి, తడిఆరని కురులు దిద్దుకోకుండా, హడావిడీగా పెట్టుకున్న కుంకుమబొట్టు, చేతిలో పూలబుట్ట, పెట పెటలాడుతూ ఊరికే పాదాలమీద జీరాడుతూ నడకకు అంతరాయంకలిగిస్తున్న పట్టుచీర, సీకాయరసం తాకి ఎఱ్ఱబారిన కళ్ళు, ఆభరణాలు లేకున్నా శంఖంలా అందంగా





స్వచ్ఛంగా వున్న మెడ, మెత్తని అరచేతులను, తాకి చూడాలనే కోరికతో ఊరిళ్లే కిందికి దూకే గాజులు—గబగబా నడిచి వెళుతున్నది 'వీణ'.

వారం రోజులనుంచి వీణను చూడాలని ఆ బొడ్డుమల్లె చెట్టుకింద సాయంత్రాలు కాచుకుంటున్నాడు రామం. వీణరాదు. ఇంటివైపువెళ్ళే ధైర్యంలేదు. గుడికి రావడం మానేసి అప్పుడే పదిరోజులైంది వీణ. ఎందుకు రావడంలేదో తనకు తెలీదు. తనఇంట్లో వీణను గురించి ఎవ్వరూ ఏమీ అనుకోలేదు.

ఇవాళైనా తన అదృష్టం అన్నట్టు వీణ కనపడింది. అంతేచాలు అనుకున్నాడు. వీణ గబగబా నడిచివస్తోంది. చూచాడు. మల్లెలూ నీలాంబరాలూ కలిపిపోసినట్టు వెలుగు నీడలు బొడ్డుమల్లెకింద కురుస్తున్నాయి. వెలుగునీడల్లో తనకోసం నిరీక్షిస్తున్న రామంను చూచింది వీణ. చూచీ చూడ్డంతోనే నడకవేగం హెచ్చించింది. ఫ్రులుకుపులుకున, చురుకుచురుకుగా, కోపకోపంగా చూస్తూ వెళ్లిపోయింది గుళ్లోకి.

ధ్వజస్తంభంమీది పావురాయిలా వీణకు గూడా తనచూపు, రాయిలా తాకిందా?

ఎందుకలా కోపం గావెళ్ళిపోయింది? మళ్లీ తన చూపుల్లోని దుష్టతవైపు ఆలోచన పోయింది రామానికి. పావురాయి ఎగిరిపోవడంలో అర్థం వుంది. తన చూపుల్లో తీపిలేదు. వట్టి చేదుచూపులు. కనుకనే పావురాయికీ, పావురాయిలాంటివీణకూ తనచూపులు రుచించలేదు.

నిజంగా తనచూపుల్లో అంత చేదుందా? లేక గుడికి వెళుతున్నప్పుడు తాను కనపడడం ఆమెకు నచ్చలేదా? భగవంతుణ్ని దర్శించుకోడానికి వెళ్ళేప్పుడు మనస్సులో ఎట్టివికారమూ కలుగకూడదు, కనుక తాను కనపడితే అందువల్ల మనస్సులో వికారం కలుగుతుందని భయమా? కావచ్చు. దైవసన్నిధికి వెళ్ళుతున్నప్పుడు మనస్సు స్వచ్ఛంగా వుండాలి. అవును. తాను ఇక్కడఎందుకు నిలుచున్నట్టు? మరోచోట ఎక్కడా ఆమె దర్శనం కాదు. తనకు భగవంతునిమీద భక్తి లేకున్నా ద్వేషం మాత్రం లేదు. ఉన్నాడని గట్టిగా నమ్మకున్నా లేడని వాదించవలసినంత మూర్ఖత తనలో లేదు. శివాలయం వద్ద కొలని పక్కగా బొడ్డుమల్లె నీడ తన మనస్సుకు ఎందుకో ప్రశాంతి నిస్తుంది. తాను కూడా గుడిలోకి వెడితే బాగుంటుందా ఇప్పుడు? అని ఆలోచించుకున్నాడు రామం. ఇప్పుడు వెళ్ళితే ఆమెకు మరీ కోపంరావచ్చు. ఆమెతో తనకుగల ఆరేండ్ల పరిచయంలో ఎన్నడూ ఆమె అలా కోపంగా చూడలేదు. ఇవాళ ఇదేం కర్మ?—రామం కుంగిపోయాడు. తన దౌర్భాగ్యానికి నిందించుకున్నాడు. మరోసందేహం కలిగింది. ఆమె పెళ్లిఏర్పాట్లు ఏమైనా జరగడం లేదుకదా?

పావుగంటైంది. వీణ తిరిగిరాలేదు. చంద్రుడు బొడ్డుమల్లె కొత్తిమీదికి పాకుతున్నాడు. తాను ఇక్కడ ఉన్నాడని ఆమె రావడానికి సందేహిస్తోందేమో. తనమీద ఇంత ద్వేషం ఎందుకు కలిగింది ఆమెకు? పోట్లాడుకోలేదే. తగాదా పడలేదే. అభిప్రాయభేదం రాలేదే. మరి ఎవరైనా ప్రత్యర్థులు తనకు వ్యతిరేకంగా కల్లిబొల్లిమాటలు చెప్పి ఆమెలో ద్వేషం పొటమరింప జేయలేదుగదా? అయినా అంత ప్రత్యర్థు లెవరున్నారు? తనతో మంచిగానే మాట్లాడి తనను ద్వేషించేవాళ్లు ఉండవచ్చు, అనుకున్నాడు. కాని ఎవరూ వెంటనే తనకు స్ఫురించలేదు.

ఇంకా రాదేం గుళ్ళోనుంచి? తాను ఇక్కడినుంచి వెళ్ళిపోతే వస్తుందేమో! తనవల్ల ఆమె ఎంతసేపు గుళ్ళో ఉండిపోను? వెళ్ళిపోదామని బయలుదేరాడు. మనస్సు ఒప్పుకోలేదు. వీణమీద చెప్పరాని కోపం వచ్చింది. తాను చదువువదలి రాజకీయాల్లో చేరబోతున్నాడు. ఏరోజు ఎప్పుడు అరెస్టయి జైల్లో పడతాడో. మహాత్ముని వంటివాణ్ణి నిర్దాక్షిణ్యంగా నిర్బంధించే ప్రభుత్వానికి తానులెక్కా! ఈ లోగా రెండునాళ్లు వీణను కళ్ళారా చూచుకోనైనా నోచుకోలేదా! అయినా ఈ ఆలోచన ఆమెకు ఉండరాదూ! తాను జైలుకు వెడతాడనేది ఆమెకూ తెలుసు. రాజకీయాల్లోకి వద్దని పదేపదే తానే బోధించింది. మనస్సులో జైళ్ళూ, రైళ్ళూ, రైఫిళ్ళూ మెదిలాయి. ఇంటికి వెళదామని బయలుదేరాడు, వీణమీద చెప్పరాని కోపంతో. ఎందుకు తనంటే ఇంత నిర్లక్ష్యం. ఛీ. ఆడాళ్లంతా ఇంతే అనిపించింది. వీణ ప్రవర్తనకు ఆడాళ్లనందరినీ నిందించడం తప్పు అనుకున్నాడు., తనకు స్త్రీలపై సహజంగా కల గౌరవాన్ని విడనాడడం ఇష్టంలేక.

ఇంతలో కిలకిలా నవ్వు వినిపించింది.

నందనవనంనుండి పారిజాతకుసుమాలు జలజల రాలినట్టు నవ్వింది, వీణ వెనుకనుంచి. గిరుక్కున వెనుతిరిగి చూచాడు. చంద్రుడు దానకర్ణుడిలా కొల్లకొల్లలుగా వెన్నెల కుమ్మరించాడు, వీణమీద. వీణ తనకు దగ్గరగా వచ్చింది. చిరునవ్వుచూపు చూచింది. చూపునిండా వలపు పరిమళాలు వున్నాయి. గాలిబ్ కవి అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి.

ఏల నన్ను మరచె ఎగుగబోయితి—ఆమె
వలపు చూపుమాచె భస్మమైతి.

ఆమె చూపు ఆమెమీద కలిగిన కోపాన్ని పెల్లగించి పారేసింది. "వీణా!" అన్నాడు రామం.

"ఎందుకు అలా పిలుస్తావు?"

"వీణ మ్రోగితే లోకాని కంతటికీ వినపడాలిగా."

"చాలెద్దూ. అన్నట్టు కాలేజీ ఎందుకు మానుకున్నావు?"

"మరి నీ వెందుకు మానుకున్నావ్?"

సిగ్గుపడింది వీణ. జవాబివ్వలేదు. మరో వైపు తిప్పింది సంభాషణ.

"నువ్వు పొలిటిక్సులో పడుతున్నావుటగా?"

"అవును."

"పొలిటిక్సులో పడితే పడ్డావుగాని జైల్లో మాత్రం పడకు". నవ్వింది.

"రాసిపెట్టివుంటే తప్పుతుందా."

"నీకూ రాతాపూతలమీద నమ్మకం వుందీ?"

"లేంది శివాలయానికి ఎందుకు వస్తాను?"

"నా కోసం."

"నీ కోసమే రాతలమీద నమ్మకం."

"కొంటెవాడివి". నవ్వింది వీణ.

"వీణా!"

"టా! టా."

వెళ్ళిపోయింది, వీణ. పెద్దదయిందని

# వీణ నవ్వు

అంతా అనుకుంటున్నారు గాని వీణలోని చిలిపితనం, చిన్నతనం పోలేదు. చంద్రుడు దివిటీలా మండుతుంటే ఆ వెలుతురులో వీణ తనతో మాట్లాడిన చోటంతా వెతికాడు రామం. ఆమె జడలోని నీలాంబరాలూ మల్లెలూ నలుపు తెలుపూ కలగలుపుకుని నాలుగు మూడు రాలి, దొరికాయి. అవి చెవిలో చెక్కుకున్నాడు. ఎక్కడి కెళ్ళావురా అని అమ్మ అడిగితే గుళ్లోకి అన్నాడు రామం, వీణ జడలోని పూలు చెవిలో చెక్కుకున్నవి చూపి.

మరునాడు రామం అరెస్టయినాడు. తల్లిని కూడా చూడడానికి రానివ్వలేదు, పోలీసులు. రామాన్ని జైలుకు పట్టుకెళ్లారు. ప్లాట్ ఫారం వెనకగా వీణనుంచుని దుఃఖంగా చూచింది. ఆమె చూపులో ఎన్ని కాంతులో ఎన్ని కంపనలో... జైల్లో రామంకు వీణా తానూ కలిసి గడిపిన ఆరేండ్ల గాధా చలన చిత్రంగా గోచరించింది. మేష్టారు రాని పూట ఇద్దరూ ఒకచోట కూర్చుని తమ పేర్లు ఇంగ్లీషులో ఎలారాయాలో చర్చించేవారు. ఆమె VEENA అని రాస్తే తాను "వీ"ని డబ్లియు చేసేవాడు. 'వీన్' అన్న శబ్దం "వి"తో రాస్తారు గనుక 'వి' కరక్టు అనేది వీణ. 'వీక్' లో డబ్లియు ఉంది గనుక డబ్లియు ఉండాలనేవాడు రామం. తాను ఎప్పుడు ఆమె పేరు రాసినా WEENA అని రాసేవాడు. ఆమె ఎప్పుడూ 'వి'తో రాసేది తన పేరు; 'వి ఫర్ విక్టరీ' అనేది ఆమె. 'డబ్లియు ఫర్ వెల్త్' అనేవాడు రామం. జైల్లో ఉన్న మూడు సంవత్సరాలూ రామానికి ఆమె నీలి నీలి కళ్లు, కళ్లలోని కమ్మని కాంతులూ మనస్సులో కనిపిస్తుండేవి. క్రమంగా రామంకు వీణను గురించి వివరాలు తెలియటం మానేశాయి.

మూడేళ్ల తరువాత బయటపడ్డాడు రామం. వీణకు ఒక కూతురు. రామం చలించకుండా ఈ వార్త విన్నాడు. ఆవిడ భర్త పోలీసు అధికారిట. జైలునుంచి తిరిగి వచ్చిన నాడు తల్లి వడ్డించినా అన్నం తినలేదు రామం. సాయంత్రం పూట శివాలయం వైపు వెళ్లి బొడ్డు మల్లెచెట్టు కింద నిలుచున్నాడు. సరీగా శుక్ల చతుర్శి. చంద్రుడు బొడ్డుమల్లె వెనుక వున్నాడు. అయితే అప్పుడప్పుడూ మబ్బువచ్చి అతన్ని తాకుతూ వెళ్ళిపోతోంది. ఎనిమిదవుతోంది. అభ్యంజన సుందరి వీణ గుడిలోకి వెళదామని వస్తోంది. రామం గుండె గుభేలుమంది. వీణ రామంను చూచింది. చెప్పరాని ఆనందంతో పొంగిపోయింది. ఆవిడలో ఆ నాటికీ ఈ నాటికీ ఎట్టి మార్పూ లేదు. అదే చిలిపితనం. అదే ఉత్సాహం.

రామం.

ఊఁ.

గుళ్లోకి రావూ.

రాకేం. కానీ నీతోనా.

ఏం - భయమా!

అబ్బే భయం కాదు. బావుండదని.

ఏంఫరవాలేదు రా! మా ఆయన ఏమన్నా అంటాడనా? ఆయనకు నువ్వంటే ఎంత ఇష్టం అనుకున్నావ్?

ఆమె కళ్లలోని కాంతులు మనస్సుకు అందని. వివర్ణ త్రాల్లా మిలమిలా మెరిశాయి. "పద గుడిలోకి" అన్నాడు రామం.

కిలకిలా నవ్వింది వీణ.

ఆ నవ్వులో ఎంత అమాయికత - ఎన్ని కాంతులు!



# ఎదురు తెన్నులు

నీ దర్శనమ్ముకోసము నేను స్వామి
ఎదురుతెన్నులు గాచితి నిదురవచ్చె
మరల మేల్కాంచి ఎన్నియోమార్లు నిదుర
పోయినాడను నీ జాడ పొలుపు లేదు.

నీదు సాక్షాత్కారమ్ము నీదు స్నేహ
మెంత తీయనిహాయి ఊహించినంత -
ఊహలందున మధురిమ దైహికముగ
మరులుగొల్పని జీవమే మరువు నాకు.

రిత్త పరుగులువెట్టి మరీచికలకు
వేయిపాటులుపాడి తద్వీచికలకు
బదులు పొచిక లేక నీ పొచికలకు
మేలుకొనలేక వాల్చితి మేను నేను.

తిరిగి మేనొక క్రొత్తది తెచ్చికొంటి
తన్నువిచ్చితి ననుభవ కక్ష్య దాటి
భవమె అనుభవమయ్యె నా భావ వీధి
పరచికొన్నది తిమిర మభావరేఖ.

భవమ్మనుభవమును భావ మభావమనగ
ఎండమావులు నాలుగు తాండవించు
నీదు రమణీయ సత్కృపానీర జమ్ము
ఎందుగనువిచ్చు నీ నాల్గింటిలోన?

—బెజవాడ సదానందం

# చిగుళ్లు: రోగకారణాలు

చిగురు; దంతాలకు దవడఎముకలకు మధ్య ఉండే పొర అని ఇదివరకే తెలుసుకున్నాము. ఈ పెరిడోంటల్ మెంబ్రేను అడుగుభాగమే చిగురు. ఇది రక్తపుష్కలమై, పండు దానిమ్మగింజలాగా అందంగా ఉండి, దంతపంక్తికి రక్షణ శోభ ఇస్తుంది. ఆరోగ్యవంతులలో చిగురు రంగు లేత ఎరుపుగా ఉంటుంది. కాని కొన్ని పరిస్థితులలో ఈ ఎర్రరంగులో నీలిచారలు కనిపిస్తవి. లేక చిగురే నల్లగానో నీలంగానో ఉంటుంది. చిగురు చివరిభాగంలో నీలవర్ణం కలిగిన చార సాధారణంగా సీసం గనుల్లోను, సీసంతో వస్తువులు చేసే కర్మాగారాల్లో పని చేసేవారిలోనూ, సీసం (లెడ్) ఉన్న ఔషధాలను అతిగా సేవించిన వారిలోనూ కనిపిస్తుంది. ఒకప్పుడు సిఫిలిస్ అనే వ్యాధి చికిత్సకై బిస్మత్ అనే లోహం ఇంజక్షనుగా ఇవ్వబడేది. ఈ ఇంజక్షన్లు పుచ్చుకునే వారిలో కూడా ఈ నీలవర్ణం కనుపించవచ్చు. పయోరియా అనే వ్యాధిలోనూ ఈ నీలివర్ణం రేఖామాత్రంగా కనుపించవచ్చు. స్పృశించినంతమాత్రాన చిగుళ్లలోనుండి చీము రక్తమూ రావచ్చును. ఒకప్పుడు, అకారణంగానే చిగుళ్లనుండి రక్తం కారిపోవచ్చు. ఇవన్నీ చిగుళ్లు వ్యాధిగ్రస్తములయినప్పుడు సంభవించేవి. వీటిని ఎంత త్వరగా గుర్తించి వైద్యసహాయం పొందితే అంతమంచిది.

ఏఏ వ్యాధులలో ఈ లక్షణాలు కనుపిస్తవో తెలుసుకునేముందు, రోగంలో రకములనుగురించీ, ఆ విషయంలో ఆధునిక వైద్య విజ్ఞానికాభిప్రాయములనుగురించీ స్థూలంగానైనా తెలుసుకోడం అవసరం. ఈ విజ్ఞానం ఒక్క దంతవ్యాధులను అర్థం చేసుకోడానికి మాత్రమే వినియోగించదు. సర్వవ్యాధులను, వాటి స్వరూపస్వభావాలను అర్థం చేసుకోటానికి సహకరిస్తుంది.

శరీరం నాలుగు విధములుగా రోగగ్రస్తమౌతుందని రోగశాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఆరోగ్యంలో ఉన్నప్పుడు శరీరధర్మములను వివరించే శాస్త్రం ఫిజియాలజీ. రోగం ఏర్పడగానే ఈ ధర్మములు కొద్దిగానో పూర్తిగానో మారిపోతవి. ఈ మార్పులను, అందువల్ల శరీరకార్యక్రమంలో జరిగే మార్పులను బాధలను వివరించే శాస్త్రం పేరు పాథాలజీ. పాథాస్, అనే పదానికి విచారము అని అర్థం. వ్యాధిరాగానే మొగంలో విచారము తెలియజేయడం జరుగుతుంది. ఈ రోగలక్షణములను ఔషధములతో నివారించవచ్చు; లేదా శస్త్రచికిత్సవల్ల నివారించవచ్చు; లేక, కొన్ని విద్యుత్కిరణ ప్రసారంతో నివారించవచ్చు. ఔషధములతో నివారించడం తెలియజేసేశాస్త్రాన్ని మెడిసిన్ అంటారు; శస్త్రములతో నివారించడం తెలియజేసే శాస్త్రాన్ని సర్జరీ అంటారు. విద్యుత్కిరణములతో నివారించే పద్ధతులను తెలియజేసే శాస్త్రాన్ని రేడియాలజీ అంటారు.

డా॥ గాలి బాలసుందరరావు

ఆధునిక విజ్ఞానం అభివృద్ధి చెందినకొద్దీ దాని ప్రభావం వైద్యంమీద కూడా వ్యాపించింది. ఎప్పటికప్పుడు చికిత్సా విధానాలు మారిపోతున్నవి. రోగకారణం విషయంలో అభిప్రాయాలు మారిపోతున్నవి. ఏమిమారినా రోగంలో రకములను గురించిన అభిప్రాయములు మారలేదు.

శరీరం వ్యాధిగ్రస్తం కావడానికి ముఖ్యకారణములు నాలుగు.

(1) 'ట్రామా' (అపాయం.) (2) ఇన్‌ఫ్లమేషన్. (3) డెఫిషియన్సీ. (4) నియోప్లాసమ్.

(1) అపాయం: దీనిని వైద్య పరిభాషలో 'ట్రామా' అంటారు. అపాయములు అనేక రకములుగా జరగవచ్చు. ఎదురుదెబ్బ దగ్గరనుంచి, ఎముకలు విరగడందాకా అన్నీ అపాయములే. అపాయం జరగగానే అలా జరిగిన ప్రదేశం అంతో ఇంతో వ్యాధిగ్రస్తమౌతుంది.

రెండవకారణం "ఇన్‌ఫ్లమేషన్". దీనిని గురించి ప్రతివారూ క్షుణ్ణంగా తెలుసుకోడం అవసరం. జీవితంలో కలిగే బాధల్లో నూటికి 80 పాళ్లు, అపాయములవల్ల, ఇన్‌ఫ్లమేషన్ వల్ల కలుగుతవి.

"ఫ్లేం" అంటే మంట అని అర్థం. మంట వేడిగాను ఎర్రగాను ఉంటుంది గదా! ఇన్‌ఫ్లమేషన్ అంటే మనం వాపు అని వర్ణించే రోగస్థితి. ఇన్‌ఫ్లమేషన్ అన్నమాట 'ఫ్లేం' అనే మాటనుంచి పుట్టింది. ఇంత విరళమైన అర్థంతో ప్రచారంలో ఏ మాటాలేదు. శరీరభాగం ఇన్‌ఫ్లేం అయినప్పుడు, ఔషధాలు, శస్త్ర చికిత్స, ఇతర చికిత్సలు కూడా అవసరం కావచ్చు.

ఇన్‌ఫ్లమేషనుకు కారణాలు మూడు.

(1) క్రిమిదోషం. (2) కొన్ని రసాయనిక వస్తువులు. (3) వేడి, విద్యుచ్ఛక్తి మొదలయిన శక్తులు అధికంగా ధాతువుల స్థితిని మార్చడం.

శరీరం ఇన్‌ఫ్లేం కావడానికి అతిముఖ్యకారణం క్రిమిదోషం. ఈ స్థితిని వైద్య పరిభాషలో "ఇన్‌ఫెక్షన్" అంటారు. సృష్టిలో క్రిములు అనేక రకములు. కొన్ని జంతుజాతికి చెందినవి. కొన్ని వృక్షజాతికి చెందినవి. కొన్ని శరీరకార్యక్రమంలో సహాయం చేసేవి; మరికొన్ని శరీర భాగములను వ్యాధిగ్రస్తం చేసేవి. (1) బాక్టీరియా, (2) పారసైట్, (3) ఫంగస్ అని క్రిములు మూడు రకములు. ఇందులో ఇన్‌ఫ్లమేషన్ కలిగించే క్రిములలో అతిముఖ్యమైన క్రిమివిషాన్ని బాక్టీరియా అంటారు. బాక్టీరియమ్ ఏకవచనం. బాక్టీరియా బహువచనం. ఈ క్రిములను గురించి తెలియజేసే విజ్ఞానం పేరు బాక్టీరియాలజీ. బాక్టీరియాలో చాలా రకము లున్నవి. వాటిలో కొన్నింటినే ఆధునిక విజ్ఞానం కనుక్కొన్నది. ఎప్పటికప్పుడు కొత్తక్రిములను కనుక్కొంటూనే ఉన్నారు. బాక్టీరియా ఏకజీవకణ శరీరులు. ఇతర క్రిమి విశేషములను గురించి సందర్భం వచ్చినప్పుడు వివరిస్తాను.

(2) రసాయనిక వస్తువులు. తమలపాకులలో సున్నం ఎక్కువైతే నోరు పొక్కడం, మామిడికాయ సొన తాకితే నోరు పుండు కావడం అందరికీ తెలిసిన విషయమే. కొన్ని రసాయనిక వస్తువులు చర్మాన్ని శరీరాంతరాళములలోఉన్న మ్యూకస్ మెంబ్రేనును తాకినప్పుడు పొక్కి పుండు అవుతుంది. లేక ఆ భాగం వాచి ఎర్రబడుతుంది. ఇలా ఎర్రబడడాన్ని 'ఇరిటేషన్' అంటారు. ఇలా చేసే వస్తువులను 'ఇరిటెంట్స్' అంటారు. ఒకొక్కప్పుడు ఈ 'ఇరిటెంట్సు'ను శరీరాంతర్గతమైన వ్యాధినివారణకోసం ఉపయోగించవలసివస్తుంది. చర్మ పరిభాగంలో రుద్దుకునే తైలాదులు, ఆయింట్‌మెంట్లు ఈజాతికి చెందినవే. జగత్ప్రసిద్ధమైన అమృతాంజనం ఈ జాతికి చెందిందే. ఇటువంటి తైలాదులు గృహవైద్యంలో అతిముఖ్యములు. వీటిని గురించి స్థలాంతరంలో వివరిస్తాను.

ఈ ఇరిటెంట్సు స్వల్ప పరిణామంలో వినియోగించబడినప్పుడు మర్దనం జరిగిన ప్రదేశంలో రక్తస్రావం అధికం చేస్తవి. అందుకని ఆ ప్రదేశం ఎర్రబడుతుంది. కాని వాటికి

అధికమైనప్పుడు అవి ధాతువులను నశింపజేయవచ్చు. ఇలా ధాతువులు నశించడమును "నెక్రోసిస్" అంటారు. నశించిన ధాతువును క్రిములు ఆవరించినప్పుడు "గాంగ్రీన్" అనే ప్రాణహానికరమైన, దుర్గంధ భూయిష్ఠమైన రోగస్థితి ఏర్పడుతుంది. ఈ స్థితి గంటలమీద ప్రాణాలు తీస్తుంది. ధాతువులో దుర్గంధం అంకురించగానే రోగీ, రోగి అనుచరులూ ఆ విషయం వెంటనే వైద్యుడికి తెలియజేయడం అత్యావసరం.

కాని ధాతువులు చచ్చిపోవడం ఎప్పుడో గాని జరగదు. సాధారణంగా ఇన్ఫ్లేం కావడమే జరుగుతుంది.

నిప్పును తాకినప్పుడు, ఎలెక్ట్రిక్ తీగలు ముట్టుకొన్నప్పుడు చేతులు కాలడం చాలామందికి తెలిసే ఉంటుంది. కేన్సరువంటి రోగాల్లో ఎక్సురే, రేడియం వైద్యం జరిగి

# మనమూ-మనదేహస్థితి

నప్పుడు పుళ్లుబడడం అనుభవించున్న వారికి తెలిసి ఉంటుంది. ఈ విధమైన వైద్యాన్ని మనవారు కరెంటు ట్రీట్మెంటు అంటున్నారు. ఈ రెండు ఇంగ్లీషుమాటలే

వ్యాధికిమూడవ కారణం, 'డెఫిషియెన్సీ'. 'డెఫిషియెన్సీ'అంటే 'లోటు' - 'లోపం' అనిఅర్థం. ఆహారంలోకొన్ని అతిముఖ్యపదార్థములు లోపించినందున కొన్ని వ్యాధులు ఏర్పడతవి. ఉదాహరణంగా, విటమిన్ "సి"లోపిస్తే, చిగుళ్లు సహజస్థితి కోల్పోయి కచ్చికలాగా, స్పాంజిలాగా, పెలుసయి., రక్తం కారిపోయే "స్కర్వీ" అనే వ్యాధి యేర్పడుతోంది. "రిబోఫ్లేవిన్" అనే






విటమిన్ బి కాంప్లెక్సులో భాగం లోపిస్తే జీర్ణకోశంలో మ్యూకస్ మెంబ్రేన్లో పుళ్లుపడి, "స్ప్రూ" అనే వ్యాధి ఏర్పడుతుంది. ఇల్లా అనేక వ్యాధులు ఏర్పడవచ్చు. సందర్భం వచ్చినపుడు ఇంకా విపులంగా ఈ విషయం చర్చిస్తాను.

ఇక నాలుగవ వ్యాధి విశేషం 'నియోప్లాజం'. "నియో" అంటే నూతనమైన, 'ప్లాజం' అంటే గుజ్జువంటి పదార్థం. ఒక శరీరభాగంలో ఒకే రకమైన టిష్యూలో జీవకణములు విపరీతంగా ప్రవృద్ధి చెంది కణుతులు గ్రంధులు ఏర్పడతవి. ఆ ప్రదేశం ఉబ్బుతుంది. ఈ స్థితి శరీరోపరి భాగంలో అయినా ఏర్పడవచ్చును. లేదా అంతర్భాగములలో అయినాఏర్పడవచ్చును. ఏటిష్యూ అధికమౌతున్నదో ఆటిష్యూ స్వభావాన్నిబట్టి, ఈ కణుతులు అనేక పేరులతో వ్యవహరించబడతవి. కొన్ని ప్రవృద్ధి చెందడానికి దీర్ఘకాలం తీసుకుని, ఒకేచోట పెరుగుతవి. ఒకే టిష్యూను అనుసరించి ఉంటవి. పరిసర అవయవములలోనికి గాని ధాతువులలోనికి గాని చొచ్చుకొనిపోయి వాటిని వ్యాధిగ్రస్తములు చేయవు. ఒకప్రదేశంనుంచి మరొకప్రదేశానికి వ్యాపించవు. ఒకేటిష్యూను ఆశ్రయించి ఒకే ప్రదేశంలో నెమ్మదిగా పెరిగే గ్రంథిని "బినైన్ట్యూమర్" అంటారు. ప్రక్క అవయములను కొరుక్కొని తింటూ ఇతర అవయవములలోకి రక్తంద్వారా ప్రాకే జీవకణములు గల గ్రంథిని "మెలిగ్నంటు ట్యూమరు" అంటారు. 'కేన్సరు' అందరికీ తెలిసిన మెలిగ్నంటు ట్యూమరు. కేన్సర్ అంటే మ్యూకస్ మెంబ్రేన్లో అంకురించిన "మెలిగ్నంటు ట్యూమరు". జన్మతః ఉండక క్రొత్తగా పెరిగిన కణుతిని నియోప్లాజమ్స్ అంటారని ఇదివరకే చెప్పాను.

శరీరంలో అంకురించే వ్యాధులన్నీ ఈపైన వివరించిన రకములలో ఏదో రకానికి చెంది ఉండవలసిందే. ★

## పాఠకులకు మనవి

"మనమూ - మనదేహస్థితి" శీర్షిక పాఠకుల ఆదరాభిమానాలు అధికంగా చూరగొన్నందుకు ఆనందిస్తున్నాము.

పాఠకులు సందేహాలు వెలిబుచ్చుతూ వాటిని తీర్చమని వ్రాస్తున్నారు. చాల స్థూలంగా సందిగ్ధంగా మాత్రమే ఈ సందేహాలు వెలిబుచ్చుతున్నారు. వాటికి ఇదమిత్థంగా సమాధానం ఇవ్వడానికి వీలులేదు. ఈ విషయం గమనించమని పాఠకులను కోరుతున్నాము.

—సంపాదకుడు

# రాశిఫలాలు

-దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

23-11-60 బుధవారం మొదలు

29-11-60 మంగళవారంవరకు.

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం సులభంగా తెములని పనులలో ప్రవేశిస్తారు. ధనాదాయం కొద్దిగా పెరుగుతుంది. కాని,ఖర్చులు విపరీతంగా పెరుగుతవి. లెక్కలకుసంబంధించిన పొరపాట్లు తరచూ వస్తూఉంటవి. ఎదటివారిమీద సందేహాలు వచ్చి మీ పనులకు ఆటంకాలు ఏర్పడుతవి. ఆదాయవృద్ధి ప్రయత్నాలుచురుకుగా జరుగుచున్నట్లు కనుపించినా పూర్తిగా నెరవేరవు. కుటుంబంలో ఇంతకుముందుకన్నా సుఖము, శాంతీలభిస్తవి.వారం రెండవభాగంలో లాభవార్తలు తెలుస్తవి. శుభకార్యప్రయత్నాలు ఫలిస్తవి. ఇతరుల కార్యభారాన్ని తగ్గించుకుంటారు. 25, 26 తేదులలో ప్రయాణాలు, స్వల్పలాభం విరోధాలు.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రతివిషయంలోను ఆసక్తిబాగుంటుంది. సాహిత్యరంగంలో ముందుకుపోగలుగుతారు. వృత్తి విషయంలో ఏర్పడిన సమస్యలు క్రమంగా సర్దుబాటుఅవుతవి. ముందుకన్నా ఆదాయం పెరుగుతుంది.ఆలోచనలు ఎక్కువ. ధర్మకార్యాలలో పాల్గొంటారు. మీ మిత్రులనుగురించిమీకుగల సందేహాలు తొలగిపోతవి.యంత్రాలు మొదలయినవి కొనే నిమిత్తం ప్రయత్నాలు చురుకుగా జరుగుతవి. సంఘకార్యాలలో శ్రమ ఉంటుంది. తోటివారి సహాయంతో సక్రమంగా జరుపగలుగుతారు. కుటుంబబాధ్యతలను చాకచక్యంతో నెరవేర్చుకొంటారు, 23, 24 లలో ధనప్రాప్తి. వ్యవహారవిజయం.

**మిథునం :**

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

సాహసకార్యాలకు ప్రోత్సహించేవారేగాని, చిక్కులను సర్దుబాటు చేయగలవారు కనుపించరు. రావలసిన ధనం సకాలంలో అందదు. హోదా పెరుగుతుంది. శ్రమతోకూడిన ప్రయాణాలు చేస్తారు. మాటమంచితనంతో పనులు సాధించుకోవలసిన సమయం. భాగస్తులతోకలసిచేయుపనులలో ఫలితంబాగున్నా ఇతరులవల్ల నిష్ఠురాలు, అశాంతి కనుపిస్తవి. బంధువులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. విద్యార్థులకు బుద్ధివికాసము,శ్రద్ధ బాగుంటవి. ఎత్తుమీదనుంచి పడటంవల్ల గాని,అగ్ని సంబంధమైన పనులవల్లగాని దేహబాధలు కలుగగలవు. జాగ్రత్తగాఉండండి. 27, 28 లలో వృత్తిలో అభివృద్ధి, స్త్రీలాభం, క్రొత్త కొనే ప్రయత్నాలు, శ్రమ.

* * *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

సమయానుకూలంగా ప్రవర్తించి భారం పెట్టుకోకుండా మాట దక్కించుకుంటారు. కోర్టు కచేరీలలో ధనవ్యయం కనుపించినా గౌరవము, కార్యసిద్ధి ఉంటవి. విలువగల వస్తువులు కొనే ప్రయత్నాలకు ఆటంకాలు రావచ్చు. వ్యాపారవ్యవహారాలలో ఇతరుల సలహాలను పాటించటంవల్ల కష్టనష్టాలు రాగల అవకాశాలున్నవి. రాజకీయాలలో మాటకు విలువ లభిస్తుంది. అయితే పట్టుదలలు తగ్గించుకొనటం అవసరం. ధన సంబంధమైన చిక్కులు తీరగల సూచనలున్నవి. అధికశ్రమవల్ల అనారోగ్యం చేస్తుంది. పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది. 25, 26 లలో అపవాదులు, వస్తువులు పోగొట్టుకొనటం, వంచన.

* * *

**గ్రహస్థితి**

మిథునంలో అంగారకుడు, సింహంలో రాహువు,తులలో బుధుడు, వృశ్చికంలో సూర్యుడు, ధనుస్సులో గురు శుక్ర శనులు,కుంభంలో కేతువు, మకర కుంభ మీన మేషాలలో చంద్రుడు.

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ముఖ్యంగా ఉద్యోగ సంబంధమైన ఆందోళన, చిక్కులు తీరిపోయి మనశ్శాంతి లభించదగిన సమయం. ప్రయాణాలు అనుకూలిస్తవి. క్రొత్తవారితో ప్రసంగించే సందర్భంలో నిబ్బరం అవసరం. దుబారా ఖర్చులు తగ్గించుకొనటంవల్ల ముందు ముందు ఇతరుల సహాయం ఎదురుచూడవలసిన అవసరం తగ్గుతుంది. బంధుమిత్రుల రాకపోకలు అధికం. వ్యవహారపరిష్కారబాధ్యతలు పైన పెట్టుకోవద్దు. మీ యోగక్షేమాలు విచారిస్తూ రహస్యాలు తెలుసుకొనేవారుంటారు. జాగ్రత్త. క్రొత్తగా ఆదాయ ప్రయత్నాలు అనుకూలిస్తవి. వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి. 27, 28 లలో అధికారులతో మైత్రి, విలాస వినోదాలు.

* * *

**కన్య :**

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

బుద్ధిబలంతో విజయం సాధించతగిన సమయం. వృత్తికి సంబంధించిన క్రొత్తవార్తలు, రహస్యాలు తెలుసుకుంటారు. మీ కార్యక్రమాలు కొన్ని తాత్కాలికంగా నిలుపుకోవలసివస్తుంది. ధనాదాయం నిదానంగా లభించినా సంతృప్తికరంగా ఉంటుంది. ఇతరుల కలహాలలో మధ్యవర్తిత్వం చేయవలసివస్తుంది. ఉత్తర దిక్కునుంచి లాభవార్తలు తెలుస్తవి. పిల్లల ఆరోగ్యం లోపిస్తుంది. పుణ్యకార్యకలాపాలతో ప్రశాంతంగా కాలం గడుపగలుగుతారు. స్నేహితులవల్ల ప్రస్తుతం ఆటంకాలు ఏర్పడుతవి. కాని, ఈశ్వరానుగ్రహంవల్ల, నిదానంగా మీకే అనుకూలత కలుగుతుంది. ఇతరులకు అప్పులు ఈయవలసిన అవసరం వస్తుంది. 27, 28లలో శుభవార్తలు. ధనలాభం, ప్రయాణసూచనలు.

* * *

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు,స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఇతరులతో ప్రసంగించే సమయంలో పొరపాట్లు రాకుండా చూచుకొనండి. ఆదాయం కన్నా ఖర్చులు ముందు ఎగుగు అవుతవి. సహాయం చేయవలసిన పెద్దమనుష్యులు ముఖం తప్పిస్తారు. ముందు ఆరంభించిన పనులు

# ప్రథమ కర్తవ్యం



ఏమీ చెయ్యకుండా కూర్చుంటే భవిష్యత్తు ఎలాగ వుంటుందో ఎవ్వరికీ తెలియదు. అందువల్ల ప్రతివారు తమతమ కుటుంబాల భావి భద్రతకు ఆర్థిక రక్షణ కలిగించుకోవాలి ఈ విషయంలో పనివారి మార్గం సుగమం చేయుటలో ప్రతి యజమాని సులభంగా వారికి సహాయము చేయగలరు. జీవిత భీమా ద్వారా వారు పొదుపు చేయుటలో వారికి సహాయపడి వారి ఆశయాలను సఫలీకృతం చేయవచ్చు.

తమ తమ కుటుంబాలకు జీవిత భీమా ద్వారా ఆర్థిక రక్షణ కల్పించుకొనుట తోను, తమకు ఉద్యోగ విరమణ అనంతరం తగు ఆదాయం వచ్చుటకు చేసుకొనుటలోను మీ పనివారలకు సులభముగా నుండునట్లు ఎల్. ఐ. సీ. సూక్ష్మమైన ఒక పథకమును తయారుచేసింది. అదే—వేతనాల పొదుపు పథకము

మీ సిబ్బంది తమ భవిష్యత్తును తీర్చి దిద్దుకొనుటలో సహాయపడుటకు ఉపకరించుటద్వారా యజమానికి పనివారలకు మధ్య సన్నిహిత సంబంధము ఏర్పడుటకు ఈ పథకము తోడ్పడును.

ఈ పథకము వివరముల కొరకు అడగండి. మనస్ఫూర్తిగా ఉత్సాహముతో పనిచేసే సిబ్బందిని సమకూర్చుటలో ఈ పథకము మీకు తోడ్పడుతుంది.



ఒక్క విషయం —

## జీవిత భీమాకు ప్రతిగా మరొకటి లేదు.

## ఎల్.ఐ.సి. వేతనాల పొదుపు పథకము

## లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

EP/LIC/SZ/12

# రాశిఫలాలు

పూర్తి కాకముందే క్రొత్తభారం పైన పెట్టుకోవలసి వస్తుంది. మిమ్మల్ని గురించి దుర్వార్తలు ప్రచారం అవుతున్నట్లు తెలుస్తుంది. బంధువులవద్దనుంచి ఎదురుచూస్తున్న వార్తలు సకాలంలో రావు. వృత్తికి సంబంధించిన కార్యక్రమాలలో మాట విలువ, గౌరవ ప్రతిపత్తులు బాగుంటవి. లెక్కలు, వ్యవహార పత్రాలు మొదలయిన విషయాలలో తప్పులు రాకుండా చూచుకోనండి. ప్రయాణాలు సాగవు. 23, 24 లలో ఆస్తి వృద్ధియోచనలు, బంధువుల రాక, శుభవార్తలు.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

బాహ్యవిషయాలలో జయప్రదమైన కాలం. స్వశక్తితో సాధించలేకపోతారు. కాని సమయంలో ఇతరుల అండ లభిస్తుంది. విద్యావ్యాసంగాదులకు అనుకూలంగా ఉంటుంది. ధనసంబంధమైన ఆందోళన చాలావరకు తగ్గుతుంది. కోర్టు కచేరీలలో ఆరంభంలో ఆదుర్దా తోస్తుఉంటుంది. కాని, చివరకు పనులు సక్రమంగా కొనసాగుతవి. కుటుంబంలో నిర్వహణభారం పెరగగల అవకాశా లున్నవి. సాధ్యమైనంతవరకు అభిప్రాయభేదాలు రాకుండా చూచుకోనండి. వృత్తి ఉద్యోగాలలో తోటివారి మాటను నమ్మి మీ బాధ్యతలను మరువవద్దు. 27, 28 లలో పిల్లలమూలంగా ఆనందం, దైవకార్యాలు, త్రిప్పట.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ ప్రథమ పాదం)

మాటలు ఎన్ని చెప్పినా పనిలో ప్రవేశిస్తేగాని కష్టసుఖాలు అర్థంకావు. సహాయం చేస్తామనేవారేగాని, చేసేవారుండరు. దైవబలం పూర్ణంగా లేని ఈ సమయంలో వ్యవహారాలు రాకుండా చూచుకోనటం అవసరం. మీచేత శ్రమ చేయించుకుని నిష్ఠురాలు మాట్లాడుతారు. సంఘంలో పేరుప్రతిష్ఠలు బాగుంటవి. అందువల్ల ఖర్చులుమాత్రం పెరుగుతవి. దూరమందున్న మిత్రులవద్దనుంచి లాభవార్తలు తెలుస్తవి. త్రిప్పట అధికంగా ఉంటుంది. ఆహారవిహారాలలో జాగ్రత్తగా ఉండటం అవసరం. 23, 24 లలో ధనలాభం, వస్త్రాభరణాదులు కొంటారు. గొప్పవారి స్నేహము.

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

ప్రతివ్యవహారము వెంటనే అనుకూలించేటట్లు కనిపిస్తూ మిమ్మల్ని పరీక్షిస్తూఉంటవి. ఆదాయంలేని పనులు అధికంగా కనుపిస్తవి. ప్రతివారు మీతో అనుకూలంగానే మాట్లాడుతారు. అనుకున్న ప్రయాణాలు ఆగిపోతవి. శ్రమవిశేషంగా కనుపించినా ఋణం చేయకుండా చూచుకోనటం అవసరం. ఇతరులతో మాట్లాడేసమయంలో మిమ్మల్నిగురించి మీరే వెల్లడిచేసుకోకుండా జాగ్రత్తపడండి. ముత్తంమీద ఇంతకుముందుకన్నా ఆదాయం పెరుగుతుంది. వృత్తివ్యాపారాలలో కొద్ది ధారాళత్వం కనుపిస్తుంది. కొంతవరకు నిబ్బరము. బెట్టుసరితో పనులు సాధించుకోగలుగుతారు. 25, 26, తేదులలో ధనసంబంధమైన సమస్యలు, వ్యతిరేకవార్తలు.

* * *

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ప్రస్తుతం మీ ధోరణి ఎదటివారి దృష్టిలో పట్టుదలతో ఉన్నట్లు తోస్తుంది. చేసినఖర్చువల్ల ముందుముందు ఉపయోగం ఉంటుంది. పైవారివల్ల మాట రాకుండా చూచుకోగలుగుతారు. వృత్తి వ్యాపారాలలో ముఖ్యమైన మార్పులు రాగలవు. వాహనాలుగాని, భూములుగాని కొనటానికి అనుకూలమైన కాలం. మీకు,మీ మిత్రులకు మధ్య కలహాలు కల్పించేవారుఏర్పడుతారు. వ్యవహారవిషయాలలో మానసికమైన ఆందోళనకు అవకాశాలు కనుపిస్తవి. ఆహారమునందు అయిష్టత, నిద్రాభంగము, పనులయందు అశ్రద్ధ మొదలయిన సూచనలు ఉంటవి. 23, 24 లలో వృథా సంచారం, కార్యభంగం.

* * *

## మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ఓర్పుతో ఉండటం అవసరం. క్రొత్త మనుష్యులతో లావాదేవీలు ఏర్పడవలసిన సూచనలున్నవి. మాటలలో మిమ్మల్ని పరీక్షించేవా రుంటారు. ఖర్చులు తగ్గించుకొని, నిరాడంబరంగా ఉండటం మంచిది. సంఘకార్యాలలో ఒకరినిమిత్తం మరొకరితో విరోధించవలసివస్తుంది. జాగ్రత్తగా నిర్ణయించుకోనటం అవసరం. భాగస్తులతో కలిసి చేయు వ్యాపారాలలో శ్రమఉంటుంది. కాని ఫలితం బాగుంటుంది. కుటుంబవిషయాలలో ముఖ్యమైననిర్ణయాలు జరుగుతవి. బంధువుల సలహా ప్రస్తుతం ఉపయోగించదు. పాతమిత్రులను చూస్తారు. 28, 29 లలో వస్త్రాభరణప్రాప్తి,అధికారులతో స్నేహం. ★

### —ఈవారము ధరలు—

బంగారు ధర 23, 24, 25 లలో కొద్ది తేజీ వస్తుంది. వెండిధర 25, 26 లలో తేజీ వస్తుంది.

పసుపునరలో మందీసూచన లున్నవి. వేరుశెనగపప్పు ధర కొద్దిగా తగ్గుతుంది. నూనె ధర తేజీలో నిలుస్తుంది. నూవుల నూనె ధర 23, 24 లలో తగ్గి 26 ,27 లలో పెరుగుతుంది.

కందులకు గిరాకీ ఆరంభం అవుతుంది. మినుములకు తాత్కాలికంగా మందీ వస్తుంది. నూలువస్త్రాలకు కొద్దిగా పెరిగే అవకాశాలున్నవి.



# వనితాలోకం

## మత్కుణోపాఖ్యానము

["5–10–60 తేది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో మత్కుణాల బారి నుండి తప్పించే మంత్రతంత్రా లేమైనా ఉంటే పత్రికాముఖంగా తెలుపమని అనంతపురం ఇందిరమ్మగా రడిగినదానికి, నల్లులను గురించి కొన్ని వివరాలు సేకరించి ఈ క్రింద పొందుపరుస్తున్నాము."]

### 'ఉపోద్ఘాతం'

మంచా లన్నీ ఎండలో వేసి దులుపుతూ "నలులు ఇలా చంపేస్తున్నాయేమిటి తాతయ్యా" అంటే "అందుకేరా! ఈ నల్లుల బాధ పడలేకనే శివుడు హిమగిరిపైన, విష్ణువు శేషుని పైన తమ నివాసం ఏర్పరుచుకొన్నారు" అని చమత్కరించాడు తాతయ్య. ఈ నల్లుల బాధ అనుభవించినంతగా వర్ణించలేము. నల్లి ఇంజక్షన్ చేసినప్పుడు దాన్ని నలిపి చంపివెయ్యాలన్నంత కసితో లేచి చూస్తే అది కనపడదు సరికదా! పంతంకొద్దీ వెతకడంవల్ల నిద్రాభంగమై మరికొంత బాధ పడుతూ ఉంటాము.

### 'సంబంధ బాంధవ్యాలు'

అసలు ఈ నల్లిజాతి మానవజాతితో ఏర్పరచుకొన్న సంబంధ బాంధవ్యాలు ఈనాటివి కావు. మనలను ఇవి రాతియుగంనుంచీ వెంటాడుతూనే ఉన్నాయి. మానవుడు గబ్బిలాలు ఇతరపక్షులతోను కలిసి గుహాలలో నివసించే అనాగరిక కాలంనుండికూడ ఇవి మనలను అనుసరిస్తున్నట్లు తెలుస్తోంది. విజ్ఞాన శాస్త్ర భాషలో ఈ క్రిమిని "సిమెక్స్ లెకులారియస్" అంటారు. ఈజాతి క్రిములు పక్షులమీద, గబ్బిలాలమీద ఆధారపడి జీవిస్తూఉంటాయి. కేవలం మనుష్య రక్తంపైననే ఆధారపడి జీవించే మత్కుణాల్ని "సిమెక్స్ హెమిప్టెరస్" అంటారు. మన దేశంలో ఈ రెండు రకాలు ఉన్నాయి. వీటిలో ఏదో ఒక జాతి లేని దేశం ప్రపంచంలో యేదీ లేదనే చెప్పకోవచ్చు.

### 'అలవాట్లు'

దోమ, బొద్దింకలవలెనే ఇదికూడా నిశాచరమే. అందుచేత దీని ఆహార విహారాది కార్యక్రమమంతా రాత్రులందే జరుగుతుంది. మానవశరీరంపైన అనువైన స్థలం చూచుకొని నల్లి తన పైదౌడలను మన చర్మంలోనికిగుచ్చి అంతకుముందే తాను ప్రసరింపజేసిన (మనలను ఇంజక్షన్‌లా బాధించేది ఈ సమయంలోనే) లాలాజలము మన రక్తము కలిసిన మిశ్రమ ద్రవాన్ని ఆస్వాదిస్తుంది. దోములాగ నల్లి అంటువ్యాధులను వ్యాపింపజేస్తుందో లేదో కాని, వీటి కాట్లకు మన నిద్ర చెడిపోగా నిద్రలేమిచేత అనారోగ్యం కలగడానికి యేమీ సందేహం లేదు.

**అనిపెద్ది వెంకటరమణారావు**

నల్లులు ఎక్కువగా బల్లలు, కుర్చీలు, మంచాల సందుల్లోను, గోడల పగుళ్ళలోను నివసిస్తూ ఉంటాయి. తరచుగా బెడ్డింగులు, పరుపుల, దిండుల గలేబులలోను, మంచపు నవారు పట్టెలక్రింద, ఫొటో ఫ్రేములలోను కూడా కనిపిస్తూ ఉంటాయి. ఇంతెందుకు, ఇవి దాక్కోడానికి వీలుండే ప్రతీచోటు వీటికి నివాస యోగ్యమే.

### 'జీవిత విశేషాలు'

నల్లి జీవితచరిత్ర గ్రుడ్డుతో ప్రారంభమవుతుంది. పైన చెప్పినట్లు కర్రసామానుల సందులు వగైరాలలో నల్లులు గ్రుడ్లు పెడతాయి. గ్రుడ్డు సుమారు 1.5 మిల్లిమీటరుల పొడవుండి, ఒక చివర కొంచం వంగి ఉంటుంది. ఒక్కొక్క నల్లి సుమారు నూరు నూటయాభై గ్రుడ్లు పెట్టగలదు. కాని అన్నిటినీ ఒకసారి కాక దఫదఫాలుగా పెడుతుంది. గ్రుడ్డు పొదగబడి పిల్ల కావడానికి ఏడునుండిఇరవై రోజులదాకా పడుతుంది. పిల్ల అయిన మరుక్షణంనుంచే తనకు అనువైన స్థలం ఏదా అని వెతుక్కొంటుంది. పొదగబడినప్పుడు ఇది గోధుమ రంగులో ఉండి, రక్తాహారం తీసుకునే కొద్దీ తోపురంగులోనికి మారుతుంది. సహజంగా ఇవి మనుష్యరక్తంపైనే ఆధారపడి ఉంటాయి. అసాధారణ పరిస్థితుల్లో జంతు రక్తంకూడా పీల్చడం కద్దు. అదీకాక అసలు ఆహారమనేది లేకుండా ఇవి చాలా కాలం జీవించగలవుకూడా. ఒక్కొక్కసారి ఏ ఆహారమూ లేకుండా నల్లులు ఒక సంవత్సరంపాటు జీవించిన సందర్భాలున్నాయి.

ఎక్కువగా నల్లులు తమ సంతానాన్ని కర్రసామగ్రిలోను, బెడ్డింగులు, పరుపులు మొదలైన పడక సాధనాల్లోను అభివృద్ధి చేసుకుంటాయి. అందులో మంచాలు, కుర్చీలులాంటి విశ్రాంతి సాధనాల్లో ఎక్కువ. మన దేశంలో రైలు పెట్టెలలోను, వెయిటింగు రూములలోను సినిమా హాలులలోను వీటి బాధ అనుభవైకవేద్యమే.

### "(ఉప)సంహారము"

ఒకవిధంగా వీటిబారినుండి శాశ్వతంగా తప్పించుకోవడం అసాధ్యమనే చెప్పకోవాలి. క్రిమిసంహార ఔషధాల్ని ఉపయోగిస్తే కొంత ఉపయోగం కనపడవచ్చుగాని అవి ఉపయోగించడంలో చాల జాగ్రత్త అవుసరం. ఇంచుమించు క్రిమిసంహారులన్నీ విషపూరితాలే. వాటిని ప్రత్యేకశ్రద్ధతోను, తగు జాగ్రత్తతోను ఉపయోగించకపోతే ఇంట్లో మనిషేవారికి, పెంపుడు జంతువులకు ప్రమాదాలు సంభవించవచ్చు. డి. డి. టి. పొడరును ఇవి మసిలే ప్రదేశాల్లో జల్లితే కొంత ప్రయోజనం కనపడొచ్చు కాని ఈ మధ్య పరిశోధనలవల్ల నల్లులు డి. డి. టి. కి తట్టుకొనే ప్రతీకార శక్తి పెంపొందించుకున్నట్లు తెలిసింది.

వారానికోసారి మంచాలు, పరుపులు వగైరా మత్కుణనివాసయోగ్యాలు మెండుగా కాసే ఎండలో వేయడంవల్ల పెద్దనల్లులూ, పిల్లగ్రుడ్లూ కూడా చాలా వరకూ నశిస్తాయి. ఎండ తీక్ష్ణతకు తట్టుకునే శక్తి వీటికిలేదు. అదీకాక మరిగే వేడి నీటిలో సబ్బుకలిపి మంచాలు కోళ్ళసందులు మొదలైనవాటిలో పోస్తే ఇవి చప్పగా ని




పోతాయి. డి. డి. టి. పౌడరు కిరసనాయిలుతో కలిపిగాని, కేవలం కిర్సనాయిలుగాని ఉపయోగిస్తే కూడ ఇవి తప్పక మరణిస్తాయి.

విజ్ఞానశాస్త్రం అభివృద్ధిచెందుతున్న ఈ రోజుల్లో అనేక పరిశోధనలు జరుగుతున్నాయి. మత్కుణసంహారానికి వేర్వేరు క్రిమి నాశనపదార్థాలను తగుపాళ్ళలో కలిపి కొన్నిరకాల మిశ్రణాలు కనిపెడుతున్నారు. వీటి ఫలితాలు ప్రోత్సాహకరంగా కనుపించవచ్చు కాని వీటిలో విషపదార్థాలు కలిసి ఉండడంవల్ల మిడిమిడిజ్ఞానంతో వీటిని వాడేకన్నా మానుకోవడం ఉత్తమం. వీటి మారణానికి ప్రత్యేక మంత్రాలేమీ ఉన్నట్లు లేదు

(క్రిమిపురాణే
మత్కుణకాండ స్సమాప్తః)

★

## టొమాటో ఊరగాయ

19 10-60 వ తేదీ వారపత్రికలో శ్రీమతి భానూహసనాన్ గారు టొమాటో ఊరగాయ తెలిస్తే వ్రాయమని వ్రాసినదానికిగాను వ్రాస్తున్నాను.

కావలసిన వస్తువులు

$\frac{1}{2}$ వీసె గట్టి పచ్చి టొమాటోలు.
$\frac{1}{2}$ పాలడబ్బా ఉప్పు.
1 చెంచా పసుపు.
3 పలాల చింతపండు.
2 చెంచాల మెంతులు.
$\frac{1}{2}$ పాలడబ్బా ఆవపిండి.
$\frac{1}{2}$ ,, మెత్తని కారం.
తగుమాత్రం ఇంగువ.
5 పలాల నూనె.

టొమాటోలను శుభ్రంగా కడిగి తడి లేకుండా తుడిచి కావలసిన సైజున ముక్కలు చేయాలి. చింతపండు గింజ, పుట్ట, పెంకు లేకుండా చూచుకొని, టొమాటో ముక్కలకు ఉప్పు, పసుపు వేసి కలిపిన తరువాత ఈ చింతపండును గట్టి వుండగా చేసి జాడీలో ఈ ముక్కల మధ్య పెట్టాలి. 1, 2 రోజులు ఊరనిచ్చి, చింతపండును విడిగా తీసి, ముక్కలను పిండి ఎండలో పెట్టవలెను. మంచి ఎండఅయితే ఒక్కరోజే చాలు. ఈ చింతపండును మెత్తగా నూరినతరువాత, ఇంగువను పొడిచేసి ఇంగవ పొడి, ఆవపిండి, కారం, మెంతులు కలిపి ఈ టొమాటో ముక్కలను, ఊటతో కలిపివేయాలి. ఇప్పుడే నూనెకూడా కలపాలి. కావాలని అనుకునేవారు అందులో మరి కొస్త నూనెవేసి పోపు కూడా పెట్టుకోవచ్చు. ఇదే టొమాటో ఊరగాయ; 5, 6 నెలలు నిల్వవుంటుంది. చింతపండుకు బదులు నిమ్మరసం కూడా వాడవచ్చు. తడిచేయి మాత్రం పెట్టకండి.

ఈ కొలతతోనే టొమాటో పండు వుపయోగించి పచ్చడికూడా చేసుకోవచ్చు. సుమారు 2, 3 నెలలు నిల్వవుంటుంది. అయితే ఇక్కడ అవపిండికి బదులు నవలాకు మెంతులు వేయించి పొడిచేసుకోవాలి. చింతపండుతోపాటు ఈ టొమాటో ముక్కలను మెత్తగా రుబ్బిన తరువాత పై మిశ్రమము (ఆవపిండికి బదులు మెంతి పిండి) కలపాలి. దీనికి తిరగమూత పెట్టాలి. ఈ పోపు ఫలిహారపు పోపులాగా వుండాలి.

కొాజ శారదాంబ, బిలాస్‌పూరు.



# పిల్లల ఫ్రాక్‌లకు బొమ్మలు

కె. నిర్మలా నాగ్

చిన్న పిల్లల ఫ్రాకుల పైన మామూలు పువ్వులు, ఆకుల బొమ్మలే కాకుండా వారి కిష్టమైన జంతువుల బొమ్మలు వేసి కుడితే పిల్లలకు సరదాగా ఉంటుంది. సాధారణంగా పెద్దవాళ్లకంటె కూడా పిల్లలకు పిట్టలన్నా, జంతువులన్నా ఇష్టం.

ఇవి అయిదేళ్లలోపు పిల్లల ఫ్రాకులపైన కుడితే బావుంటాయి. ఫ్రాకు ఫ్రిల్స్‌లో మడతపడిపోకుండా గాను తొడుక్కుంటే కనబడేటట్లు బొమ్మలు వెయ్యాలి. ఇవి చిన్నపిల్లల తలగడ దిండ్లపైన కూడా బావుంటాయి. ఇవి అప్లికో వర్కు అయినా, షాడో వర్కు అయినా చెయ్యవచ్చు. రెండూ తెలియనివాళ్లు మామూలు గొలుసు కుట్టులోనైనా చెయ్యవచ్చు. 'అవుట్ లైను' మటుకు కుట్టాలి. డిజైన్ల కన్న కూడా ఇవి తొందరగానూ అయిపోతాయి, అందంగానూ ఉంటాయి. ముఖ్యంగా పిల్లలు చాలా సరదా పడతారు.

ఫ్రాకు పైన బాగా కనిపించే కలర్‌తో ఇవి కుట్టాలి. ఉదాహరణకు నీలంరంగు ఫ్రాకుపైన పిచ్చుకలను పసుపు రంగుతోను, తెల్లగౌనుపైన బాతు నీలం రంగుతోను కుడితే అందంగా ఉంటాయి. కుందేలు, తాబేలు బొమ్మ గౌను కంటె తలగడపైన బావుంటుంది. కుందేలు నీలంరంగు, తాబేలు బ్రౌనురంగుతో కుడితే చూడడానికి బావుంటుంది. ★











# వనితా లోకం



## మార్పులు అవసరం

ఆంధ్ర సచిత్రవారపత్రిక దినదినాభివృద్ధి చెందుతున్నందుకు చాలా ఆనందంగా ఉన్నది. కాని ముఖ్యమైన మార్పులు కొన్ని మాత్రము తప్పక రావలసిఉంది. "వనితాలోకం" శీర్షికలో కేవలం ఊరగాయలు, పచ్చళ్ళు, సాంసారిక విషయాలే గాక సాంఘికవిషయాలు, అనగా నవలా పరిచయాలు, ప్రఖ్యాతపురుషుల జీవితచరిత్రలు వరుసగా పాఠకులకు అందజేస్తే బాగుంటుందని తోస్తుంది. ఆ శీర్షిక ద్వారా పైజెప్పిన విషయాలు ప్రచురిస్తే మీ (మన) పత్రిక ఇంకా అభివృద్ధిలోకి రాగలదని ఈ సూచన చేయుచున్నాను.

జె. సరోజా నాగరాజ్ (చిత్తూరు)

* * *

## మార్పులేని వ్యాసాలు

ఆడవాళ్ళ ఆగచాట్లు, ఆడవాళ్ళ అలవాట్లు, ఆడవాళ్ళ అవసరాలు, ఆడవాళ్ళ ఆస్తులు అవస్థలు, అత్తగార్లు ఆడబిడ్డలు, అప్పులు అద్దెకొంపలు, అతిశయాలు, ఆశయాలు, ఆదర్శాలు, అసూయలు, ఇంకా ఆడవాళ్ళ హక్కూ పెళ్ళూ, ఆరళ్ళు అడ్డంకులు, అబలలు అవివాహితలు, అంటురోగాలు, అనురాగాలు, ఆడవాళ్ళ అధికారాలు మిరియాలు, సర్దుకుపోవడాలు, ఆచారాలు, ఆనవాయితీలు, ఆధ్యాత్మిక చింతనలు, ఆత్మాభిమానం, అనుభవాలు, అర్హతలు, అనవసర ప్రసంగాలు ఇంకా అగ్గిపుల్లలు, ఆత్మహత్యలు అఘాయిత్యాలు……

ఆడవాళ్ళ అగచాట్లనుంచి ఆడవాళ్ళ అఘాయిత్యాలదాకా వచ్చిన వ్యాసాలు చదువుతూంటే నేటి తెలుగుసినిమాకథల్లాగ పేర్లు మార్చుకుని రంగులుపూసుకుని వస్తున్నట్లుగా ఉంది. పోనీ ఆడవాళ్ళకు కావలసినది అవే అనుకుందాం. అయినా అన్నీ ఒకే మూసలోపోసినట్లు, మక్కీకి మక్కీ కాపీ కొట్టినట్లు ఉంటున్నాయి. పోనీ చెప్పిందే చెప్పినప్పటికీ కొన్నైనా కొత్తపాయింట్స్ చేర్చి చెప్పదల్చుకున్నది కొంచెం నూతనధోరణిలో ఉంటే పాఠకులకు చదివేందుకు ఉత్సాహం కల్గుతుంది. ఈ పై కారణాలవల్ల వనితాలోకం చదవాలంటే "ఆ ఏముంది. ఎంతసేపూ ఆడవాళ్ళ అఘోరించడమేగా!" అనిపిస్తోంది, అని కొందరు అంటం వింటున్నాంకూడా! పైన చెప్పినవన్నీ పేర్లు కొంచెం అటూ ఇటూ మార్పుగా వచ్చినవే. కాదనలేరుకదా! కాదంటే నేను కొంచెం ప్రాసకోసం ప్రాకులాడాను.

ఇలాని అన్నీ పనికిరానివే పడ్డాయని నేననను. ఉపయోగకరమైనవీ వచ్చాయిగాని చాలా కొంచెం మాత్రమే. అవి వచ్చినంత విరివిగా ఇవి రాలేదు. ఇలా నిష్కర్షగా, నిష్పక్షపాతంగా చెప్పాలని తోచి (సదరు) సోదరీమణులు నా మీద విరుచుకుపడకుండా సహృదయంతో అర్థం చేసుకుంటారని తలుస్తున్నాను.

అన్నపూర్ణ (విల్లివాక్కము)

## కళ్యారా చూసిందే!

ఈ వారము (9-11 60) పత్రిక వనితాలోకము శీర్షికలో కమల లక్ష్మిగారు వ్రాసిన, "ఆడపెత్తనము—అఘాయిత్యము" చదివాను. వారు అన్నట్లుగా ఆడపెత్తనము ఎంత అఘాయిత్యానికి దారి తీస్తుందో నేను

## రేడియో కవర్లకు



—కె. విజయలక్ష్మి (ఇంకొల్లు)

వాకళ్ళారా ఎన్నో సంసారాల్లో చూశాను. అదుపూ, పొదుపూ లేకుండా ఆ సంసారము అధోగతిపాలవుతుందని చెప్పక తప్పదు. భర్త అధికారము క్రింద జరిగే సంసారములో ఉన్న సుఖశాంతులు భార్య చేతిక్రిందజరిగే సంసారములో ఉండవు.

మదనపల్లె రమణాదేవి (కడప)

* * *

9-11-60 వ తేదీ పత్రికలోని కమల లక్ష్మిగారు వ్రాసిన "ఆడపెత్తనం - అమాయిత్వం" చాల బాగుంది. సంసారము ఒడుదుడుకులు లేక సాఫీగా సాగాలంటే, స్త్రీకి నేర్పు చాల అవసరము.

స్త్రీ, తనభర్తకు అనుకూలవతియై, అతనికి కావలసిన సదుపాయములు చిరునగవుతో చేస్తూ, గృహాన్ని స్వర్గంగాచేయాలి. అంతే కాని భర్తపైన అధికారము చెలాయిస్తూ, సంసారాన్ని నరకంగా తయారు చేయకూడదు.

క్లిష్టసమయములలో తగిన సలహాలనిచ్చుట మంచిదేగాని, అన్నీ తాను చెప్పినట్లు చేయమనుట శోచనీయము. ముఖ్యంగా కమలగారు వ్రాసిన వ్యాసము పైచెప్పిన విధంగా, ప్రవర్తించు స్త్రీలకు బాగా బుద్ధివచ్చేటట్టు చేస్తుంది.

ఎ. యస్. పద్మావతి (పలమనేరు)

# వనితావాణి

## "స్త్రీజాతికే తలవంపులు"

9-11-60 వ ఆంధ్రసచిత్ర వారపత్రికలో 'ఆడపెత్తనం అమాయిత్వం' అన్న వ్యాసం చదివాను. వనితాలోకం శీర్షిక వనితల విజ్ఞాన, అభివృద్ధికోసం, వనితల యొక్క కష్టసుఖములు, ప్రస్తుతపు స్థితిగతులు, అందరూ (ముఖ్యముగా మగవారు) గుర్తించి వనితలను గౌరవించుటకు తోడ్పడే ఈ పవిత్రమైన "వనితాలోకం"లో ఎందుకూ పనికిరాని ఈ చెత్తవ్యాసం వనితాలోకానికే తీరని కళంకము అనిపించింది.

పోతరాజు విజయలక్ష్మి (జగ్గయ్యపేట)

* * *

## వరసలూ-నెరుసులూ

2-11-60 పత్రికలో నందూరి రాజ్యలక్ష్మిగారు వ్రాసిన "వరసలూ-నెరుసులూ" అన్న వ్యాసం నన్ను కదిలించింది. వరుసలు పెట్టకంట్లో నెరుసుల్లా తయారయ్యే వనితల్ని ధైర్యంగా విమర్శించిన అక్కయ్యకి నాధన్యవాదాలు.



"వదినగారూ" అంటూ వెనకాల గోతులు తవ్వేవాళ్లు "చెల్లాయీ" అని పిలుస్తూ ఆ పవిత్రపదానికి కళంకం ఆపాదించే పుణ్యాత్ములు కోకొల్లలు.

అంతేకాదు డబ్బును ప్రేమించినట్లు మానవత్వాన్ని మనవాళ్లు ప్రేమించలేరేమో అనిపిస్తుంది నాకు.

కుమారి బొమ్మకంటి హేమలత (తాటిపాక)

* * *

## కోటు అల్లిక

శ్రీమతి విశాలాక్షీరావుగారూ, మీ రు ఇచ్చిన ఊలుడ్రెస్సులలో మేజోళ్ళు, టోపీ మిటెన్సు అల్లినాను. చాలచక్కగా కుదిరినవి. కోటు అన్ని భాగాలు మీరిచ్చిన రీతిగానే అల్లినాను. ఈ విడి భాగాలు ఒక పుల్లపై తీసుకొన్న మొత్తము 249 కుట్లు ఉన్నాయి. ఇప్పుడు మీరిచ్చిన 1 వరుస అల్లిక వస్తుంది. ఇక్కడ నాఅల్లిక ఆగిపోయినది. అల్లవలసిన మొదటిలైను సీదా వైపు వస్తుంది. ఈఐదు విడిభాగాలు ఎలా అల్లవలెనో తిరిగి విపులంగా వ్రాస్తారని ఆశిస్తున్నాను. ఆఖరికి మీరు తెల్పినట్లు 198 కుట్లు వచ్చునట్లు ఒక్కొక్క భాగము అల్లిక తెల్పెదరని ఎదురుచూస్తూ ఉంటాను.

శ్రీమతి సత్యనారాయణ (మద్రాసు)

* * *

## సరళ సలహా

ఈ వారం, అంటే 9-11-60 పత్రికలో, సరళగారి సలహా చాలా బాగుంది. "ఉన్నదున్నట్టు కొందరితోనే, కొన్ని పరిస్థితుల్లోనే అనాలి. అది, అన్నిచోట్లా మంచిది కాదు" అన్న, వారి అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవించాను. వారన్నట్లు, నిజంగా, ఈ వ్యవహారిక జగత్తులో మనం మసలుటకు, ఎంతో నేర్పు చాలా అవసరం అని గ్రహించాలి. ఇప్పటికే చాలా లోటుగా ఉంది. ఇకనుంచి ప్రతివారం సరళగారి సలహాలు మాకు అందచేస్తారనుకుంటా.

వి. సరోజినీదేవి (ఉయ్యూరు)

* * *

## మొటిమలకు మందు

నేను చాలా రోజులనుంచి మొటిమలతో బాధపడ్డాను. చివరకు ఈ మందుతో తగ్గిపోయినవి.

దుంపపసుపుకొమ్ము (అనగా లావుగా ఉండేది) కొంతికొమ్ము, రెండు సమానమైన గంధం చిక్కగా ఉండేటట్లు అరగతీసి, రాత్రిపూట, రాసి పడుకొని తెల్లవారి కడిగేయవలెను. నాకు నాలుగురోజులు రాసేటప్పటికి బాగా తగ్గిపోయినవి.

పి. లలితకుమారి (కవుతరం)



## పాకశాల

# ఫ్రూట్స్ పుడ్డింగ్

ఎస్. వి. యల్.
ప్రఫుల్ల కుమారి

కావలసిన వస్తువులు :—

4 అరటిపండ్లు.
2 బత్తాయిపండ్లు.
5 తు॥ ఎండుద్రాక్ష.
1 గ్రుడ్డు.
2 చెంచాల కస్టర్డ్ పౌడర్ (3 రకాల పౌడర్లూ కలిపి)
1 శేరు పాలు.
పావుశేరు చక్కెర.

చేయువిధానం : మొదట అరటి, బత్తాయి పండ్లను వలిచి వాటిని కట్ చేసి చిన్న చిన్న ముక్కలుగా తయారయిన తరువాత వీటి యందు చక్కెరవేసి ఒక ప్లేట్‌లో పెట్టుకొనవలెను. కోడిగ్రుడ్డు కొట్టి ఒక గిన్నెలో వేసుకొని, ఇందు చక్కెరవేసి ఆమ్లెట్ కి గిలకరించినవిధంగా బాగా కలియబెట్టాలి ఫోర్కుతో. తరువాత కస్టర్డ్ పౌడర్ (మూడురకాలు కలిపి) 2 పెద్దస్పూనులు, పైన కలియబెట్టిన చక్కెరపాలయందు వేయవలెను. ఇందులో మొదట ప్లేటులో ఉంచుకొన్న చక్కెరకలిపిన పండ్లముక్కలను వేసి కలియబెట్టి ఈ గిన్నెను సన్నని మంటలో పెట్టి గరిటెతో ఇదంతయూ చిక్కబడు వరకు కలియబెడుతూనే ఉండవలెను. ఈ కలియబెట్టడంలో ఏమాత్రం అశ్రద్ధ చూపినప్పటికీ ఉండలుకట్టి ఫ్రూట్స్ పుడ్డింగ్ చెడిపోవును.

ఈవిధముగా కొంచెం చిక్కబడినతరువాత ఎండుద్రాక్ష వేరేపాత్రలో నేతిలో వేపి ఇందు వేయవలెను. బాగా చిక్కగ అయినతరువాత ఈ ఫ్రూట్ పుడ్డింగ్‌లో లైట్‌గా కలరింగ్ పౌడర్ వేసి పొయ్యిమీదినుంచి దింపివేయాలి. బాగా చల్లారనిచ్చి యీ ఫ్రూట్స్ పుడ్డింగ్‌ను రిఫ్రిజిరేటర్ వున్నవారందుంచుకొంటే చల్లగా అయి ఐస్‌క్రీమ్‌లా కమ్మనివాసనతో ఎంతో రుచిగా ఉంటుంది. రిఫ్రిజిరేటర్ లేనివారు కొద్దిగా ఐస్ ఫ్రూట్స్ పుడ్డింగ్ గిన్నెలో వేసి చల్లబడినతరువాత ఈ ఫ్రూట్స్ పుడ్డింగ్ తినవలెను. ఎక్కువ ఐస్ వేసిస్తే ఫ్రూట్స్ పుడ్డింగ్ నీరునీరులా ఉండి రుచి తగ్గుతుంది. కాబట్టి చాలా తగుమాత్రమే ఐస్ ఉపయోగించాలి. దీనిని భోజనమైన వెంటనే తింటారు. దీనినే "ఫ్రూట్స్ చాట్" అని కూడా అంటారు.

# బ్రెడ్ పుడ్డింగ్

కావలసినసామాను :—

4. గ్రుడ్లు.
1 పౌను రొట్టె (బ్రెడ్).
పావుసేరు కోవా.
5 తు॥ క్రిస్‌మిస్ పండ్లు.
3 తులముల సారపప్పు.
2 తులముల బాదంపప్పు.
2 తులముల కిస్తాపప్పు.

పైనచెప్పినపౌను బ్రెడ్ స్లైసులు నేతిలో వేపినతరువాత, దీనంత ఎత్తు చక్కెర, ఇందులో సగంఎత్తుచక్కెర తూకంప్రకారం ముందే ఉంచుకొనవలెను.

చేయువిధానం : నీళ్ళలో చక్కెరవేసి పొయ్యిమీదపెట్టి చిక్కనిపాకంలా తయారుచేయాలి. తరువాత బ్రెడ్‌ను సన్నని నాలుగు పలకలు స్లైసుల్లా కోసి పెనంపై నేయివేసి దోరగా వేపాలి. ఈ వేగిన స్లైసుల్ని వేరొక పెద్దపళ్లెంలో ఉంచి ఇందు బాగా యివి మునుగువరకు పాలుపోసి బాగానాననీయాలి. ఎక్కువసేపుస్లైసులు పూర్తిగా నానినతరువాత వీటిమీద మొదట తయారుచేసి ఉంచుకొన్న పాకమంతా పోయవలెను. స్లైసుల చుట్టూ పాకం బాగాపట్టునట్లు అట్లకాడతో జాగ్రత్తగా కలుపవలెను. అప్పుడు పావుశేరు కోవాను కొద్దిపాలల్లో చిక్కగా కలిపి దీనిని స్లైసుల కటుయిటు బాగా రాయవలెను. అప్పుడు ఈ పళ్లెమును బొగ్గుపొయ్యిమీద పెట్టి మూతవేసి నెమ్మదిగా ఉడికిన తరువాత దింపివేసి ఆ వేడి తగ్గకముందే, క్రిస్‌మిస్, బాదం, యాలక, కిస్తాపప్పు ఇవన్నీ నేతిలో దోరగా వేయించి ఇందు కలుపవలెను. ఈ పుడ్డింగ్ వేడిమీద తింటె చాలా రుచిగా ఉంటుంది. చల్లారిన తరువాతయినా బాగానే ఉంటుంది. దీనినే "డబుల్ మీటా" అని కూడా అంటారు.

# ఎగ్ పుడ్డింగ్

కావలసిన వస్తువులు :—

6 కోడిగ్రుడ్లు.
మూడు పావుశేర్ల పాలు.
7 పెద్దస్పూనుల పంచదార.

చేయువిధానం : ఇది చేయుట చాలా సులువు. గ్రుడ్లు బాగా ఫోర్కుతో కలియబెట్టాలి. పాలయందు పంచదారవేసి బాగా కలిపి ఇందు మొదట కలియబెట్టిన గ్రుడ్డుసొనను కలిపి గట్టిమూతగల గిన్నెలో పోయవలెను. తరువాత పొయ్యిమీద ఒక పెద్ద గిన్నెలో నీరుపోసి, నీరు సలసలాడునపుడు పాలు, గ్రుడ్లు, పంచదారా కలిపి ఉంచుకొన్న గిన్నెను ఇందు పెట్టి మూతపెట్టవలెను. అప్పుడు నీటియావిరిమధ్య చాలాసేపు ఉడికినతరువాత గిన్నెను తీసి చల్లారబెట్టవలెను: ఇట్లు తయారయిన "ఎగ్ పుడ్డింగు" జున్నులా ఎంతో రుచికరముగ ఉండును. దీనినే "క్రస్టర్డ్ పుడ్డింగ్" అనికూడ అంటారు.

## సరళ సలహా!

అరువు – పరువు!

ఇవి రెండు ధ్రువాలు! దక్షిణోత్తరాలు. ఈ రెంటి అవసరమూ జీవితంలో ఎంతో ఉంది. అరువు పుచ్చుకుంటే పరువు పోయితీరుతుంది. పరువు నిలవాలంటే అరువు పుచ్చుకోరాదు.

చీటికీ మాటికీ అతివలు పక్కయింటి పిన్నిగార్లని పూలవాడి కివ్వాల్సిన అణా నించీ, నాలుగు పావులబ్బాల బియ్యంమీదుగా, మధ్యమధ్య కాస్సేపు చూసి మళ్ళీ ఇస్తామనే వారపత్రికతో సహా ఎరువు నగలదాకా అరువు అడుగుతునే ఉంటారు.

దీనంత చెడ్డఅలవాటూ, దీనికిమించినదీ కూడా ఇదేనని ఇచ్చేవారికి తెచ్చేవారికీ కూడా బాగా తెలుసు.

ఉన్నమ్మ ఇవ్వనూ రాదు. లేనమ్మ అడగనూ రాదు. ఇదే సాగుతే వారు పీరవుతారు అనతికాలంలో.

# కోతి

కలువకొలను సదానంద




కోతి-బుద్ధిగా, ఒకచోట కూర్చుని వుండడమో, అల్లరి లేకుండా నెమ్మదిగా వుండడమో - ఎవరైనా చూశారా? ఎవరూ చూసివుండరు. కోతి మహా అల్లరి. కొమ్మ మీదికి గెంతుతుంది. ఊడ పట్టుకొని జారుతుంది. పిల్లిమొగ్గ వేస్తుంది. కిచకిచలాడుతుంది. వెక్కిరిస్తుంది. పరుగెత్తుకెళ్ళి ఆకుల్లో దాక్కుంటుంది. వెంటనే మళ్ళీ యివతలకి పరుగెత్తుకొస్తుంది. అది ఒకచోట వుండదు, దానికి ఒక పనిలో నిమగ్నత వుండదు. దానిది నిలకడలేని స్వభావం. ఔనా?... ఇక కథ చదవండి.

*　　*　　*

అనగనగా ఒకయోగి. అతని పేరు సువర్ణయోగి. సువర్ణము అంటే బంగారం కదా; సువర్ణయోగి దగ్గర మామిడికాయంత బంగారం వుంది. అతనిదగ్గర అంత బంగారం వున్న విషయం అతని శిష్యుడికి తెలియదు.

గురుశిష్యు లిద్దరూ వూరూరు తిరుగుతుంటారు. ప్రతి పుణ్యక్షేత్రాన్ని దర్శిస్తూ వుంటారు. ప్రతి తీర్థంలోనూ మునుగుతుంటారు. కనిపించిన ప్రతివింతా చూస్తారు. ఒక ఊరినుండి మరోవూరికి సాగిపోతుంటారు.

ప్రతిరోజూ ఉదయం సువర్ణయోగి కాలకృత్యాలు తీర్చుకొని, స్నానమాడి, సంధ్యావందనం ముగించి — శిష్యుడిచేతికి గురివెందగింజంత బంగారమిచ్చి అమ్మికు రమ్మంటాడు. శిష్యుడు దాన్ని అమ్మి, వంటకు కావలసిన సరుకులంతా కొనుక్కొచ్చి వంటచేస్తాడు.

గురువుగారి కింత పెడతాడు. తానింత తింటాడు.

ఇలా వుండగా — శిష్యుడికి ఒక్క గొప్ప సందేహం పట్టుకుంది. ఈ సువర్ణయోగి రోజూ గురివెంద గింజంత బంగారమిస్తాడే; ఈయన కింత బంగార మెక్కడిది? దీని అంతు కనుక్కోవాలి...

ఓరోజు గురువుగార్ని అడిగేశాడు "స్వామీ! ఇలా అడుగుతున్నందుకు నా అవివేకాని క్షమించాలి. రోజూ మీకు గురివెందగింజంత బంగారం ఎక్కడి నుండి వస్తుంది?" అని.

గురువుగారు ఆలోచించారు. బంగారం చాలా ప్రమాదకరమైన వస్తువు. బంగారంమాట వినగానే మనిషి—పాప పుణ్యాలు, మంచి చెడ్డలు అన్నీ మరచిపోతాడు. మనిషికి ఉన్నవి రెండుకళ్ళు. ఇవిరెండు గాక మనకు కనబడని కన్ను మరొకటివుంది. అది జ్ఞాననేత్రం. ఆజ్ఞాన నేత్రం లేకపోతే మనిషి అజ్ఞాని అయిపోతాడు. బంగారంమీది మమకారం ఆ మూడో కన్నును పాడి చేసి, మనిషిని గుడ్డివాణ్ణిగా చేసేయగలదు.

అందుచేత నిజం దాచడం— గురువుగారికి తప్పనిసరైంది. తన శిష్యుడేమో నమ్మదగినవాడే; అయినా—తన బంగారాన్ని దొంగిలించబోడనీ, తన ప్రాణాలకే ముప్పు తలపెట్టడని నమ్మకమేముంది?...

గురువుగారు ఒక అబద్ధమాడేశారు. "శిష్యా! నాకు బంగారం తయారుచేసే విద్య తెలుసును. రోజూ. మన అవసరాలకు సరిపోయేంత బంగారం మాత్రం తయారు చేస్తుంటాను."

# కోతి

ఆ రోజునుండీ శిష్యుడు గురువుగారికి అంగరక్షకుడైపోయాడు. ఆయన కాలితో చేయమన్న పని చేతితో చేసేవాడు. అతనికాళ్లుపట్టేవాడు. ప్రక్కన నిలబడి విసన గ్రతో విసిరేవాడు. కాళ్లు కడిగి కళ్ళ కద్దుకొనేవాడు. దూరంగా కొండమీదశిష్యుడున్నాడనుకోండి. గురువు 'శిష్యా' అని కేక పెట్టాడంటే—ఆ కొండ తిరిగి 'శిష్యా' అంటూ ప్రతిధ్వనిస్తుంది. శిష్యుడు ఆ ప్రతిధ్వనికన్నా ముందుగా 'గురువుగారూ' అంటూ పరుగెత్తుకొచ్చేసేవాడు. గుళ్ళో దేవుడు మనకందరికి దేవుడు. శిష్యుడికి గురువుగారే దేవుడు. కంటికి కనురెప్ప ఎలాగో, యోధుడికి కవచ మెలాగో గురువుగారికి శిష్యుడూ అలాగే!... గురువుగారి అనుగ్రహం సంపాదించాలి; అతనినుండి బంగారం తయారుచేసే విద్య నేర్చుకోవాలి; తరువాత ఒక బంగారువాడ నిర్మించెయాలి. ఆ వాడను తాను ఏలుకోవాలి! ఇలాంటి కోరికలు మరెన్నో కలిగాయి అతనికి. బంగారం తయారు చేయడ మెలాగో నేర్పక ముందే గురువుగారు ఎక్కడ గుటుక్కుమంటాడో అన్న భయం కూడా వుండేది.



ఒకనాడు గురువుగారు శిష్యుడితో — "నాయనా! ఇన్నాళ్ళూ నువ్వుచేసిన శుశ్రూషకు నాకు చాలా సంతోషమైంది. ఇక నేను కాశీకి వెళ్ళిపోవా లనుకుంటున్నాను. నానుండి నీకేమైనా కావలసివుంటే అడుగు; ఇస్తాను!" అన్నాడు.

శిష్యుడు వినయంగా చేతులు నలుపుకుంటూ - "నాకు బంగారం చేసే విద్య నేర్పండి!" అన్నాడు

ఇదివిని సువర్ణయోగి గుడ్లు తేలవేశాడు. అతనికి ఆవిద్య తెలిస్తేగా? కాని - ఆ విద్యనేర్పందే - శిష్యుడు తన్ను వదిలిపోడు. కాసేపు ఆలోచించగా అతనికి ఒక ఉపాయం తోచింది.

"శిష్యా! బాగా పసరువచ్చే ఒక ఆకుపేరు చెప్పు" అన్నాడు.

"చిక్కుడు ఆకు" అన్నాడు శిష్యుడు ఆలోచించి.

శిష్యుడి చెవిలో ఏదో మంత్రోపదేశం చేశాడు గురువు. చేసి, "శిష్యా! ఇటుకరాయో, గులకరాయో ఏదో ఒకటి తీసుకో! చిక్కుడు ఆకును బాగా నలిపి, నేను చెప్పిన మంత్రం ఉచ్చరిస్తూ - రాతిమీద పసరు పిండు. ఆ రాయి కాస్తా బంగారమైపోతుంది..." అన్నాడు.

శిష్యుడు పరమానందభరితుడైపోయి, "ధన్యోస్మి" - అంటూ అతడి పాదాలు ముట్టుకున్నాడు.

"అయితే ఒక నియమం ఉంది" అన్నాడు యోగి.

"ఏమిటి?"

"నువ్వు బంగారం తయారు చేసే

టవ్వుడు కోతిని మాత్రం తలచుకోవద్దు..."

"తలుచుకుంటే?"

"బంగారం తయారుకాదు..."

"ఆ మాత్రం జాగ్రత్తపడలేనా?" అన్నాడు శిష్యుడు.

గురువుగార్ని కాశీకి సాగనంపి, చిక్కుడుతీగె ఎక్కడుందా అని వెతికాడు శిష్యుడు. చిక్కుడు పాదు కనిపించనే కనిపించింది. శిష్యుడు నదిలో శుభ్రంగా స్నానంచేశాడు. ఒక గంపెడు రాళ్ళు ఏరుకొన్నాడు. చిక్కుడాకులు నాలుగు త్రుంచాడు. తాను పాటించవలసిన నియమం జ్ఞాపకం వచ్చింది. కోతిని మాత్రం తలచుకోగూడదు. ఆ కొంతసేపూ కోతిని తలచుకోకుండా వుంటే బంగారం తయారైపోతుంది!... మంత్రం పఠించాడు. కోతిజ్ఞప్తికి వచ్చింది. శిష్యుడు తన్ను తాను హెచ్చరించుకున్నాడు..."అదిగో!- నియమం తప్పుతున్నావు. కోతిని మాత్రం తలచుకోకు..."

ఈ సారి కోతిని తలచుకోకూడదనుకుంటూ మంత్రం వుచ్చరించాడు. పసరు పిండాడు. రాయి రాయిగానే వుంది.

ఒకరు — ఒరేయి, మొన్న నువ్వు ఆగ్రా వెళ్ళినప్పుడు తాజ్ మహాల్ చూచావురా?

వేరొకరు — చూద్దామనుకున్నాను కాని చూడలేదురా.

ఒకరు — ఎందుకు చూడలేదు?

వేరొకరు — నేను వెళ్ళినప్పుడు తాజమహాల్ ఊళ్ళో లేదని వాళ్ళమ్మ చెప్పిందిరా.

—వి. రామారావు (కాకినాడ)



మన బాలల పర్వదినం జవహర్‌లాల్ జన్మదినం

"ఛీ! పాడుకోతి! కాస్సేపు జ్ఞాపకానికి రాకుండా వుండలేదే..." అని తిట్టుకున్నాడు.

నోరు నొప్పిపెట్టేదాకా మంత్రం చదివాడు. చిక్కుడుపాదు ఖాళీ అయిపోయేంతవరకు పసరు పిండాడు. నియమం పాటించాలనుకున్నాడు. కోతిని తలచుకోకూడదనుకున్నాడు. కోతి తలపుకు రాక మానలేదు. బంగారం తయారుకాలేదు. "కోతిజాతి నాశనం కానూ! కోతి అనే పదమే లేకుండా పోనూ"...అని విసుక్కున్నాడు. "ఈ రోజు కోతిని మరిచి పోతాను. రేపుకోతిని తలచుకోను!" అనుకున్నాడు.

రోజూ అతడు బంగారం తయారు చేయబోయేవాడు. అతని బుర్రలో 'కోతి' పొదిలేది. "గురువుగారు కోతిని తలచుకోకుండా ఎలా వుండగలిగేవారో?" అనుకునేవాడు. అతని కోరిక కోరికగానే వుండి పోయింది.

గురువుగారి విద్యాదానంలోని కిటుకును గ్రహించలేకపోయాడు శిష్యుడు...మనస్సు ఎటువంటిదో సువర్ణయోగికి తెలుసు. అది చంచలమైనది. దానికి నిలకడే లేదు. అందుకే గాబోలు — మనస్సును 'కోతి' అన్నారు పెద్దలు!

# పుష్పగంధి

బి. లక్ష్మీజ్యోతిష్మతి

పూర్వము పుండరీకమనెడి నగర మొకటికలదు. ఆ నగరమును రాజేంద్రుడను పేరుగల రాజు పరిపాలించుచుండెను. రాజేంద్రునకు చంద్రరేఖ యను భార్య కలదు. ఆమె చాల గుణవంతురాలు.

ఆ రాజదంపతు లిద్దరును సంపదలతో తులతూగుచుండిరి. కాని వారికి సంతానము లేదను లోపము దిగులుపుట్టించెను. ఆ ఇరువురు దంపతులును సంతానముకొరకు తపస్సుచేసిరి. కొన్నాళ్లకు వారి తపస్సు ఫలించి చంద్రరేఖకు రూపవతి యగు ఒక ఆడశిశువు కలిగెను.

రాజేంద్రుడు తనకు ఆడశిశువు కలిగినదని తెలిసిన వెంటనే జ్యోతిష్కులను పిలిపించి కుమార్తె జాతకమును వ్రాయించెను. ఆ జాతకములో పిల్లకు పెండ్లిఅయిన తొమ్మిదవదినము రాత్రి భర్తను ఒకబ్రహ్మరాక్షసుడు భక్షించునని కలదు. రాజు కుమార్తె జాతకమును విని దుఃఖించుచుండగా జ్యోతిష్కులు రాజుతో "మీరు విచారపడవద్దు. పిల్లకు పెండ్లి అయిన తరువాత మిమ్ములను పుణ్యాత్ము లెవరైన కాపాడుదురు" అని చెప్పిరి. రాజునకు జ్యోతిష్కులీవార్త చెప్పిన తరువాత చింతతగ్గి నగరమంతయు అలంకరింపజేసెను. రాజేంద్రుడు తన కుమార్తెకు పుష్పగంధి అని పేరుపెట్టెను. తన నగరములోని ప్రజల నందరను పిలిచి అందరికి విందుచేసెను.

కొన్నిదినములకు పుష్పగంధి పెద్దదైనది. పుష్పగంధి బాల్యములోనే నృత్య, వాద్యములను నేర్చుకొనెను. ఇట్లుండగా పుష్పగంధికి వివాహము చేయవలసిన వయస్సు వచ్చినది. రాజుకుమార్తెకు వివాహముచేసిన-చో అల్లుడు చనిపోవునని వివాహము చేయదలంచలేదు.

ఒకనాడు పుష్పగంధి జలక్రీడలాడుటకు సరోవరమునకు చెలికత్తెలతో పోయెను. అప్పుడు ఎచ్చట నుండో డేగ ఒకటి వచ్చి సరోవరములోగల తామరాకుపై వ్రాలెను. పుష్పగంధి డేగను పట్టుకొనవలెనన్న ఆశతో దానిదగ్గరకు వెళ్లెను. ఆ డేగ అచ్చటినుండి ఎగిరి ఒక చెట్టుకొమ్మపై వ్రాలెను. పుష్పగంధి డేగను పట్టుకొనుటకు చెట్టు దగ్గరకు వెళ్ళెను. ఆ సమయమున డేగను వెదకుకొనుచు ఒక రాజకుమారుడు అచ్చటికివచ్చెను. రాజకుమారుడు రాజకుమార్తెను చూచుచు డేగమాట మరచి పోయెను. ఇంతలో పుష్పగంధి చెలికత్తె ఒకతెవచ్చి ఆమెను ఇంటికి తీసుకొనివెళ్ళెను.

రాజకుమారుడు అక్కడనే కూర్చుండి ఎట్లైనను సరే ఆ రాజకుమార్తెను పెండ్లాడ తలంచెను. ఇంతలో ఆ రాజకుమారుని చెలికాడొకడు వచ్చి డేగ కనబడలేదా అని అడిగెను. అందులకతడు "డేగ కనబడలేదు. నీవు నాకొకసహాయము చేసెదవా" అని తాను చూచిన రాజకుమారిసంగతి తెల్పి "ఆమెను నేను పెండ్లాడవలెనని ఉన్నది. నీవు నా తండ్రియైన నందమహారాజుకీ విషయము తెలుప"మనెను. ఆ స్నేహితుడు అట్లేనని ఒప్పుకొని నందమహారాజుకీ విషయము తెలిపెను.

అందులకు నందమహారాజు సమ్మతించి రాజేంద్రునకు కబురంపెను. రాజేంద్రుడు తన కుమార్తె జాతకమును వారికి తెలిపెను. ఆ కబురు విని నందమహారాజు తన కుమారుడు వివాహమైన తొమ్మిదవ దినముననే చనిపోవునని ఎట్లైనను సరే ఈ వివాహము చేయ కూడదని తలంచెను.

ఆ రాజకుమారుని పేరు రత్నమండనుడు. ఈ విషయము రత్నమండనునికి తెలుపగా అతడు "ఆమెను తప్ప నేను మరొకరిని వివాహమాడ"ననెను. నందమహారాజు జ్యోతిష్కులను పిలిపించి రత్నమండనుని జాతకము వ్రాయించెను. ఆ జాతకములో ఇతడు మార్కండేయునివలె పెక్కు వర్షములు జీవించును. కనుక అతని కోర్కె నెరవేర్చుడని జ్యోతిష్కులు చెప్పిరి.

నందమహారాజు మరల రాజేంద్రునకు తాను సమ్మతించినట్లు కబురంపెను. రాజేంద్రుడు కూడ సమ్మతించెను. వెంటనే పుష్పగంధి రత్నమండనుల వివాహము అతివైభవముగ జరిపిరి. రత్నమండనుడు పుష్పగంధిని తన నగరము తీసుకొని పోయెను. ఆ నూతన దంపతులిద్దరును తొమ్మిదిదినములు సంతోష

ముగా గడిపిరి. తొమ్మిదవ దినము రాత్రి అతడు తోటలో విహరించుచుండగా దగ్గరగాగల ఒక వృక్షమునుండి "రత్నమండనా! రమ్ము. నాకాహారముగ రమ్ము" అను కేక వినబడగనే అతడు ఆ ధ్వని వచ్చు చోట చూడగా బ్రహ్మరాక్షసు డొకడు కనబడెను.

రత్నమండనుడు నుదుట వ్రాసిన గీత ఎవరును తప్పించలేరు కదా అనుకొనుచు బ్రహ్మరాక్షసుని దగ్గరకు పోయెను. రత్నమండనుడు "బ్రహ్మరాక్షసునితో నీవు చెప్పినట్లుగ నేను నీకు ఆహారముగ వత్తును కాని నేను మా తల్లితండ్రులతో చెప్పివచ్చెద"ననెను. అందులకు బ్రహ్మరాక్షసుడు రత్నమండనా నీవుపోయి రాకున్నచో భిక్షనడుగ వచ్చిన యతిథికి భిక్ష నిడక పొమ్మనెడి దుర్గతికి పోవుదువు అను శపథముచేసి వెళ్లుము అనెను.

అందులకు రత్నమండనుడు సమ్మతించి ఇంటికిపోయి తల్లితండ్రులను లేపి నేను బ్రహ్మరాక్షసునకు ఆహారముగ పోవుచున్నాను అని చెప్పెను. తల్లితండ్రులు కొడుకు చనిపోవుచున్నాడని ఏడ్చుచున్నారు. అతడు తల్లితండ్రులకు ధైర్యము చెప్పి భార్యదగ్గరకు పోయి "ప్రేయసీ! నీ జన్మఫలము నేను అనుభవమునకు రానున్నది. నేను బ్రహ్మరాక్షసునకు ఆహారముగ పోవుచున్నాను. ధైర్యముగ నుండు" మనెను. పుష్పగంధి "నన్ను ఇట్లు విడిపోవుటతగునా! నీవు వివేకివి, రాజకుమారుడవు. రాక్షసుడు సమ్మన్నమాత్రాన ఆహారమునకు పోవచ్చునా?" అనెను.

అందులకాతడు నేనుపోయి రాకున్నచో భిక్షనడుగవచ్చిన యతిథికి భిక్షనిడక పంపివేయు వాని దుర్గతికి పోదునన్న శపథము రాక్షసుడు నాచే చేయించె"ననెను. పుష్పగంధి "రాక్షసునికి అతిథుల యందు గౌరవము కలదన్నమాట" అనెను. పై వాక్యమునుబట్టి ఆమె కొక ఉపాయము తోచెను. ఆమె భర్తను ధైర్యముతో రక్కసునిదగ్గరకు పంపెను. అచ్చట బ్రహ్మరాక్షసుడు "రత్నమండనుడు నన్ను మోసముచేసినాడు, అతనిని కాక వారిపురమునందలి వారిని కూడ భక్షించెద"నని అనుచుండెను.

ఇంతలో రాజకుమారుడు రాక్షసుని దగ్గరకు వచ్చెను. ఆత్రుతతో రాక్షసుడు ఒకచేతితో రాజకుమారుని జుట్టుపట్టుకొని తలను పైకెత్తి అతని కంఠమును కొరికి రక్తము త్రాగవలెనని నోరు తెరచెను. ఇంతలో రాక్షసునకు "భిక్షాందేహి" అను కేక వినపడెను. బ్రహ్మరాక్షసుడు వెనుకకు తిరిగిచూచెను. అచ్చట ఒక రాకుమార్తె కనబడెను. ఆమె పుష్పగంధి.

బ్రహ్మరాక్షసుడు "ఆమెను నీవెవతవు? నీకేమి భిక్షకావలయు" నని అడిగెను. అందులకు ఆమె "నేను నందమహారాజు కోడలను. నాకు పతిభిక్ష కావలయు"ననెను. "సతికి పతిలేనిచో జీవితముగడచుట కష్టము కదా? కావున నాకు పతిభిక్ష నిడుము" అని పుష్పగంధి పలికెను.

రాక్షసుడు ఆమె మాటలకు ఆశ్చర్యపడి ఆమెతో ఇట్లనెను: "అతిథివచ్చినప్పుడు తినుటకు సిద్ధముగానున్న భోజనమును గూడ అతిథి కీయవలెను. కావున నీకోరిక ప్రకారము నీ భర్తను నీవు తీసికొని పొమ్ము. మీరిద్దరు దీర్ఘాయువులుగ నుండుడు" అని దీవించెను.

తోడనే బ్రహ్మరాక్షసుడు వికృతరూపమును వదిలి "నేను దేవేంద్రుని అనుచరులలో ఒకడను. శాపకారణమున నేను బ్రహ్మరాక్షసుని రూపము పొందితిని. మీవల్ల ఈనాడు నాకు శాప విమోచనమైనది. కావున నేను ఈనాడు దేవేంద్రుని సభకు పోవుచున్నాను." అని చెప్పుచు రాక్షసుడు అదృశ్యుడయ్యెను.

పుష్పగంధి, రత్నమండనుడు ఇంటికివచ్చిరి. తల్లితండ్రులు వారిని చూచి కౌగలించుకొనిరి. రాజేంద్రునకు, చంద్రరేఖకు అల్లుడు బ్రతికియున్న సంగతి తెలియగనే చాల సంతోషపడిరి. పుష్పగంధి, రత్నమండనుడు ఇట్లు పెక్కుకాలము సంతోషముగ జీవించిరి. ★

## మధురాపర్వము - 9

కరేణ కరమాకృష్య
తస్య కేశి నిషూదనః
భ్రామయామాస తం శౌరిః
ఐరావతసమం బలే॥
ఈశోపి సర్వజగతాం
బాలలీలానుసారతః
క్రీడిత్వా సుచిరం కృష్ణః
కరిదంత పదాంతరే॥

—విష్ణుపురాణం,

అతండు తద్వధం బొనరించువాడై యా క్షణంబ...

గీ॥ ఎగసి చరణపాతంబున మొగము దాచి
 విగిసి యొక దంతదండంబు బెట్టువెరికి
 నిలిచి వ్రజి వ్రజంబున నలఘునగము
 వేయుచాడ్పున దానన వ్రేసె శిరము.
కం॥ హరినఖరక్షతి బోలెడు
 హరికరగత దంత బహువిధాఘాతములన్
 బోరిబోరి పెల్లుగ నొఱలుచు
 గరి విణ్మూత్రములు దొరుగగా నిల్వ మొగ్గెన్,

—హరివంశము.

కంసుడు తిరిగి తన తమాషు పైకి వచ్చినాడు. దేవకితో అతడు ఏమి మాట్లాడినది తెలియక రంగస్థలం అంతా ఆగుబ్బు పడినది. ఔత్సుక్యము వెలార్చినది. కంసుడు తిరిగి సింహాసనమును అధిష్ఠించి కంచుకులవైపునకు కన్నులలో ఆజ్ఞగా చూచినాడు. ఆ ఆజ్ఞ యేమో వారికి అర్థమైనది. వారు ఆ ఆజ్ఞను పాలించుటకు లేచినంతలో వాదిత్రములు మొరసినవి. మల్లదుందుభులు చెలరేగినవి. ఆ తుములధ్వని అంతలో సద్దుమణగినది. అప్పుడు వారు చేతులలోని వెండిబెత్తములకు కుదలలోనున్న చిరుగంటలు ఘలంఘలలుగా ఎలుగెత్తి కంసుని యాజ్ఞను ఉచ్చైస్స్వరంతో వినిపించినారు.

“అడవులనుండి ఎవరో వచ్చినారట; అద్భుతశౌర్యులట; వారి పేరులు రామకృష్ణులట; వారిని మందలలోనుండి కౌతుకియై మహారాజు, మధురేశ్వరులు పిలిపించినారట; వారు ఎక్కడ వున్నారు? వారిని తోడితీసికొనిరండి; ఎడమాటలు వద్దు; అభిలేచ్ఛలు చేకూరేకాలం ఆసన్నమైంది. ఆ రామకృష్ణులను, ఆ వాసుదేవులను ఎక్కడ వున్నారో, తీసుకొనిరండి. ఇది మధురేశ్వరుని ఆజ్ఞ”.

ఆ ఆజ్ఞను వినగా సభ నిస్తబ్ధమైపోయినది. రాజు మల్లయుద్ధం ఏర్పాటుచేసినాడు. చాణూరముష్టిక భటులను రప్పించినాడు. వీరితోనా, వసుదేవుని పుత్రులు నియుద్ధం ఆచరించేది! ప్రేక్షకజనం అంతలో అద్భుతాక్రాంతం అయిపోయింది. అసలు ఈ కుఱ్ఱలు ఎట్లా వుంటారు? వారు ఎవ్వరు? వారి ఆకార రూపవిశేషాలు ఎట్టివి? ఈ ఊహలతో సమాజవాటంలోని ప్రేక్షకజనం ఔత్సుక్యమే రూపుదాల్చినట్లయిపోయింది.

అంతలో సమాజవాటద్వారంవద్ద ఏదో ఘర్షణ జరుగుతున్నది. కంసునిమంత్రి, మహామాత్రుడు, తానై కువలయాపీడాన్ని రంగవాటం ద్వారమునకు అడ్డముగా నిల్పినాడు. రంగవాట ద్వారంలో ప్రవేశించనున్న, యువకులు ఎవ్వరో, ఆ మత్తగజాన్ని, మార్గమధ్యముననుండి తొలగదీయమంటున్నారు. మహామాత్రుడు ఆ మాటలను విన్పించుకొనుటలేదు. ఆ అభిప్రార్థనమును పట్టించుకొనుటలేదు. ఆ ఘోరమత్తేభాన్ని వారిమీదకు ఉసికొల్పుతున్నాడు. సమాజవాటంలో హాహాకారాలు బయల్వెడలినాయి. కంసుడు ఆ హాహాకారములను విన్పించుకొనుటలేదు. ముఖమునందు చిరునవ్వులుగా రాజ పురుషులు కూర్చున్న దిక్కై చూచినాడు. అంధకుడు అతని కంటబడినాడు. ఆ అంధకుడు గూఢ మందహాసం చేస్తూ తనవంక చూచినాడు. కంసుడు వసుదేవుని దిక్కై చూచినాడు. ఆ వసుదేవుడు పరమ నిర్లిప్తునివోలె, అక్కడ జరుగుతున్నదేమియు తనకు పట్టుటలేదు వలె, కూర్చున్నాడు. అంతలో కంసునిదృష్టి దేవకి కూర్చున్న దిక్కునకు మరలింది. ఆ దేవకి దుఃఖసముద్రంలో వున్న సుందరపోతాన్ని పోలి కన్పించినది. యశోదను తన కన్నులతో కంసుడు పరామర్శించినాడు. ఆమె సమాజవాటమువద్ద జరుగుతున్న ఆగడమును చూచి కాబోలు, మూర్ఛ కూరినది. రోహిణి ఆమెను సముదాయించుచున్నది. కంసుని చూపులు అంతలో తనతల్లి మీద నిల్చినాయి. ఆమె విచిత్రమందహాసం చేస్తున్నట్లు కన్పించింది. అంగంలో దుఃఖము ఎంత వున్నదో, ఆనందమును అంత వున్నది. కంసుడు తనదృష్టిని తిరిగి సమాజద్వారము వైపునకు మరలించినాడు. మరలించినంతలో అతని చెవులకు ఎక్కడనుండియో దుందుభినిస్వనము, తూర్యధ్వనులు, సింహనాదములు విన్పించినాయి. కంసుడు అప్రతిభుడైనాడు. ఈ ధ్వనులు ఎక్కడివి? తనకుతక్క ఇతరులకు విన్పించుచున్నట్లు లేదే? ఆ ధ్వనులు ఆకాశతలమునుండి తనకు వినవచ్చుచున్నవి. కంసుడు ఒక్కసారి తల ఎత్తి ఆకాశమువంక చూచినాడు. అంతరాళగతులయిన దేవతలు, దేవతలతోడి ఇంద్రుడు, ఇంద్రుని తోడిఋషులు, అతనికి కన్పించినారు. వారు శ్రీకృష్ణదేవుణ్ణి ప్రోత్సహిస్తున్నారు. కువలయాపీడాన్ని వధించమని ప్రార్థిస్తున్నారు. “భగవన్! వీడు రిష్టుడనే రాక్షసుడు. తారకామయ సమయంలో కూలి, ఆ కూలిన క్రోధాన్ని పెట్టుకొని, ఇప్పుడు ఇక్కడ కంసునకు, కాలనేమికి, వాహనమై, కువలయాపీడమై జన్మించినాడు. వానిని వధించు. భగవన్ వానిని వధించు” అంటూ దేవతలు శ్రీకృష్ణదేవునకు విన్నవించుకుంటున్నారు. కంసునకు, అతీంద్రియశక్తిమంతునకు, కాలనేమికి, ఆ మాటలు శ్రవోగతాలు అవుతున్నాయి. అవి శ్రవోగతాలు కాగా, కంసుడు, కాలనేమి, సింహాసనం మీద

నుండి లేచి సింహనాదం చేసినాడు. ఆ కంఠధ్వని లోకభీకరంగా వుంది. వేయికంఠములు ఒక్కసారి మ్రోగినట్లువుంది. "మహామాత్ర! మహామాత్ర! కువలయాపీడాన్ని వదులు" అన్న ఆజ్ఞ అతని నోటి వెంటవలువడింది. ఆ ఆజ్ఞతో వెలువడిన అతని కంఠధ్వని సమ్యగ్ఘుషంబై ఘుర్ఘురంగా, భయంకరమై, దిగంతాలలో ప్రతిధ్వనించింది. దిక్కుంభినిభాని కువలయాపీడకుంభికుంభత్ విక్రమంతో రామకృష్ణుల మీదకు, సంకర్షణ వాసుదేవులమీదకు విజృంభించినది.

ఆ ఏనుగు గున్న తనమీదకు రాగా శ్రీకృష్ణుడు మందహాసం చేసినాడు. అగ్రజుణ్ణి చూచి మధురమైన మందహాసం చేసినాడు. "రామా! మామ ఇంకా కళ్లు తెరువలేనువలె వుంది. తానో ఇప్పుడు కృతాంతదంత నికటవర్తియై ఉన్నాడు. అది ఎరుగడు. ఎరుగక ఈ ఏనికగున్నను మనమీదకు ఉసికొల్పుతున్నాడు. సరే! ఈ వ్యవహారం ఇంతవరకు వచ్చింది. నీవు చూస్తూఉండు. నేను ఏమి చేస్తానో!" అని శ్రీకృష్ణదేవుడు తన రెండు బాహువులను ఆస్ఫోటించినాడు. ఆ బాహువులు అర్గళోపమములైనవి. వాటిని ఆయన ఆస్ఫోటనము చేయగా, ఘోరమైన ధ్వని పుట్టింది. ఆ ధ్వనిని విని మత్తగజం పెచ్చురేగి, తాలధ్వని చేస్తూ, శ్రీకృష్ణుని వున్నయెడకు కాలాంతకయామోపమంగా వచ్చిపడింది. అప్పుడు శ్రీకృష్ణదేవుడు ఒకవిచిత్ర చంక్రమణం చేసినాడు. అది అద్భుతంగా జరిగింది. ఆ ఏనుగు గున్నకు ఆయన కన్పించలేదు. విచిత్రంగా ఆయన అదృశ్యుడైనాడు. అది చూచి ఆకాశంలో అంతర్ధానగతులైన దేవతలు తిరిగి తూర్యములను, దుందుభులను, ఘోరన మ్రోగించారు. గజం సంక్రుద్ధమైంది. తనకు కనుపించక అదృశ్యుడైన శ్రీకృష్ణదేవుణ్ణి ఘ్రాణదృష్టితో వెదుకులాడింది. ప్రసహ్యమైనబలంతో తన తొండముతో శ్రీకృష్ణుణ్ణి పట్టుకొన్నది. భగవంతుడు ఆ ఏనుగ తుండమును అర్గలసన్నిభములైన తన బాహువులలో బంధించి మెలిపెట్టినాడు. ఏనుగు లోకభీకరంగా ఘీంకృతి చేసింది. వాసుదేవుడు అప్పుడు దాని తుండమును పట్టుకొని ఇరువదియైదు ధనస్సుల దూరము విసరివైచినాడు. కువలయాపీడం అదిరిపడింది. చెదరిన మనస్సును చిక్కబట్టుకొని అదుగుపాటుతో అరవిందదళేక్షణుడైన దేవకీనందనుని మీదకు మహామాత్ర ప్రచోదితమై విరుచుకుపడింది.

అంతలో కువలయాపీడ, కువలయాపీడజన్యమల్లపోరు ఘోరమైంది. చటులోగ్రశీకరచ్ఛటలు వెల్లుగా కాలదండ ప్రచండమైన తుండాన్ని ఎత్తి, అళికులఝంకారములు రేగగా, మదజలోత్కటములైన కటములు అదరగా, కనత్ అగ్నికణసముత్కరములను పెంచి, అత్యుగ్రమై అరుణేక్షణముల కాంతులు నిగుడగా, చలిత చామరశిఖాశీత్కారములతోడ, తతకర్ణతాడనధ్వనులు పరగగా, ముఖము క్రోధమయంగా బిగిసి, మేను పొంగించి, పదఘాతములచేత భూమిచలించగా, దీర్ఘదంతకాండములు ఉద్వృత్తి చూపగా, ఏనుగు, లోకభీకరంగా శ్రీకృష్ణదేవుని పైకి విజృంభించింది. శ్రీకృష్ణునకు గాని ఆ ఆటోపం చూడగా నవ్వు వచ్చింది. తన భుజాబలం చూపడకు కొండొకతడవు ప్రదర్శించాలన్న విచిత్రకౌతూహలం ఆయనకు కల్గింది. ఆ ఏనుగు తనమీదకు రాగా ఆయన కింకర్తవ్యతా విమూఢుడైనట్లు నిలుచుండిపోయినాడు. భయపడినట్లు నటించినాడు. ఏనుగు ఆయన్ను సమీపించింది. మేఘాన్ని పోలి గర్జించింది. శ్రీకృష్ణదేవుడు ఆ ఏనుగు కోపాన్ని రెట్టించడం కోసం కాబోలు క్ష్వేడిత ఆస్ఫోటిత ధ్వనులు చేశాడు. కరతాళ కాహ్వానము చేసినాడు. మత్తగజం విస్తుపోయింది. ఇది భయపడటమా? తన్ను భయపెట్టడమా? దానికి అర్థం కాలేదు. ఆ అర్థము కాని కోపంలో, భయంలో, తన శుండాదండాన్ని ఎత్తి శ్రీకృష్ణదేవుని వక్షస్థలాన్ని తాడించింది. ఆ భీకరమైన ఆ కరతాడనాన్ని భగవంతుడు కఠినమైన తన వక్షస్థలంపై కైకొన్నాడు. అది చూచి కంసాదులు సంతోషించినారు. రంగవాటంలో తూర్యములు, దుందుభులు మ్రోగినవి. అంతలో శ్రీకృష్ణదేవుడు లోకాద్భుతమైన విక్రాంతిని చూపినాడు. ఎగసి కొమ్ములు త్రొక్కి నిలుచున్నాడు. దక్షిణపాదాన్ని ఆ కొమ్ములపైన వుంచి, వామపాదంతో ఆ ఏనుగు కుంభస్థలాన్ని నొప్పించినాడు అంతలో తిరుగ ఉరికి వీపుపై ఎక్కినాడు. ఏనుగు తన తుండముతో అతనిని వేయుటకు విఫల



చిత్రకారుడు: జి. కృష్ణవినోద్ (హైదరాబాదు)

ప్రయత్నం చేసింది. ఆ హస్తాన్ని ఎత్తడమే దాని తప్పైపోయింది. ఎత్తిన హస్తిహస్తాన్ని భగవంతుడు తన హస్తములతో, గదియించి విచిత్రలంఘనంగా క్రిందకు ఉరికి, పిడికిళ్ళతో ప్రక్కలు నొగిల్చి, ఆ ఏనుగు దున్నను గారియబెట్టాడు. ఆ ఏనుగు అతని వున్న వైపునకు దిరిగింది. తుండాన్ని విడిపించుకొని, భయంకరమైన ఘీంకృతులుగా, ముందటి కాళ్లు ఎత్తి లోకభీకరంగా శ్రీకృష్ణదేవుని మీదకు పెల్లురేగింది. భగవంతుడు విచిత్ర చంక్రమణ సుందరంగా ఆ ఏనుగు కాళ్ళ సందునకు చేరినాడు. దాని ప్రయత్నమును వృధా చేసినాడు. లంఘనవేగంలో ఏనుగు ముందుకు పడగా, శ్రీకృష్ణదేవుడు వనకతోక పట్టుకొని, గిరికందర విలీనమైన భుజంగాన్ని గరుడుడు ఆకర్షించే విధంగా ఆకర్షించి, దిగ్గ త్రిప్పి విసరినాడు. కరటి ఉక్కళి మ్రొగ్గిపోయింది. కొమ్ములు ఘాతగా నిలువ గ్రొక్కుకుంది. దిగ్గన సంబళించింది. లేచింది. నిలుచుంది. క్రోధంలో మదధారలు గండములలో స్రవించింది. ఫుత్కార సీత్కారాలు చేసింది కడుబంత భయంకరంగా బృంహితాలు చేసింది. మహామాత్రుడు ఆ ఘోరగణ ప్రయత్నం చేత దానిని తిరిగి శ్రీకృష్ణదేవుని మీదకు నడిపించినాడు. అది ప్రగుణిత సంరంభంతో వాసుదేవుని పైకి విజృంభించింది. తొండంతో వేసింది. కొమ్ములతో చేరింది. మారి మసగినట్లు విజృంభించిన భగవంతుడు దానిని చీరికి కొనలేదు. అది సవ్యాపసవ్యప్రక్రమణంబుల తన మీదకు రాగా అపసవ్యసవ్యక్రమములుగా, దానిని తప్పుకొన్నాడు. అది రొప్పి కుప్పించి తన్ను ఎగురొత్తనగా, కర్కశుడై, మేచకాచల తుంగశృంగ సన్నిభమైన కుంభికుంభం వ్రక్కలై చెక్కలెగయ దురంత కల్పాంత జీమూత ప్రఘాత నిర్ఘాంత నిష్ఠురమైన ముష్టి సారించి ఊచి పొడిచినాడు. ఆ ముష్టి ఘాతంవలన ఏనుగు కుంభస్థలం పగిలి రాలిన రక్తసిక్త మౌక్తికముల చేత భూమికి సంధ్యారాగ రక్తతారకాచ్ఛన్నమైన ఆకాశంయొక్క అందాన్ని తెచ్చిపెట్టింది. గజం నిల్వలేకపోయింది ముందుకు మొగ్గతిల్లపడింది. దంతాలు భూమిలో పాతుకుపోయినాయి అమాత్య మహామాత్రుడు, ఇతరులైన గజరక్షకులు దానిని హెచ్చరించినారు. ఏనుగగున్న హెచ్చిన మచ్చరంతో రెచ్చిపోయింది భూమిలోనుండి దంతాలను పైకి లాగింది తొండము ఎత్తి ఘీంకృతి చేసింది. దిగ్గన లేచింది. చూచింది. త్రోసింది. నడిచింది. సంహారసమయ సముద్ర సంఘాత సంఘాతసముత్తుంగభంగసంఘటితమైనకులాచలాన్ని పోలితిరిగి శ్రీకృష్ణదేవుని కర్కశమైన ముష్టిఘాతాలకు గురి అయింది కట్టలుకముట్టింది. చెట్టకొన్న ముమ్మరంతో తిమ్మిరెలికొని చక్కదనాన్ని ఈసడించే ముఖసౌందర్యం కలవాణ్ణి, మందహాస సుందర వదనారవిందుణ్ణి, అరవింద నేత్రుణ్ణి, కొమ్ములతో చిమ్మింది. తొండంతో మోదింది. భగవంతుడు ఈసారి తప్పించుకో యత్నించలేదు. హస్తాహస్తిగా దానితో పెనగినాడు. కొమ్ములతో కుమ్మితే, బమ్మరపోక, కొమ్ములనుపట్టి ఏనుగు కనులు చిమ్మచీకటులుగా దిమ్మతిరుగునట్లు చిమ్మివైచినాడు. తదుపరి జాతిసర్పాన్ని పోలిన తుండాదండంతో మోదబోగా, అర్గళ సన్నిభమైన స్వీయబాహుదండములతో త్రుంచుకొని, నొప్పి, కట్టలుకతో పట్టి, నెట్టిన, మిట్టిపాటును, నట్టిడపని పెట్టినాడు.

# హరివంశము

గజం తోయదం అయితే శ్రీకృష్ణదేవుడు వాయువు అయినాడు. తోయదం ఏ విధంగా వాయుహతికి బాధచెందిపోతుందో, ఆ విధంగా గజాన్ని శ్రీకృష్ణదేవుడు బాధించినాడు ఏ విధంగాను శ్రీకృష్ణదేవుణ్ణి నొప్పించడం, బాధపెట్టడం ఏనిక దున్నకు చేతకాని పని అయిపోతున్నది. చేతకాక వ్యాకులపడుతున్నది. సంమూఢమౌతున్నది. ఊరికే ఘీంకృతులు చేస్తున్నది. ఆకాశంలో దేవతలు తూర్యాలు మ్రోగిస్తున్నారు. దుందుభులు మొరస్తున్నారు.

శ్రీకృష్ణదేవుడు ఇప్పుడు లోకభీకరమైన విజృంభణాన్ని చూపిస్తున్నాడు. ఏనుగు తనమీద కొమ్ములతో కుమ్మరాగా, ఆ కొమ్ములను పట్టుకొని, వంచి, నేలలో గుచ్చినాడు. ఏనుగు ఏమీ చేయలేనిదై పోయింది. దంతములు బాధగా వున్నవి. తాను జానువులు నేలమీద ఆన్చి బాధపడవలసి వస్తున్నది. ఆ ఏనుగు రోషం చావలేదు. ఘర్మాపాయ సమయంలో మేఘం వర్షించినట్లు అది మదాన్ని వర్షించింది. శ్రీకృష్ణదేవుడు దానితో పిల్లవాడు ఆడుకుంటున్నట్లు ఆడుకుంటున్నాడు. శిశులీలగా దానిని గారియపెడుతున్నాడు. అకుంఠిత కాలకంఠ భల్లభగ్నమైన పురాన్ని పోలి ఆ ఏనుగు మహత్వాన్ని కోల్పోతున్నది. సముద్రంలో చటులమైన ఝంఝానిలం తాకిడికి వికలం అయిపోయిన కలం పోలిక ఆ మదకలం బలం డక్కిపోతోంది. చిక్కిపోతున్నది. సుక్కి పడిపోతున్నది. శోభికరాన్ని పోలి, దానసలిల ధారావిరహితం అయిపోతోంది. విరహి ఆలోచనలాగా నిరంతర చిత్తజాత విగ్రహమై బాధ చెందుతోంది. గ్రహణకాలంలోవలె పరాధీన ఖరకరమై తేజస్సు తగ్గుతోంది. ఖరకరోదయాన్ని పోలి భిన్నపుష్కరం అయిపోతోంది. పుష్కర వైరి విలసనాన్ని బోలి అభాసిత పద్మకమై చెన్ను తరుగుతోంది.

భగవంతునకు దానిమీద కరుణ జనించుకు వచ్చింది. కంసుని మీద ద్వేషం అధికమౌతూ వచ్చింది. తన ఒక్క ప్రాణం కోసంగా ఈ కంసుడు ఎన్ని ప్రాణాలనో హరించినాడు. ఇప్పుడు ఈ ప్రాణం యమయాతన పడుతున్నది. అనుకున్నంతలో భగవంతుడు పొంగిపోయినాడు. ఆ పొంగిపోవుటను చూచి దేవతలు దుందుభులు మ్రోగించినారు. కంసుడు నిస్తబ్ధుడైపోయినాడు. తన అనుంగు నెచ్చెలి కొండ్రలో ఇంకో ప్రాణం ఇప్పుడు హరించబడుతున్నది. కంసుడు స్తంభభావాన్ని పొందినాడు. శ్రీకృష్ణదేవుడు విజృంభణం చూపించినాడు. ఒక్క ఎగురు ఎగిరి ఏనిక దున్నమోమును తన్నినాడు. ఆ పాదాన్ని ఆలాగున నే నిలిపి వుంచి, బిగిసి, రెండు బాహువులను ఆస్ఫాలించి సింహనాదం చేస్తూ, కంఠీరవేకేంద్రాకృతి తాల్చినట్లు భయంకర వృత్తి నవలంబించి, వామహస్తంతో ఒత్తిపట్టి, దక్షిణహస్తంతో, ఆ ఏనికగున్న వామదంతాన్ని ఉత్పాటించినాడు. ఆ దంతముతో నే దానిని చితుక అదిమినాడు. ఇంద్రుడు వజ్రంతో అలఘునగాలను కూలుస్తున్నట్లు ఆ విక్రమక్రీడ ఒప్పుమిగిలింది. ఆ ఏనుగు మరణయాతనలో ఘోరంగా ఘీంకరిస్తూ, శకృన్మూత్రాలు విడుస్తూ, నేలకూలింది. కృష జర్ఝరితాంగమై, కుంజరము ఆర్తచేతస్సమై, కటములనుండి శోణితములు స్రవించగా, నేలకూలి గిలిగిల తన్నుకున్నది. శ్రీకృష్ణదేవుడు అప్పటికి పొంగు తగ్గినాడు. ఏనిక వాలాన్ని పట్టుకొని, శైలపుష్పార్థ సంలీనమైన మహోరగాన్ని వైనతేయుడు చంచువుతో ఆకర్షించినట్లు, దానిని మార్గమధ్యమున నుండి దూరముగా విసరివైచినాడు. తిరి దంతప్రహారముల చేత దానిని గారియపెట్టినాడు. చివరకు అది భయంకరమైన ఆర్తనాదం చేస్తూ ప్రాణాలను వదిలిపెట్టింది.

కువలయాపీడము చనిపోగా మహామాత్రుడు నీరవుడై పోయినాడు. పర్వతమంతటి ఏనుగును ఆ కుర్రవాడు అట్లా కూల్చడమే అతనికి అద్భుతాలలో అద్భుతమనిపించింది. ఇంతవరకు తాను ఆ కుర్రవాని లీలలను గూర్చి విన్నదే కాని కన్నదిలేదు. ఇప్పుడు ఆ విక్రమాన్ని కన్నులార చూచి, కోగుడైన మహామాత్రుడు తాను గూడ విక్రమించినాడు. శ్రీకృష్ణదేవుడు అతనిని గూడా ఒక్క ప్రహారణ మాత్రం చేత సంహరించి వేసినాడు. హస్తిదంత సంభిన్న శిరస్కుడై వజ్రభిన్నమైన అచలంలాగా కూలిపోయినాడు.

అంతలో గజపాద సంరక్షకులు పెల్లురేగినారు. సంకర్షణుడు ఆ ఏనిక దున్నకు మిగిలిన మరి ఒక్క దంతమును పెరిగి వారి పీచమణచివేసినాడు.

ఆకాశంలో దేవతలు మ్రోసిన దుందుభిధ్వనులతో దిక్కుహరాలు పిక్కటిల్లిపోయినాయి. ఆ దేవతలు ఆ మునులు, సంకర్షణ వాసుదేవులను అప్పుడు బహువిధాలుగా ప్రస్తుతించారు.

అప్పుడు శ్రీకృష్ణదేవుడు తిరిగి సింహనాదం చేసినాడు.

అది కంసుని ఎడదను విష్ణుచక్రపు అంచులను పోలి రాపిడి పెట్టింది.



# సినిమా

## వార్తాభరణం

ఎమ్. ఎస్. రామారావు పడవపాట తిరిగి ఇన్నాళ్ళకు- "తాసీల్దార్" తర్వాత- "చివరికి మిగిలేది"లో వినబోతున్నాము. శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి రచించిన ఈ కొత్త పాటను శ్రీ రామారావు పాడగా భరణీ స్టూడియోస్‌లో రికార్డు చేశారు. కొత్త "కోకిల" ముక్కామల సునంద, జమునారాణి పాడిన మరి రెండు పాటలుకూడా రికార్డు చేశారు. సంగీత దర్శకుడు అశ్వద్ధామ. ఈ మధ్యనే జ్యోతిపై ఒక నృత్య చిత్రీకరణ కూడా జరిగింది. రీరికార్డింగ్ ప్రారంభమైంది. నవంబర్ 25 వ తేదీన చిత్రం విడుదల కాగలదని తెలుస్తున్నది.

*　　*　　*

అన్నపూర్ణ పిక్చర్స్‌వారి తాజా తెలుగు చిత్రం షూటింగ్ దాదాపు పూర్తిఅయిన దశలో శాంతినూర్ డాన్సు, నాగేశ్వరరావు, సావిత్రి, గిరిజలపై ఒక్కపాట చిత్రీకరణ మటుకు మిగిలి వుంది. దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు. నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు.

*　　*　　*

బొంబాయిలో ఫిల్మాలియా ముఖర్జీ నడుపుతున్నటువంటి కొత్త నటీనటుల శిక్షణకేంద్రంవంటిది మద్రాసులో నిర్వహించేందుకు దక్షిణభారత ఫిలిం వాణిజ్యమండలి ప్రయత్నాలు ప్రారంభించింది. శ్రీ ఏ. వి. మెయ్యప్పచెట్టియార్ ఈ ప్రణాళిక ప్రధాన ప్రోత్సాహకులని తెలుస్తున్నది.

*　　*　　*

కేరళ సోదరీమణులందరు వెండి తెరనుంచి నిష్క్రమించనున్నారు. పద్మిని వచ్చే మార్చిలోగా ఫిలింరంగం నుంచి నిష్క్రమించి ఒక మలయాళీ వైద్యుని వివాహమాడి కేరళలో స్థిరపడదలచారు. ఏటా ఉత్తమ మలయాళీ నాటకానికి ఈమె తన పేర ఒకరోలింగ్ ట్రోఫీ నెలకొల్పింది. ఓనమ్‌లో త్రివేండ్రంలో మలయాళీ నాటక పోటీలు జరుగుతవి. రాగిణి వచ్చే జూన్-జులై ప్రాంతాల పరిణయమాడి సినిమాకు తుది వందనమర్పించనున్నారు వీరి అక్క లలిత యీవరకే పెళ్ళిపీట ఎక్కి, ఫిలింపీట దిగి, ఇప్పటికి ఇద్దరు పిల్లల తల్లిఅయింది. ఈమె లోగడ నటించిన "సెంతామరై" తమిళ చిత్రం త్వరలో విడుదల కాబోతున్నది. ★



అన్నపూర్ణావారి ఆరవచిత్రంలో నాయకుడు నాగేశ్వరరావు.

# బొమ్మ  బొరుసు

### బొమ్మ

మ డిఫిలింకట్-కటకటముందు కూడా చలనచిత్రాల నిడివి గురించి చాలా పొడుగుపాటి వాదాలు జరిగాయి; ఇపుడూ జరుగుతునే ఉన్నాయి. ఇటీవల పరిమితులు పెడుతూ నియమాలలాటివి వచ్చాయి. బెంగాలీ సినిమాకు 12 వేల అడుగులు చాలనీ, తెలుగు తమిళ చిత్రాలు మూడేసి మైళ్లుండవచ్చుననీ అన్నారు. ఇలా కాని స్తే పరిశ్రమ ధ్వంసమైపోతుందని కొందరూ, అద్భుతంగా బాగుపడి పోతుందని కొందరూ అన్నారు. సర్వదుఃఖాలకూ మూలకారణం జన్మమేనన్న బుద్ధ వాక్యాన్ని కొందరు పునఃపునః ఉదహరించి సినిమాలో దుబారాకూ, పొరబాటలకూ నిడివే కారణమన్నారు.

*  *  *  *

### బొరుసు

సినిమా తీసే జనాన్ని, చూసే జనాన్ని, వాళ్ళ అభిరుచులను, 'అవసరాలను' సాధకబాధకాలనూ, ఇప్పటి స్థితిగతులనూ లెక్కలోకి తీసుకొంటే, తెలుగు తమిళ చిత్రాలు కొన్ని నాలుగుమైళ్లైనా పొడుగుండకతప్పదు అని సినీమనీషులు కొందరన్నారు. అదీకాక నిడివిగురించి మూకవుమ్మడి తీర్మానాలు చెయ్యడం తగదు. అది కథనిబట్టి ఉంటుంది. తేల్చుకోవలసినది, దర్శకుడే అని వీరు అంటున్నారు. గిట్టనివాళ్ళంతా ఏకమై తిడుతున్న డాన్సులూ పాటలూ (అనవసరమైనవి ఉంటేగింటే) తీసేసినా, కథనిబట్టి నిడివి ఎక్కువ కావలసి రావచ్చు అని వాదిస్తున్నారు.

*  *  *  *

### బొమ్మ

మేము ముద్దుగా చెబుతున్నపుడు వినకపోతే దిగుమతి కంట్రోళ్ళు ఇంకా బిగించేస్తాం. ఆముచ్చట కూడా లేకుండా బలవంతాన తగ్గించుకోవలసి వస్తుంది అన్నారు కేంద్రమంత్రి.

*  *  *

### బొరుసు

అలా జరిగితే, ఇతర రంగాలలోలాగే ఇందులోనూ మార్గాంతరం ఉండనేఉంది. కావలసిన ముడిఫిల్ము "మార్గాంతరాల"ద్వారా వచ్చేస్తుంది అన్నారు అనుభవంగల ఒక వణిజుడు.

### బొమ్మ

రెండేళ్లలో ముడిఫిలిం ఫ్యాక్టరీ ఉత్పత్తి ఆరంభం అవుతుంది. అందాకా సాగా ఈ తగవులాట. ఆనక దిగుమతుల బెడదే ఉండదు. కావలసినన్ని మైళ్లి పొడగున తీసుకోవచ్చు అన్నాడొక ఆశాజీవి.

*  *  *

### బొరుసు

అందికే ఈ రెండేళ్ల ఇబ్బందీ దేవుడిచ్చిన వరంలాటిది. సినిమావారంతా హృదయపూర్వంగా ఈ ఇబ్బందిని భరించి దీని ప్రకారం "అనవసరపు నిడివి"కి వడిగట్టే అలవాటు పోగొట్టేసుకుంటే మనసినిమా పూర్తిగా మారి బాగుపడుతుంది. గొప్ప దవుతుంది అన్నాడొక దురాశాజీవి.

*  *  *

### బొమ్మ

ఫిలింపై ఎక్సయిజు మంకాన్ని, డిస్ట్రిబ్యూటర్లూ నిర్మాతలూ స్టుడియోవారూ కలసి సినిమాహాలు యజమానికి ఫిరాయించడం న్యాయంకాదు. అసలే సవాలక్షు "సాధకబాధకాలతో," పబ్లిసిటి ఖర్చులలో వాటాలతో, బయానాలతో వేగలేక అవస్థపడుతున్న ఎగ్జిబిటర్లకి ఇది తగనిభారం. మాకు ఏమాత్రమూ సంబంధం లేని వ్యవహారం అన్నారు ఎగ్జిబిటర్లు...

*  *  *  *

### బొరుసు

ఇంకానయం. పబ్లిసిటీ ఖర్చులన్నారు. పంకా చార్జీల గురించి కూడా చెప్పలేదు. నయమే. నాలుగు లక్షలు పెట్టుబడి పెట్టి నానా హైరాణాపడి తీసిన చిత్రం వసూళ్లలో, ప్రదర్శకుల వాటా ఎంతన్న మాట ఎవరూ ఆలోచించరు అన్నాడు నిర్మాత...

*  *  *  *

### బొమ్మ

చలనచిత్రాల విజయానికి కథబలంగా ఉండడమే ముఖ్యకారణం అన్నారు. పలువురు సినీమనీషులు ఇటీవల ఒక సభలో.

*  *  *  *

### బొరుసు

అయితేనేం. బలవంతమైన సర్పములా తయారైంది కథ. అందికే తెలుగు సినిమాలో కథ రచయిత లిందరగున్నారు. అని సరసుడు కాని ఒక క్రూరుడు చమత్కరించి తనే నవ్వి ఆనందించేశాడు.

*  *  *

### బొమ్మ

నటీనటులకు శిక్షణ కేంద్రాలు నెలకొల్పి అభినయం, ఆపైని వాచకం మొదలైన వాటిలో తరిఫీదు చేసి కొత్తజట్టును కట్టుకురావాలని ఒక పథకం వేశారు.

*  *  *  *

### బొరుసు

సంభాషణల విషయంలో శిక్షణను కొందరు ఒప్పుకోదలచుకోలేదు. మాట ఎబ్బెట్టుగా తమాషాగా ఉండడంవల్ల అమెరికన్ ఇంగ్లీషును ముద్దుగా మాట్లాడిన ఫ్రెంచితార నికోల్ మారే, తెలుగులో రాజసులోచన, బి. సరోజాదేవి బాక్సాఫీసు హిట్లయ్యారన్న సత్యాన్ని వీరు గుర్తుకు తెస్తున్నారు. 

## వార్తాభరణం

వీనస్ పిక్చర్స్‌వారి సాంఘికం 'పెళ్లి కానుక' రజతోత్సవాలను పురస్కరించుకొని నిర్మాతలు నవంబరు 6 వ మైలాపూరు ఉడ్‌లాండ్స్ హోటలులో సభజరిపి కళాకారులకు టెక్నిషియన్‌లకు ప్రదర్శకులకు బహుమతులిచ్చి సత్కరించారు. ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు 'విజయా'ధిపతి శ్రీ బి. నాగిరెడ్డి అధ్యక్షత వహించారు. పెళ్లికానుక తమిళ చిత్రం (కల్యాణపరిసు) లో ముఖ్య పాత్ర ధరించిన జెమినీగణేశన్ ఈ చిత్రంలో కళాకారులకు బహుమతులు పంచిపెట్టారు. శ్రీయుతులు బి.ఎన్. రెడ్డి, నాగయ్య, నాగిరెడ్డి ప్రభృతులు ప్రసంగిస్తూ చిత్రం ప్రజాదరణ పొందడానికి కథ పుష్టిగా ఉండడం ముఖ్యమన్నారు. పెళ్లి కానుక కథను సమర్థంగా ఆవిష్కరించిన యువదర్శకుడు శ్రీధర్, ఛాయాగ్రహణదర్శకుడు విన్సెంట్‌ల ప్రతిభను ప్రశంసించారు. తరువాత శ్రీధర్, ముఖ్యనటుడు నాగేశ్వరరావు కృతజ్ఞత తెలుపుతూ ప్రసంగించారు.

*  *  *

ఉదకమండలంలో ఫిలిం ఫాక్టరీ నిర్మాణానికి సన్నాహాలు చురుకుగా సాగుతున్నాయి. ఈ నిర్మాణంలో సహకరిస్తున్న ఫ్రెంచి కంపెనీ నిపుణులు, భారత ప్రభుత్వోద్యోగులూ గతవారం ఊటీ వెళ్లి ఫాక్టరీ స్థలాన్ని చూచి ఆమోదించారు.

ఎనిమిదికోట్ల ఖర్చుతో నిర్మించబడనున్న ఈ ఫాక్టరీలో సినిమా, ఎక్స్‌రే, ఫోటోగ్రఫీలకు కావలసిన ఫిలిం తయారవుతుంది. 1962 ఉత్తరార్ధంలో ఉత్పత్తి ఆరంభం కాగలదని తెలిసింది. 



చేతనా ఫిలిమ్సువారి "గుళ్లోపెళ్లి" లో కృష్ణకుమారి.

## నర్గీస్ పునరాగమనం

రెండేళ్ల క్రితం వివాహం జరగడంతో సినిమానుండి వైదొలగినట్లేనని అంతా అనుకున్నా, నర్గీస్ తిరిగి తెరను అలంకరించబోతోంది. ఆమె సోదరుడు అక్తర్ హుసేన్ నిర్మించబోయే చిత్రంలోనే ఆమె ఇపుడు నటిస్తుంది. ఈ చిత్రానికి సత్యేన్ బోస్ దర్శకత్వం వహిస్తారు. శంకర్, జైకిషన్‌లు సంగీతం సమకూర్చుతారు.

## చేసినపాపం కాశీకి వెళ్లినా

హైదరాబాదు సోషల్ అండ్ కల్చరల్ క్లబ్ (త్యాగరాయనగర్) నాటకరంగ భవననిధి సహాయార్థం, నవ్యకళానికేతన్ వారు ఈ 12 తేది సాయంత్రం శ్రీ కృష్ణగాన సభ హాలులో (త్యాగరాయనగర్) "చేసిన పాపం కాశీకి వెళ్లినా" అనే సాంఘిక నాటకం ప్రదర్శించారు. వేశ్యగా పుట్టినంతమాత్రాన ఉన్నతాశయాలులో పంచవనీ, కుల స్త్రీలుగా మారి సమాజంలో గౌరవనీయమైన స్థానం సంపాదించాలనే తృష వారికి సహజంగానే ఉన్నా, పరిస్థితులకు తల ఒగ్గక తప్పటం లేదనీ, రచయిత శ్రీ కొడాలి గోపాలరావు ఈ నాటకం ద్వారా చెప్పడానికి ప్రయత్నించారు. పడుపు వృత్తి నాగరకతకు సంస్కృతికి కళంకం వంటిది. ఈ కళంకాన్ని తుడిచివెయ్యడానికి విద్యావంతులు, ఉదారస్వభావులు, కృతనిశ్చయులు అయిన యువకులు ముందుకు రావాలి. అధికార, అనధికార సంస్థలు ఆ అభాగినులకు ఇతోధికంగా సహాయం చెయ్యాలి.

ఈ నాటకంలో శ్రీయుతులు శోభన్ బాబు, జి. యస్. ఆర్. కృష్ణమూర్తి, వి. ఆర్. భూసారపు, కె. సుబ్రహ్మణ్యచౌదరి, ఎం. కొండలరావు, ప్రసాద్, జనార్దనరావు కె. బి. అర్జునరావు, కుమారి ప్రమీలారాణి, కుమారి లక్ష్మి నటించారు. శ్రీయుతులు కొడాలి, వేణుగోపాల్ వ్రాసిన పాటలను నేపథ్యగాయకులు శ్రీయుతులు బి. శంకరరావు, జయదేవ్, శ్రీమతి పద్మప్రియ గానం చేశారు. ఔత్సాహికనటీ, నటబృందం కాబట్టి ప్రదర్శనం అత్యుత్తమంగా లేకపోయినా మొత్తంమీద బాగానే ఉంది.

ప్రదర్శనానికి ప్రముఖ చలనచిత్రనిర్మాత దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డి, పలువురు ఇతర ప్రముఖులు హాజరయ్యారు.

రంగస్థలం భవననిధికి శ్రీయుతులు బి. ఎన్. రెడ్డి, డి. ఎస్. శాస్త్రి, వి. కె. ఆర్. జయంతి, రామినీడు, జగ్గయ్యగారలతో ఒక సంఘం ఏర్పాటైంది. 

### లండన్‌లో భారతీయ చలన చిత్రోత్సవం

ఈ నెలాఖరున లండన్‌లో, బ్రిటిష్ ఫిలిం సొసైటీ ఆధ్వర్యాన భారతీయ చలన చిత్రోత్సవం జరుగబోతుంది.

ఈ నెల తొలివారంలో, పథేర్ పాంచాలీ చిత్రం అక్కడ షిన్నింగ్‌టన్ స్పెషల్ ఎవార్డ్ అందుకోవడంతో లండన్‌లో మన దేశం పేరు మరోమారు మారుమోగింది.

రేపు ఉత్సవంలో, జాగ్ తేరహో, సుధాపాశన (బెంగాలీ), జల్సాఘర్ (సత్యజిత్ రాయ్), హంపంచీ ఏక్ దల్ కే (ఎ. వి. ఎం.), గురుభక్తి (బాల చలనచిత్రసంస్థ), పరఖ్ (బిమల్ రాయ్) చిత్రాలను ప్రదర్శిస్తున్నారు. 

# గిరీశం లెక్చర్లు | జీవితం - సినిమా

సినీయిల్లు శాఖల్యగానా! నీ కెప్పుడూ ఒక్కలాటివేషాలే దొరకా! నీ పిక్చరికి ఒరిజినల్ మ్యూజిక్కు జమపడా! డబ్బు లేకుండా చూసి హీరోయిను కాల్షీటివ్వా! కొంపతప్పనేశావా! పాడును తగ్గించెయ్యడమే!! ఇంకేమన్నా ఉందా. నీ కిలాటి పిదకాలబుద్ధి లేలాపట్టుబడ్డాయయ్యా! ఇంతటిషిఫాయిచ్చాని కెలావడిగట్టావయ్యా! ఇంకా నయం. నాతో అన్నావు. ఇంకెక్కడా అనబోకు. నీసాత్రిన కాణీపెట్టి వేలం వేస్తే ఏగాణిగ్గోనడవదూను. అఖరికి నిడివి తెగ్గోస్తే దేశం బాగుపడుతుందని తెగ్గోసున్న మిస్టర్ మురార్జీ రాజాజీలుకూడా నీ కార్యాన్ని హర్షించ లేకనుకున్నావోగాని.

సంస్కరణలంటే మజాకా అనుకున్నారా. ఇవాళ చెయ్యి అనగానే రేపొద్దున్న చేసిపారేస్తే ఏంగాను. అన్నిపన్లూ అలా చకచక తెమిలిపోయారుకుంటే జనానికి మందకొడితనం వచ్చేస్తుంది. సంస్కరించడానికి దుబారాలూ, పరిష్కరించడానికి సమస్యలూకూడా హరికర్పూరంలా హరించిపోతాయి. కలికంలోకూడా లేకుండాపోతాయి. అప్పుడు నాయకులంతా ఏంగాను. గోళ్లు గొరుక్కుంటే మటుకు అవి ఎన్నాళ్లాటా స్థాయిటా! వాళ్ళ కాలక్షేపం ఉండదు. పత్రికలకి రాసింది కేంవుండదు. జనానికి చదివింది కేంవుండదు. పెద్దపెద్ద ప్రవక్తలు, కొదల్చుకున్న విమర్శకులు, ఇతర అడ్డైనవాళ్ళు తలకిమాసిన వాళ్ళూ ఒంటికాలిమీద లేచి తిట్టిపోసింధికి కేడీగా ఏ వుంటుంది? కాంగ్రెసు రాజకీయాల్ని లంచగొండితనాన్ని, సమకాలిక సాహిత్యాన్ని ఎంతకని తిడుతూ కూచోగలరు. వెధవది పాతపడ్డేటు. పైగా సాహిత్యాన్నేమన్నా అంటే సినిమావాళ్ళలా పడూరుకోరుగదా. వెధవాయిలూ చెత్తలాయిలూ మీ రుట్టి వెధవాయిలున్నండీ. మీకు మా రాత బోధపడ్డేదు న్నండీ పుటకవాళ్ళంతా బోడూడని వెధవాయిలే గదా! పుట్టబోయేవాళ్ళంత ప్రజ్ఞ మీకెక్కడేడిసిందిటా? మీకు మమ్మల్ని తిట్టిందికే గాక మెచ్చుకుందిగ్గూడా తాహతులేదున్నండీ. అని తిట్టిపోసారాయె. అంచేత సినిమానేనా దక్కించకపోతేయలా తిట్టుకుందికి. కనస్ట్రక్టివ్ క్రిటిసిజమ్ ఇహ దేనిమీద అఘోరిస్తాం జెప్పు.



'చివరకు మిగిలేది'లో సావిత్రి.

నీపాటి తెలివితేట లేకనేనా—మినిస్టర్లు గిల్లికజ్జాలు పెట్టుకుంటున్నారూ? వాళ్ళ న్నుంచి నేర్చుకోవచ్చు యంతైనా. రావకార్యాలన్నీ ఒక్కపెట్టున చక్కపెట్టి నిజంగానే ప్రభుత్వం చేసే పనల్లేసే పాలిటిక్సు అంతా డెడ్లాకౌచ్చెయ్యదూ. వాళ్ళు మాడు ఎంత పొదుపుగా పరిమితంగా చూడ ముచ్చటగా పోట్లాడుకుంటున్నారో. ఒక ఆర్డరుప్రకారం వంతు వేసుకుని రోజు కొక్కటంటే ఒక్క స్టేటుమెంటు అంతే. ఉన్నాయిగదా అని అన్ని స్టేటుమెంట్లూ ఒక్కపూటే ఇచ్చేదామనుకుంటే బాతూ బంగారుగుడ్డూ కథలా అయిపోతుందిగదా.

అంచేత మై డియర్ వెంకటేశం, అదీ ఇందులో ధర్మసూక్ష్మం. పాడును తగ్గించమన్నారుగదా అని నువ్వు చటుక్కున తగ్గించేసే కొంపలంటుకుపోతాయి. మరేంభయం లేదు. నీ ఇరవై వేల ఫ్రుటేజికీ ఎన్నడూ మోసం రాదు ఒక్కడుగు లోటు రాదు. పాతిక ముప్పై వేలు తీయ దల్చుకున్న హేమాహేమీలున్నారు. వాళ్ల వెనక నిలబడు మరేం ధోకా లేదు.

* * *

అంతే కాదు. మరొక ఉపద్రవాన్ని

కూడా నువ్వు కనక్కోలేక పోతున్నావు ఈ నిడివి తగ్గిస్తే, కథలో అక్కర్లేని పాటలూ అణాకాణీ డాన్సులూ పోయి అవకతవకలూ అతుకులూ గట్రా లేకుండా నీటుగా ఉంటుంది. అవలీలగా అది సహజంగా అమరిపోయి జీవితానికి దగ్గర్గా వెళ్ళిపోయి అందులో కలిసిపోతుంది. ఆపై నిహా శా చెప్పేదేవుంది.



ఇప్పటికీ మరో మరో విధాన గాపోయినా టెక్నికల్ హంగారయూల ధర్మమా అని పిక్చర్లు లైఫ్‌లైక్‌గా తయారై పోతున్నాయి సీమలో, స్మెల్లీసు వచ్చాక కంపు గొడుతున్నాయట ఇహ సెప్పుడో అప్పుడు "ఫీలీస్" గూడా రాకతప్పదు. అనగా మధుబాల మొహం నీకు బావుందని తోస్తే సినిమా చూస్తూ చూస్తూ ఆవిడ బుగ్గమీద చిటికెయ్యొచ్చుట. దిలీప్‌కుమార్ ధోరణి నచ్చక పోతే భుజంతట్టి అబ్బీ ఇటు తిరిగి నటించమనొచ్చు. మరోవాడూ మరోవాడూ పేల్తేగి పోతూంటేనె తినో మొట్టికాయ మొట్టొచ్చు. ఎవడన్నా ఏడుస్తూ ఉంటే వాణ్ణి కౌగిలించుకుని భోర్న మనవ్వాయాడవచ్చు. ఈవిధంగా జీవితం సినిమా యేకమై పోతాయి.

# మనసే ఎలా మనసులా

(31 వ పేజీ తరువాయి)

హించే ఆనందపువెల్లువకు అన్నయ్యవల్ల నిరోధం కలుగుతున్నదేమోనని భయం......

కాంతారావు షర్టు విప్పుతూ, ఏదో చెప్పుకుపోతున్నాడు: "చెల్లాయ్, ఇవాళే మైందనుకున్నావ్? వెళ్ళి లేబరేటరీలో కూచున్నానా—కూచుంది మొదలు ఒకటే తలనొప్పి. ఇహ, యిలా కాదని 'అపరేటస్' అక్కడే పడేసి కాంటీనుకుపోయి పూరీ, కాఫీ తీసుకున్నాను. ఆ పాడుపూరీ, తినేటప్పుడే నిన్నటి వాసన కొట్టింది. తీరా కాంటీనునుంచీ ఇవతలికొచ్చాక, తిన్నది తిన్నట్టే వాంతయిందనుకో. తరవాత..."

హేమ పరధ్యాన్నంగా వూఁకొట్టుతుండటం చూసి, చెప్పటం ఆపేశాడు కాంతారావు. తను వాంతి చేసుకున్నందుకు చెల్లాయి సానుభూతి కనబరుస్తుందనుకున్నాడు; ఆశాభంగమయింది. తన డిన్నరు హడావుడిలో అతడికి సరైన సావధానత చూపించలేకపోయింది హేమ. హేమ చికాగ్గా వుంది—

ఇందాక కుంపట్లో వుంచిన కాఫీ పోసుకు తాగమని అన్నయ్యకు చెప్పి, హేమ స్నానానికి వెళ్ళింది. రమణ అంతకుముందే స్నానంచేసి వెళ్ళి మేడమీద ముస్తాబవుతున్నాడు.

హేమ అనుకుంది: పొద్దున్న మార్కెట్టుకు పంపించినందుకు కొప్పడలేదా అన్నయ్య—పూలు తెచ్చాడే?—పూలంటే చాలా ప్రియం అన్నయ్యకు. అందులోనూ, నిండుగా విడిగిన పెద్దమల్లెపూలంటే మరీను! వూళ్ళోకూడా, సాయంత్రంపూట పాలేరుతో బాటు తోటలోకి వెళ్ళివచ్చేటప్పుడు రోజూ కోసుకొచ్చేవాడు.

—చిన్నతనపు స్మృతుల ప్రతిధ్వనివల్ల, అన్నయ్యపట్ల ఏదో వాత్సల్యంలాంటిది చిన్న తరంగంలా రేగింది ఆమె హృదయంలో. కాని అది క్షణంలోనే అణిగిపోయింది

స్నానంచేసి వస్తున్నది, వంటింటి గడప దగ్గర విస్తుపోయి నిలబడ్డది హేమ. కాఫీ వెచ్చబెట్టుకునేందుకు సతమతమవుతున్న కాంతారావును చూస్తే మొదట నవ్వొచ్చింది ఆమెకు. కుంపట్లో నుసంతా అతడి మొహంమీదా తలమీదా పడివుంది.

"ఏ వ్యక్తికి ఏ పనీ చాతకాదు, భోంచెయ్యటం తప్ప." అనుకుంది హేమ చిరాగ్గా. యూనివర్సిటీలో 'లేబరేటరీ' పనంతా సులభమా, వంటింటిపని? - అనుకుంది...పోనీ, తను వెచ్చ చేసిద్దామనుకుంటే, తను స్నానంచేసి వున్నదయ్యె! మళ్ళీ వంటింటి కూపంలో కెలాపోవటం?...

ఆమె అక్కడ నిలబడ్డ క్షణంసేపూ కాంతారావు ఆమెను గమనించలేదు. చల్లారిపోయిన కాఫీతో కుస్తీపడుతున్నాడు.

గదిలోకి వెళ్ళిపోయింది హేమ. పదినిముషాల తరువాత ఆమె తిరిగి వచ్చేసరికి కాంతారావు సావట్లో కూచుని వున్నాడు.

"కాఫీ తాగావన్నయ్యా?" అంది.

తల వూపాడు.

"వేడి చేసుకున్నావా?"

"ఊహుఁ. ఎంతసేపుంచినా వెచ్చబడితేనా? అలాగే తాగేశాను."

హేమకు కడుపులో చెయ్యిపెట్టి దేవినట్టయింది. అతడా మాటల్లో కాస్త కోపమో, కసురుకుదనమో, ఎత్తిపొడుపో చూపించివుండినా అలా బాధపడేది కాదు హేమ. అదేదీ లేకుండా, ఏమీ జరగలేదన్నట్టుగా, అమాయికంగా అతడు మాట్లాడుతుంటే, అతడికేమైనా అన్యాయం జరుగుతోందేమోననిపించిందామెకు.

రమణ మేడ దిగి వచ్చి హేమను తొందరపెట్టాడు. హేమ తలదువ్వుకుని తయారై వచ్చేలోగా బావమరిదితో పరిహాసమాడుతూ మాట్లాడాడు. తరువాత దంపతులిద్దరూ కలిసి వెళ్ళిపోయారు కాంతారావుతో చెప్పి. వాళ్ళు వెళ్ళుతుండగా కాంతారావు తనూ, అనూరాధా సినిమా ప్రోగ్రాం వేసుకున్నట్లు వెల్లడించాడు.

హేమ మొహం చిట్లించుకుంది.

డిన్నరు పూర్తయి, తిరిగి వచ్చేటప్పుడు కూడా హేమకివే ఆలోచనలు...అన్నయ్య వరసేం బావుండలేదు. అనూరాధతో సినిమాకు వెళ్ళకపోతేనేం? ఆ పిల్ల వగలమారి.

"ఏమండీ, సినిమా కెడదామా?" అని వుంటుంది, వెయ్యి వయ్యారాలు పోతూ. ఇహ అంతకంటేనా అనుకుని ఆయన సరేనని వుంటాడు...నాన్నకు రాస్తే స...ఏం? ఎందుకు రాయాలి? తనకేం అధికారం? తను చెల్లెలు గనక. అయితే? ఆయన బాగోగులన్నీ తనే చూస్తోందా? మరి—

**(ఇంకా ఉంది)**

---

తాతగారు — ఏమండీ, మేనేజరుగారూ, మా మనుమడు మీ ఆఫీసులో బాగా పని చేస్తున్నాడా?

ఆఫీసు మేనేజర్ — ఆఁ— ఇటీవలే మీరు చనిపోయారని పదిరోజులు సెలవు తీసుకున్నాడు!

—పి. కృష్ణస్వామి (కొల్లూరు)

---

# న్యూఢిల్లీ లేఖ

(15-వ పేజీ తరువాయి)

కాని పోటీని దేశంలో దాదాపు పూర్తిగా నిషేధించారు.

ఉత్పత్తి బృందాలు సమర్పించిన నివేదికలను చదివినందువల్ల ప్రయోజనం కలగాలి. ఈ నివేదికలు, సర్వసాధారణంగా అమెరికా, బ్రిటన్, జపాన్, జర్మనీ దేశాలలో ఉత్పత్తి పెరుగుదలకు ఉపకరించిన పద్ధతులను వివరించి, వాటిని మన దేశంలో అనుసరించే వీలులేదని పేర్కొంటున్నాయి. ఈ సమాచారమంతా పుస్తకాలలోనే లభిస్తుంది. కాబట్టి, వాటిని చూచే నివేదికలు తయారుచేసుకోవచ్చు.

బ్రిటిష్ ఉత్పత్తిమండలి ఆర్థిక సలహాదారుడు శ్రీ గ్రాహం హట్టన్ బ్రిటన్ ఉత్పత్తిని మించిసాగుతున్న జర్మనీఉత్పత్తిని దృష్టిలో ఉంచుకొని ఇలా అన్నారు.

"మన భవిష్యత్తు ఇంకా మన చేతులలోనే ఉన్నది. మనకు బ్రతుకుతెరువు చూపవలసిన అగత్యం ప్రపంచానికి ఏమీలేదు. బహిరంగ పోటీలో పాల్గొని జీవనోపాధిని మనం సంపాదించుకోవాలి. వారిని వీరిని నిందించి ప్రయోజనం లేదు. ఒకవర్గం రాజకీయవాదులను అధికారంనుంచి తప్పించి మరొక వర్గంవారిని ఎన్నుకున్నంతమాత్రాన ఒరిగేది ఏమీ ఉండదు. రాజకీయ చర్యల వల్ల ఉత్పత్తి పెరుగదు.

"వివిధ వృత్తులను, జీవనమార్గాలను, అనుసరిస్తున్న మనమంతా మన జీవనప్రమాణాలను అభివృద్ధిపరుచుకోవాలని కోరుతున్నాం. ఇందుకు కలిసి కట్టుగా కృషిచెయ్యటం అవసరం. త్వరితగతిని ఉత్పత్తిని అధికం చెయ్యాలి. పార్టీ రాజకీయాలను అధిగమించే జాతీయవిధానం రూపొందాలి. అంకెలతో సహా వివరాలు సేకరించి ప్రజలకు అందజెయ్యాలి. అన్నిటిని మించి, కలిసి పనిచేయటంపట్ల ప్రజలకు ఉత్సాహం కలిగించాలి."

ఇలాంటి సలహాను మనదేశంలో అమలు చేయగలగటం అనూహ్యం. ఒక నిబంధనావళిని రూపొందించి, దానిద్వారా ఉత్పత్తిని అధికం చెయ్యాలని కార్మికమంత్రి శ్రీ. జి. ఎల్. నందా ఆశిస్తున్నారు. విదేశాలకు ఉత్పత్తి బృందాలను పంపి శ్రీ మనూభాయ్ షా ఇదివరకే తమ పని పూర్తిచేశారు. ఐనా ఈనాటివరకు ఉత్పత్తి ప్రమాణాలు రూపొందలేదు. రాష్ట్రపతి ఇటీవల చెప్పినట్లు మనకు హక్కులపై అభిమానం మెండు. బాధ్యతలు మాత్రం పట్టవు. ఇలాంటి వాతావరణంలో ఉత్పత్తిని అధికంచెయ్యటం ఎలా సాధ్యం అవుతుంది? చెరుకు ఉత్పత్తి మన ఉత్పత్తికి గీటురాయి వంటిది. ప్రపంచంలోకెల్లా సగటున తక్కువ చెరుకు పండించేది మన దేశమే. 

# దక్షిణా నాయకుడు

(31-వ పేజీ తరువాయి)

వాళ్ళం. నాతో ఏమిటి మీకు?"

"నువ్వు నామాట వినకపోతే, నా ప్రేమ కాదన్నప్పుడు, నేను గొప్పవాడినైనే మిటుకు ఏం లాభం? నన్ను చావని. యీ జన్మలో కాకపోతే వచ్చేజన్మలోనైనా, నీ ప్రియుడుగా పుడతాను: శంభో మహాదేవ" అంటూ రంకె పెట్టి నీటివైపుకు వాలపోయాను.

ఈసారి చిన్నది, నన్ను గట్టిగా కౌగలించుకుని, "వద్దు చినబాబు. దండ యియ్యి" అని అంది.

ఈ జీవి తరించాడు.

"ఎందుకు చినబాబు నన్ను యింకా బాధ పెడతావు. నాకుమాత్రం మీమీద మనసు లేదా? పెళ్ళి కాకుండా యిట్లాంటి పనులు చేస్తే బొందతోనే ఘోర నరకానికి పోతారని అమ్మ చెప్పింది. ఇంటికి వెళ్లిపోండి. నా ఊసు మరిచిపోండి."

"అన్నీ అబద్ధాలు"

"కాదు. అమ్మ సత్తెమయిన మనిషి" అంటూ నన్ను వదిలి బయలుదేరపోయింది.

"ఇదుగో దండ"

"ఇయ్యండి" అని చెయ్యి చాపింది.

"ఉహూఁ నేనే తల్లో పెడతాను.

"అమ్మో!" అని అంది.

"ఏం ఫరవాలేదులే" మాట్లాడకుండా, ఒక్క క్షణం రెప్ప వాల్చకుండా నావంక చూసింది. మగువల కన్న ఎక్కువ శ్రద్ధతో మనం చేసుకున్న ముస్తాబు పూరికే పోలేదు. మెల్లగా నా దగ్గరకువచ్చి నిలబడి, వెనక్కి తిరిగింది. పువ్వులు చిన్నదాని సిగలో అమరినాయి. ఇంతవరకు ఎక్కుపెట్టి ఉంచిన విల్లు ఒక్కసారి సంధించి అనంగుడు విడిచేసరికి, ఒక పూల బాణం నా గుండెల్లోంచి, దూసుకుని చిన్నదాని హృదిలో నాటుకొంది. నేను మనస్సులోనే ఒక్కసారి "అయం ముహూర్తః సుముహూర్తః" అని అనుకొని, రెండు భుజాలు పుచ్చుకుని, ఆ మన్మథ మొలకను నావైపుకు త్రిప్పుకున్నాను. మేము, తన్మయులై ఉన్న క్షణంబున 'చంద్రశేఖర! చంద్రశేఖర పాహిమాం' అంటూ వినపడగానే, మేమునివ్వెరబోయి,నిలబడి,క్షణంలో దూరమయ్యాము. ఎదురుగా నాన్న నిలబడి ఉన్నాడు. శివపూజకోసం వచ్చిన ఆ పరమ శాంతిమూర్తి మమ్మల్ని ఈ భంగిమలో చూడగానే, ప్రళయకాలరుద్రుడై నిప్పులు కురిపించాడు. ఆయన దగ్గరే ఫాలలోచనంగాని, త్రిశూలంగాని, ఉన్నట్లయితే, మమ్మల్ని యిద్దరిని, హతమార్చేవాడే. అదృష్టవంతులం అవి లేవు కాబట్టి బ్రతికిపోయాం.

"నా కడుపున చెడబుట్టావురా. ఏమిటో అని అనుకున్నాను. ఇంత అప్రాచ్యుడవని అనుకోలేదు. పవిత్రమైన దేవాలయందగ్గరా, నీరంకుపురాణాలు. ఛీ! నీ ముఖం నాకు చూపించకు" అంటూ ఆయన, గిరుక్కున వెనక్కి తిరిగి, స్వామి దర్శనంకూడా చెయ్యకుండా వెళ్ళిపోయాడు.

నాకు నిజంగానే చచ్చిపోదామనిపించింది. సుందరి ముఖాన్న నెత్తురుచుక్క లేదు. భయంతో వణికిపోతోంది. కన్నీరు మున్నీరవుతోంది.

"ఊరుకో. ఏం ఫరవాలేదు" అని అన్నాను.

"పెద్దయ్యగారు చూశారు. మిమ్మల్నేం చేస్తారో!"

"నన్నేమీ చెయ్యరులే. భయపడక, యింటికి వెళ్లు" అంటూ ఆ మనిషిని పంపించాను.

నేను మాత్రం రాత్రి బాగా ప్రొద్దుపోయేదాకా గుళ్లోనే కూర్చొని, మెల్లిగా యింటి ముఖం పట్టాను. ఇంటిదగ్గర జరగబోయే కొండ తలుచుకుని, మనస్సుకు చికాకు కలిగింది. నాన్న మీదకోపంకూడా వచ్చింది,—

"చిన్నది రవ్వంత దారిలోకి వస్తూంది. కృష్ణ రామాఅంటూ యింట్లో కూర్చోకుండా అప్పుడే యిక్కడ అవతరించాలా. వచ్చాడయ్యా, పోనీ, చూసినా చూడనట్టు వూరుకోకూడదు? ప్రణయసన్నివేశంలో ఉన్న ప్రేయసీప్రియులకు అండగా, పార్వతిదేవి యిచ్చిన శాపం యీయనకు తెలియదు కాబోలు. రెండు ప్రేమైకజీవులకు, ఎడబాటు, భయం కలిగించి, ఘోర రౌరవాది, నరకాలకుపోయే, పాపం మూటగట్టుకున్నాడే. నన్ను కన్నవాడికి ఎంత ఆపద వచ్చింది. అమ్మా! పార్వతి, జగన్మాత... ఇది తెలియక చేసిన పాపం తల్లీ, కరుణించవమ్మా" అని ప్రార్థించాను.

ఇంటికి చేరేసరికి దీపపు వెలుగు కనిపిస్తోంది. రవ్వంత బిగ్గరగానే, నన్ను కన్నవాళ్ళ కంఠాలు వినిపిస్తున్నాయి. నాన్న ఏదో అనేసరికి అమ్మ,

"అయినా వాడిని ఆడిపోసుకుని ఏం లాభం? ఏ వయస్సులో జరగవలసిన పని ఆ వయస్సులో జరుగకపోతే యింతే!"

"ఇంతకూ నాదే తప్పంటావు."

"నేనేం అనటంలేదు......దీన్ని గురించి రగడ చేసుకుంటె, అల్లరిపడేది మనమే"

"అయితే నోరు మూసుకుని, ఆ వెధవచేసే తప్పుడు పనులన్నీ చూస్తూ ఊరుకోమంటావా?"

"మంచి సంబంధం చూసి పెళ్ళి చెయ్యమంటాను"

"ఇహ మనవాడికి పిల్ల నెవరిస్తారే?"

"మనమే యిల్లా యాగీ చేసుకుంటే, నిజంగానే యివ్వరు. ఉదయమే వెళ్ళి, వచ్చిన సంబంధం స్థిరపరుచుకు రండి."

అమ్మకు మనసార మ్రొక్కి, వసారాలో కటిక నేలనే నిద్రపోయాను.

మరునాడు ఉదయం నాన్న నన్ను చూసి మాట్లాడలేదు. నన్ను నమిలి మింగేద్దామన్నంత కోపంగా ఉన్నాడు. అమ్మ ముభావంగా ఉంది. ప్రొద్దున్నే ఊరువెళ్లిన నాన్న రెండు రోజులదాకా తిరిగి రాలేదు. రావటం, వుత్తి చేతులతో తిరిగి రాలేదు. ఒక ఘనకార్యం సాధించివచ్చాడు. ఒక రాక్షసకన్నను నాకు వధువుగా నిర్ణయించి, తాంబూలాలు పుచ్చుకుని మరీ తిరిగి వచ్చాడు.

"అత్తయ్య చాలా మంచిది మామయ్యా"

"ఆకారం విషయం అబ్బే మనం చెప్పేది. మనస్సు మెత్తటిదేలే. నెల తిరగకుండానే, నేను, చెయినులుగారికి దశమగ్రహాన్ని అయ్యాను."

"మామా, మరి సుందరి?"

"లక్షణంగా పెళ్ళి చేసుకుని, గంపెడు పిల్లల్ని కన్నది."

"మరి తీరని నీ మక్కువ?"

"మాయక మనసున నిలిచింది. ఆ తలపే కదరా మనకు ఎప్పటికీ, తియ్యని కల"

"కృష్ణలీలలు అయ్యాయా?" అంటూ అత్తయ్య ఆరు కంఠాలతో పలుకరించింది.

ఆ పలుకరింపుకు, ఆ పరగాణాలోవుండే, పసిపిల్లలంతా, త్రాగే పాలు మాని, గుక్కపెట్టి ఏడవటం మొదలుపెట్టితే, వయస్సుమళ్లినవాళ్ళు, ఒక్క క్షణం హడిలి, "అర్జున, ఫాల్గుణ, కిరీటి, శ్వేతవాహన" అని జపం చేసుకుంటూ, పడని పిడుగునుంచి, కాపాడుకునే ప్రయత్నంలోఉండగా, నేను, చేష్టలు దక్కి శిలనైపోతే, మామయ్యమాత్రం, చిరునవ్వు నవ్వి, చుట్ట యింకోకసారి తాపీగా పీల్చి, దూరంగా పారేసి,

"అంతా అయినట్టే. కాళిందీ మర్దనం ఒక్కటె మిగిలింది" అంటూ యింట్లోకి నడిచాడు.



ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# గళ్ల నుడికట్టు-28

## ఆ ధా రా లు



### నిలువు

1. అంటూ అన్నమాట.
2. మాటన్న మాట. బంగారమన్న మాట.
3. ఇటుకాదని అటు్నించివచ్చినా గుచ్చు కుంటుంది.
4. కోటలోకి వెళ్లేవారూ వచ్చేవారూ కూడా దాటి తీరాల్సిందే.
5. ఇది వేసిచూడండి. మీ కావలసిన ప్రశ్నకి జవాబు కనిపిస్తుంది. లేక పోతే ఇలాటిదే కొత్త తలకి పట్టించు కోవాలి.
6. ఇంతదూరం జనం వచ్చారు. వారిని సంతోష పెట్టాలి.
11. పన్నీటిని మెచ్చనిది మెచ్చేది.
13. ఆచ్చ తెలుగులో అబద్ధం చెప్పి చూడండి.
14. గుడిలో రాతిపందిరి.
15. చివర వేడిగా ఉండే యుద్ధం.
16. కల కరిగిపోయి, కళ్లకి కలిగింది.
17. మరీ చీకటి కనక జాగ్రత్త. కసాయి వాళ్లు దారికాని ఉంటారు.
22. కొంగ బుషుల్ని చూసి చేసే 'పారడీ.'
24. లాభానికి చుక్కెదురు.

### అడ్డము

3. రవిక.

5. చెట్టు చిన్ననాటి ముచ్చట లాలో చించండి. జవాబు మొలకెత్తుతుంది.
7. ఉక్తి చవటమాట.
8. దనుజుడి జోడీ.
9. ప్రజాస్వామ్యంలో నాయకుల న మించిన ఘనత దీనిదే.
10. కంబుకంఠం చివర తెగిపోయి కుడీ ఎడమా ఒక్కలాగే ఉంది.
12. ఆనందవనంలో ఆఖరి మాట తీసేస్తే స్వర్గలోకపు ఉద్యానవనం కనిపిస్తుంది.
14. ఆలమంద భంగటిశంగాని పెట్టి భద్రంగా ఉందోలేదో చూడండి.
16. కరక్కాయ తిరిగేసినా మారుగిల పడదు.
18. వాడినకొద్దీ మరింత పరిమళించే దాన్ని ఎవరు 'క్రీ్రించ' గలరు ?
19. గలభాజరిగి గల్లంతై పోయింది.
20. "విపరీతమైన" చీకటి !
21. పాపం జరంవచ్చినందువల్ల ఇంగులో బందీ అయిపోయినట్టున్నాడు.
23. చూడకన్న మాట. అంచేత ఎట్నుంచేనా ఒకటే.



## 27-వ గళ్లనుడికట్టుకు ఆధారాలు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | 2 ని | ■ | 3 సా | మ | 4 ము | ■ | 5 రా | మ | 6 స్వా | 7 మి |
| 8 మా | లు | శో | గు | ■ | 9 దం | 10 డో | రా | ■ | 11 తి | త్తి |
| వ్యా | ■ | ■ | ■ | ■ | ■ | లి | ■ | ■ | వా | ■ |
| 12 ము | 13 ధి | ■ | ■ | 14 సా | ■ | క | ■ | ■ | 15 న | 16 తా |
| ■ | 17 లా | క్షే | త్వ | ము | ■ | 18 లు | వా | ■ | ■ | మి |
| 19 సే | సాం | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | 20 న | రం |
| కొ | ■ | ■ | 21 రా | 22 మ | ■ | 23 తె | ల | గ | డ | ■ |
| 24 య | 25 కొ | ■ | ■ | ధ్యా | ■ | ల | ■ | ■ | 26 వ | 27 గ |
| ■ | డె | ■ | ■ | క | ■ | ■ | ■ | ■ | ■ | డ |
| 28 ము | ఝ్హు | ■ | 29 నే | ర | 30 జం | ■ | 31 కి | ల | 32 హా | స |
| 33 ని | లు | క | డ | ■ | 34 గం | గా | ధ | ■ | 35 గు | రి |

ఉపాధ్యాయుడు — ఏనుగు మీద వ్యాసం వ్రాయమన్నానుకదా ఎందుకు వ్రాయలేదురా?

విద్యార్థి — అది చాలా ఎత్తుగా ఉంది, అందలేదండి.

—మద్దూరి ఆదినారాయణమూర్తి (నవాబుపాలెం)

* * *

ఉపాధ్యాయుడు — రామూ, జలచరము లనగానేమి?

రాము — నీటిలో సంచరించునవి సార్.

ఉపా—చంద్రం, నీటిలో చరించే కొన్నిటిని పేర్కొనుము.

చంద్రం—పడవ, స్టీమర్, లాంచి.........

—టి. ఆనందం (కర్నూలు)

## రెండూ కావాలి!

ఒకామె రాముని బొమ్మ ఖరీదెంత అని దుకాణం యజమానిని అడిగింది. రూపాయి పావలా అన్నాడు అతడు.

లక్ష్మణుని బొమ్మ ఖరీదెంత అని అడిగింది ఆమె. అదికూడా రూపాయి పావలాయే అన్నాడు అతడు.

"అదేమిటి? రాముని కన్న లక్ష్మణుడు చిన్నకాడా" అన్నదామె.

"మీకు కావలసింది బొమ్మా, ధరా" అనడిగాడు దుకాణం యజమాని.

"రెండూను" అన్నదామె.

"అయితే ఈకోతిబొమ్మ తీసుకోండి. అది రామలక్ష్మణుల కన్న చిన్నది. ధరకూడా తక్కువ" అన్నాడు దుకాణం యజమాని.

—గంగిశెట్టి రమేష్ (సికిందరాబాదు)

* * *

## 'నేనూ నీలాంటివాడనే'

ఒక వ్యక్తి ఉద్యోగము ఎక్కడా దొరక్క సర్కసు మానేజరును కలుసుకొన్నాడు. ఏదైనా పని ఇప్పించమని బ్రతిమాలాడు; ఐతే పులివేషమువేసి సింహముదగ్గరకు వెళ్లాలి అన్నాడు మేనేజరు. ముందు భయపడినా ఆఖరికి ఒప్పుకొన్నాడు, అతడు. సింహము దగ్గరికి వెళ్లేసరికి గుండె జారిపోయింది. అంతలో అందులోనుంచి 'నేనూ నీలాగే ఉద్యోగములేక చేరినవాడనే' అని వినిపించేసరికి ఆశ్చర్యపోయాడు ఆ వ్యక్తి.

—అత్తిలి లక్ష్మీనారాయణరావు, (విశాఖపట్టణము).

## బహుమతి పొందిన కార్టూన్




—చిత్రకారుడు—సి. లక్ష్మణరావు (బందరు)

## లక్ష్మి గ్రుడ్డిదే!

తైమూరు కుంటివాడయినా మహా యోధుడు. హిందూదేశం ఆక్రమించాడు. అంతులేని ఐశ్వర్యం లభించినది.

కుంటి తైమూర్ సంగీతం అంటే చెవికోసుకొనేవాడు. ఒకనాడు అంధురాలు అయిన ఒక గాయకురాలు ఆయన కొలువులో పాడి అతని మెప్పు పొందినది. తైమూరు ఆమెకు గొప్ప బహుమతి ఇస్తూ "నీపేరేమి" అని అడిగాడు.

"లక్ష్మి" అన్నది ఆ అంధురాలు.

"ఏమి, లక్ష్మి గ్రుడ్డిదా" అని తైమూరు అవహేళన చేశాడు.

దానికి ఆ అంధగాయని ఇలా బదులుచెప్పింది: "అవును. లక్ష్మి గ్రుడ్డిదే. కాకపోతే ఒక కుంటివానివద్దకు ఎలా వస్తుంది?"

తైమూర్ తల వంచుకొన్నాడు.

—చిత్ర: విక్రమపాల్, (రాజమండ్రి.)

* * *

ఒక తెలుగు లెక్చరరు కోరికపై క్లాసులోని విద్యార్థులందరూ తలా ఒక్కొక్క పద్యం స్వీయకవిత వ్రాసి తెచ్చి అందించారు. మాస్టారు అందులోంచి ఒకరి పద్యం తీసి చదివి, ఆ పద్యం ఎవరిదో ఆ అబ్బాయిని లేచి అందరికీ కనిపించమన్నాడు. ఆ అబ్బాయి లేవగానే "అహా! పోతనామాత్యా! తాము దివంగతులైనట్లు పెక్కేండ్లుగా ఆంధ్రలోకంలో కింవదంతి. గదరా" అన్నాడు లెక్చరరు. క్లాసంతా గొల్లుమంది.

—భట్టారం రాధాకృష్ణయ్య, (కొవ్వూరు)

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd., by S. Radha Krishna at TheAndhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

# మా ఇంటి వాడుకకు
# బ్రూక్ బాండ్
# స్పెషల్ హోటల్ బ్లెండ్
## డస్ట్ టీ




తోట పదును తాజాగా వుండే అమోఘమైన యీ బ్రూక్ బాండ్ స్పెషల్ హోటల్ బ్లెండ్ టీని మీరు త్రాగి ఆనందించండి. ప్రతి ప్యాకెట్టూ మీకెన్నో కప్పుల కమ్మని టీని ఇచ్చును.

**3 సైజులలో లభించును-**

**1** పౌను (453.6 గ్రాములు)
**4** ఔన్సులు (113 4 గ్రాములు)
**2** ఔన్సులు (56 7 గ్రాములు)

**నేడే ఓ ప్యాకెట్టు కొని ఇంటికి పట్టుకెళ్లండి**

BB 351R1

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్